# విషయ సూచిక.

——(o)——

పుట.



స్పెయిన్ అంతర్యుద్ధం.
ఆగస్టు,1937 వరకు వి
దాశీవాలు గెల్చిన ప్రదేశం.
ఫ్రాన్సు
బాస్కు రాష్ట్రం
బర్గోస్
విటోరియా
సారగోసా
వెల్లడొలిడ్
సాలమాంక
బార్సిలోనా
మాడ్రిడ్
టొలిడో
వాలెన్షియా
అలికాంటి
మూర్షియా
బెడజాజ్
గ్రెనడా
అండలూసియా
మలాగా
కేడిజ్
జిబ్రాల్టర్ జలసంధి (బ్రిటిష్)
స్పెయిన్ మొరాకో
బేలరిక ద్వీపాలు
మెడిటరేనియన్ సముద్రం
పోర్చుగల్
విదాశీవాలు ఆక్రమించుకున్న ప్రదేశం.
రిపబ్లిక్ పరిపాలిస్తున్న ప్రదేశం
స్పెయిన్ చిత్రపటం

# మనవి.

—(౧)—

ఏదన్నా ఒక గ్రంథం వ్రాయాలంటే, భాషా ప్రవేశంబాగా ఉండడం అవసరం. దీనికి తోడుగా, వ్రాయబోయే విషయాన్ని గురించి సమగ్రమైన జ్ఞానం ఉండాలి. లేనిచో పదిమంది చదివి ఆనందించరు. ఆంధ్రుడనైనప్పటికీ తెలుగులో పరిచయం తక్కువయినా, ఈ గ్రంథాన్ని వ్రాయుటకు నాకు స్పెయిన్ సమస్యయందున్న గాఢాభిమానమే ముఖ్యమైన కారణం.

మన దేశంయొక్క ఆర్థిక రాజకీయ స్వాతంత్ర్యం చాలావరకు ప్రపంచ రాజకీయ పరిస్థితులమీద తప్పక ఆధారపడును. నాలో ఈ అభిప్రాయం కలిగిన యీ కొద్ది మూడు నాలుగు సంవత్సరాలనుంచి ప్రపంచ రాజకీయ రంగమును అందుముఖ్యంగా యూరపు రాజకీయాలను గురించి తీవ్రమైన బుద్ధితో చింతన చేస్తూ వచ్చాను. పాశ్చాత్య దేశాలలోని రాజకీయ జ్ఞానంగల ప్రతివ్యక్తి కూడా తన దేశసమస్యలను ప్రపంచ రాజకీయాలతో జోడించి, వాటినిగురించి శ్రద్ధగా పరిశీలిస్తూ, వాటి కనుగుణ్యంగా ఆర్థిక రాజకీయోద్యమాలను నడుపుతాడు. ఈ విషయాన్ని మనం యింకా ఇతరుల వద్దనుండి

జ్యాన్ని సుస్థిరంగా స్థాపించుకోవడమే వాటి పరమావధి. ఈ ఆశయం నెరవేరుతుందా లేదా అనే సమస్య నేటి స్పెయిన్ పోరాటంలో తేలిపోతుంది.

ఈ మహాయుద్ధంలో తేలవలసియున్న సాంఘిక, అంతర్జాతీయ సమస్యలు, అబద్ధ ప్రచారంవల్ల (ఇది ప్రతియుద్ధంలో సహజమే) మరుగుపడి ఉన్నాయి. ఫ్రాంకో యొక్క అసత్యప్రచారంవల్ల, స్పెయిన్ స్వాతంత్ర్య పోరాటంయొక్క నిజస్వరూపం గోచరం కావడంలేదు. స్పెయిన్ ప్రభుత్వం మతప్రచారం మీద దాడికి వెడలి నాశనం చేస్తున్నదని ఒక అలాప నింద బయలుదేరి, చివరకు ప్రభుత్వంపైన ద్వేషాన్ని కలిగించింది. నిశ్చయంగా ప్రభుత్వం సహృదయమైన కార్యాలకు మత ప్రచారకులను గౌరవించి, మత ప్రచారానికిపూర్తి స్వాతంత్ర్య మిచ్చింది. కాని వారు దానిని దుర్వినియోగం చేసుకొన్నారు. ఈ విషయం తెలుసుకోక, మొదట్లో ప్రభుత్వ పక్షంగావుండి స్పెయిన్ విజయం కోరి యూరపులో శాంతి సంస్థాపన కొరకు అభిలషించిన కొందరు, ఇప్పుడు ప్రజాప్రభుత్వంకంటె ఫ్రాంకో ఆధిపత్యాన్ని అభిమానించుచూ వచ్చారు. అందుకు సాయముకూడా చేస్తున్నారు. ఒక వైపున సైన్యాధికారుల మతాధికారుల, భూస్వా

నేర్చుకోవాలె. నిజమైన జాతీయ స్వాతంత్ర్యంకొరకు పోట్లాడేవారు జాతి, మత, రంగుభేదాలనుగాని, సరిహద్దు భేదాలనుగాని పాటించక, తమమాదిరి ఆర్థిక రాజకీయ దాస్య శృంఖలాల్లో చిక్కుకొని పీడింపబడే పరాయి దేశపు సోదరులకు తప్పక తోడ్పడాలె. భారత దేశపు స్వాతంత్ర్యోద్యమం ఇప్పుడు నూతన ఘట్టంలో ప్రవేశించింది. కేవలం రాజకీయ స్వాతంత్ర్యమే మన లక్ష్యంగా పాటించక దానితోపాటు ఆర్థిక స్వాతంత్ర్యాన్ని కూడా సాధించకపోతే, ప్రజా సామాన్యంయొక్క స్థితి ఇంత మొందదని మనం గ్రహించాలి. కొంతవరకు గ్రహంచాము కూడాను. నేడు స్పెయినులో వారి ఆర్థిక రాజకీయ స్వాతంత్ర్యాన్ని నేలమట్టంచేయ ప్రయత్నించుచున్న ఫాసిస్టు, మిలిటరీ దోపిడి గాండ్రను నాశనం చేయుటకై శపథం మన సోదరులు పట్టాలి. కాబట్టి మనం వారికి సహాయం చేయుట, సామ్రాజ్యతత్వాన్ని నశింపజేయుటయే యగును. సామ్రాజ్య వ్యతిరేక పోరాటాన్ని పెంపొందింప చేసుకొనుటయే యగును. ఏలనన, ఫాసిజమును, ఇంపీరియలిజమును అన్నదమ్ముల వంటివి. ఒక్క స్పెయిన్, అబిసీనియా దేశాలను గెలవడంతోటే తృప్తిచెందే స్వభావం వాటికుండదు. వీలయితే యావత్ప్రపంచాన్ని కూడా జయించి తమ సామ్రా

ముల, పారిశ్రమాధికారుల, నిరంకుశత్వానికిని, రెండవ వైపున న్యాయశాస్త్ర రీత్యా ఎన్నుకొనబడి, కష్టజీవులకు సుఖజీవనోపాధి కలిగించుటకై సర్వవిధాలా అవస్థపడు చున్న ప్రజాప్రభుత్వానికిని తారతమ్యం తెలుసుకోలే నంత మందమతులయినారు.

స్పెయిన్‌లో అంతర్యుద్ధం ఆరంభమయినప్పుడు, నా మిత్రులతో గూడా నేను కారాగృహంలో ఉన్నాను. అప్పటినుంచి నాకు స్పెయిన్ చరిత్రను గురించి పూర్తిగా తెలుసుకోవాలని ఆతురత బయలుదేరింది. ప్రయాసపడి కొన్ని ఆంగ్ల గ్రంథముల మూలమునను స్వదేశ, విదేశీయ వార్తాపత్రికల వల్లను, ఇంకా ఇతర వార, పక్ష, మాస సంచికలనుండి స్పెయినుకు సంబంధించిన విషయాన్ని ఓపికతో సంగ్రహించాను. ఈ సేకరించిన పదార్థాన్ని పుస్తకరూపంగా ప్రచురించి ఆంధ్రలోకానికి, ముఖ్యంగా కార్మిక కర్షక క్షేమాన్ని ఆశించే యువతీ యువకులకు సమర్పించా లనుకొన్నాను. మిత్రు లిచ్చిన ప్రోత్సాహాన్ని అనుసరించి అచ్చొత్తించుటకు నిశ్చ యించాను. విషయం విపులంగా వ్రాస్తే ఖరీదెక్కువ అవుతుంది. నవలలు, నాటకాలకు వెచ్చించే ఖరీదే రాజకీయ గ్రంథాలకుగూడా వెచ్చించాలని తలచే ఆంధ్రులకోసం పుస్తకం క్లుప్తీకరించాలిసి వచ్చింది.

ఇదినా ప్రథమ ప్రయత్నం అవడంచేతను సహజంగా భాషాప్రవేశం తక్కువ గనుకను అభిప్రాయాలు సరిగా స్పష్టీకరింపబడి యుండక పోవచ్చును. ఈ పుస్తకంయొక్క ముఖ్యాభిప్రాయం విషయ పరిజ్ఞానం కాని, పాండిత్య ప్రదర్శనం కాదు. కనుక పాఠక మహాశయులు యిందలి విషయాన్నే గ్రహించెదరని కోరుచున్నాను. పుస్తకం మొదట్లో, స్పెయినుయొక్క ముఖ్య యుద్ధరంగాలను, స్పెయిన్, మొరాకో, జిబ్రాల్టర్ జలసంధి దాని ప్రాముఖ్యతను, యితర ప్రధాన స్థానములను చూపించు ఒక స్పెయిను దేశపు చిత్ర పటాన్ని పాఠక మహాశయుల ఉపయోగం కొరకు చేర్చి యుంచబడినది.

గ్రంథమాల వారిని అడిగినంత మాత్రానే ఒప్పుకొని త్వరలో ప్రచురించినందుకు నేను వారికి మిక్కిలి కృతజ్ఞుడను.

గుంటూరు,
1-10-1937.

గ్రంథకర్త.

# పీఠిక

—(o)—

స్పెయిను అంతర్యుద్ధసమస్య, యీనాడు ప్రతి రాజకీయవేత్తను కలవరపెట్టుచున్నది. సన్నిహిత భవిష్యత్తులో అన్ని యూరపియన్ ప్రజాప్రభుత్వముల యొక్కయు, ముఖ్యంగా ఫ్రెంచి, రష్యన్, బ్రిటిష్ ప్రజా ప్రభుత్వములయొక్క బ్రతుకు యీ సమస్యా పరిష్కారంమీదనే ఆధారపడియున్నది. ఈనాడు స్పెయిన్ సమస్య కేవలం ఆ ఒక్క దేశ సమస్యగానే కాదు. అంతర్జాతీయ శాంతి భద్రతలుగూడా దీనిలో అనివార్యంగా చిక్కు బడియున్నవి. ఒక విషయం మాత్రం స్పష్టం - అభివృద్ధి నిరోధక వర్గమున్నా, (Reactionary Right) తీవ్రవాద వర్గంలోచేరిన లిబరలున్నా, రిపబ్లికనులు, అనార్కిస్టులు, సోషలిస్టులు, కమ్యూనిస్టులూ, పరస్పరం అంతఃకలహాల్లో మునిగి యున్నంత వరకూ, సర్వవిధాలా, స్పెయిన్ దుస్థితిలో నుండక తప్పదు. పరస్పరభిన్నములు, విరుద్ధములు అయిన ఈ రాజకీయ కక్షలలో ఏది జయించినా, బ్రిటిషు ప్రభుత్వమునకు ప్రస్తుతం అత్యవసరం అయివున్న మెడిటరేనియన్ యాజమాన్యానికి ప్రమాదం సంభవిస్తుంది.

ప్రస్తుతమున్న రిపబ్లికు ప్రభుత్వాన్ని, ఫాసిస్టులే గెలవడం గలిగితే, వారు సహజంగా ఇతరఫాసిస్టు రాజ్యాలయిన ఇటలీ, జర్మనీ, పోర్చుగల్ రాజ్యాలతో సంధి బాంధవ్యాలు ఏర్పరచుకోవడం నిజం. విశేషించి అబిస్సీనియా యుద్ధానంతరం, ఇటలీ మెడిటరేనియన్ సముద్రంలో ప్రబలమైన అధికారం సంపాదించింది. తన అధికార పరిమితిని (Sphere of influence) ఇంకా ఇంకా పెంచుకోడానికి అవకాశాలకొరకు నిరీక్షిస్తుంది. ఒకవేళ స్పెయిన్ ప్రభుత్వం విద్రోహులకు ఓడిపోవుట సంభవిస్తే, మెడిటరేనియను రాజకీయాల్లో, ముస్సోలినీ సర్వాధికారి అవుతాడు. ఈవిధంగా దానిమీద బ్రిటిషు యాజమాన్యం క్షీణిస్తుంది. స్పెయిను సమస్యపై సామాన్యస్పెయిను దేశస్థుని అభిప్రాయం ఎలావుందో చూపించడానికై "సాలిడారిడాడ్ ఒబ్రిరా" అనే అనార్కిస్టు పత్రికలోనుంచి ఈ దిగువ వ్యాసభాగాన్ని ఉదహరిస్తాను.

"అబిస్సీనియా వ్యవహారం పరిష్కారమయిన తర్వాత అంతకంటె యింకా ప్రమాదకరమైన సమస్య యూరపునకేగాక ముఖ్యంగా స్పెయినుకు ఉదయిస్తున్నది. సూయజ్ కాలువలో బ్రిటను నిర్మించుకొన్న అభేద్యమైన దుర్గాన్ని సునాయాసంగా భగ్నంచేశిన

ఇటలీ, యిప్పుడు జిబ్రాల్టర్ జలసంధిమీద కన్ను వేసింది. ఉత్తరదక్షిణ అమెరికాలలో తమ వ్యాపారాన్ని సురక్షితం చేసుకొనుటకు సులభమార్గాలకై ఇటలీ ప్రయత్నిస్తున్నది. స్పెయినుమీద తమ ప్రభుత్వాం స్థాపించడానికి ఇటలీ యింత ఆదుర్దా పడడానికికూడా ఇదే కారణం. ఇక్కడ మనకు అపారమయిన నష్టం కలుగుతుంది. ఇంగ్లండుకు ఇటలీకిని యుద్ధం ఈ జలసంధిలోనే తప్పక జరుగుతుంది. 'లావెంటి' రాష్ట్ర సముద్రతీరమును, బేలరిక్ దీవుల ప్రాంతమూ నౌకా యుద్ధరంగ మవుతుంది. తన నౌకాశ్రయముల నిర్మాణాం కొరకు మన సముద్రతీరం చాలా అవుసరం గనుక, స్పెయిను దేశాన్ని యుద్ధంలోకి యీడ్వడానికి ఇంగ్లాండు సర్వ ప్రయత్నాలు చేస్తున్నది.''

సోషలిస్టులు జయించడం అంటే శక్తివంతము, అజేయమయిన స్పెయిన్ యొక్క పునర్జన్మయు, ఫాసిజమునకు గొప్ప బల్లెపుపోటన్నమాట. అంతేకాక, స్పెయినులో సోషలిజమే నిలిస్తే, అయాచితమైనట్టి, అపాయకరమైనట్టి బ్రిటిషు జోక్యాన్ని ఒక క్షణంకూడా సహించదు. షుమారు 350 సంవత్సరాలకుపైగా బ్రిటిష్ విదేశాంగ రాజనీతికి, స్పెయినుయొక్క దుర్బలత్వమే మూలకారణంగా వుండేది. కాని అది యిక

ముందు సాగడానికి క్షణం వీలులేదు. పయోముఖ విషకుంభాల మాదిరిగా నటిస్తూ, తనకు మిక్కిలి ప్రమాదకరంగా వున్న పరిసర ప్రభుత్వాల అవినీతికరమైన పన్నాగాలను, స్పెయిను కార్మికులేగాక ప్రజలందరుకూడా బాగా గ్రహించారు. ప్రపంచంలోని కార్మికులున్నూ, ఇతర పీడిత ప్రజలున్నూ బ్రిటిష్ సామ్రాజ్యతత్వం నశించితేనేగాని తమ్ము బంధించి యుంచిన ఆర్థిక రాజకీయ దాస్యంనుంచి విముక్తి లేదని పూర్తిగా గ్రహించారు. సోవియటు రష్యా సాధిస్తున్న ప్రతివిజయమున్నూ ప్రపంచంలోని కష్టజీవులకు ఆత్మవిశ్వాసాన్ని, నూతనోత్సాహాన్ని కలిగిస్తున్న దనడంలో సందేహం యేమీ లేదు.

స్పెయినులోనే మొదటిసారిగా సోషలిస్టులు, అనుభవంవల్ల నూతన ఎత్తులు నేర్చుకున్నారు. సోషలిజం 1917-వ సంవత్సరంలో రష్యాకు ఎంత సమీపంలో ఉందో, యీనాడు స్పెయినుకుగూడా అంతే దగ్గరలో వున్నది. ప్రజలయొక్కయు, ముఖ్యంగా కార్మిక కర్షకుల యొక్క ఉత్తమనీతిని, పట్టుదలను బట్టి చూచినా, భిన్నభిన్నములైన మితవాద, తీవ్రవాద పక్షముల సమిష్టి కృషినిబట్టి చూచినా, స్పెయిను ప్రజాప్రభుత్వంయొక్క విజయాన్నిగురించి మనం సంపూర్ణవిశ్వాసంతో ఉండడం సహజం.

ప్రస్తుతం స్పెయిను దేశంలో జరుగుచున్న అంతర్యుద్ధం, ఫాసిస్టు దురంతాలకు, అత్యాచారాలకు మరియొక స్పష్టమైన ఉదహరణ యిస్తున్నది. స్పెయినులో ఫాసిస్టులకు అండగా ఉన్న రాజ కుటుంబీకులును (Monarchists), మతాధికారులును(Clergy,) కలుగచేయుచున్న రక్తపాతానికి అంతులేక పోవడమేగాక, మున్నెప్పుడును చరిత్రయందు కని విని యెరుగనంతటి దారుణంగా ఉన్నాయి. అభివృద్ధి నిరోధకవర్గం (Reactionary Right) యీమహాసంగ్రామంలో కమ్యూనిస్టులయెడలా, కార్మిక కర్షకులయెడలా, స్త్రీలు, పసికూనలయెడలా గావించు అకృత్యాలు వింటుంటే కడుపు తరుక్కొనిపోతున్నది. విద్రోహులే స్పెయిను దేశాన్ని జయిస్తే, అమాయకులైన ప్రజలను యింకెన్ని విధాల బాధించి హతమారుస్తారో నని మహాభయమేస్తున్నది. నేడు స్పెయిను యుద్ధంలో వీరనారీమణులు ధైర్యస్థైర్యములలో తమ సోదరులతో సమానంగా పోరాడుచున్నట్లు, ప్రపంచ చరిత్రలో యెన్నడును, వ్రాశియుండలేదు.

స్పెయిను ప్రజాప్రభుత్వ రక్షణార్థం ప్రజలు చేయుచున్న తీవ్రమయిన పోరాటం ప్రపంచంలో అన్ని దేశాలలోగూడా గాఢమైన సానుభూతిని కలిగించింది.

తమసోదరులు ఫాసిస్టు దురాగతాలకు గురియగుట సహించలేక రష్యా వెనువెంటనే తన యావచ్ఛక్తి వినియోగించి యెట్లాగయినా భయంకర పిశాచయిన ఫాసిజంనుంచి విముక్తిచేస్తానని అభయహస్త మిచ్చింది. దీనికంతకు కారణాం సోవియటు రష్యాలోని కార్మిక కర్షకులకు స్పెయిను ప్రజా ప్రభుత్వముయెడలా. జన సామాన్యంయెడలా గల ప్రేమ; ఫాసిజంమీాద ఉండే క్రోధావేశం. ఈ అభయహస్తం స్పెయిను ప్రజల్లో నూతనోత్తేజం కలుగచేసి, ద్విగుణీకృతోత్సాహం కలిగించింది. కాని స్పెయిను ప్రజలవిజయం యెక్కువగా అచ్చటి ఆకలిబాధచే అలమడించుచున్న కార్మికకర్షక సమ్మేళనంమీాదనే ఆధారపడియున్నది. అంతేకాకుండా యితర ప్రజాయత్త ప్రభుత్వాల (Democratic States) పూర్తిసహాయం చాలా అవసరం. తటస్థవిధానం (Non-intervention) వల్ల స్పెయినుకు కలిగే ఉపకారం లేకపోగా, అనవసరంగా కాలయాపన అవుటవల్ల, స్పెయినుకు మితిలేనినష్టం కలుగుతుంది. నిజంగాఫ్రాన్సు ఇంగ్లండువంటి ప్రజాయత్త దేశాలు స్పెయినును ఫాసిజంబారినుంచి తప్పించి, దానినికూడా గౌరవం కల ఒక ప్రజాయత్త రాజ్యంగా చేతామని నిష్కల్మషమైన అభిప్రాయం ఉన్నట్టయితే, తటస్థవిధానం యిప్పటి

మాదిరిగావట్టి భూటకం అయ్యేదికాదు. యుద్ధం యింత వరదాకా, అపార ధన మాన ప్రాణ నష్టంతో సాగేది కాదు. స్వలాభాపేక్షయే యిన్నాళ్లనుంచి స్పెయినుకు సహాయం చేయడానికి అడ్డు రావడంవల్ల, ఇంగ్లండు ఫ్రాన్సులు కాలయాపనచేశి తప్పించుకోడనికి ప్రయత్నం చేస్తున్నాయి. ఇతరులవల్ల సహాయంవచ్చినా, రాక పోయినా, కార్మికకర్షక నాయకులు వారి స్వబలంమీదనే ఆధారపడి, తాము నాశనం అయినాసరే, ఆత్మగౌర వాన్ని, సంపూర్ణ స్వేచ్ఛను, శాంతిని, వారే కాపాడు కుంటారు.

స్పెయినులో జరుగుచున్న అంతర్యుద్ధాన్ని సమ గ్రంగా అర్థం చేసుకోవాలంటే, వెనుకటి సాంఘిక, ఆర్థిక, రాజకీయ వైరుధ్యాలను, దుస్థితిని చక్కగా పరిశీలించాలె. స్పెయినులో యింతకు పూర్వం అనేక విషమ పరిస్థితులు సంభవించి యుండక పోలేదు. సాంఘిక రాజకీయ పరిస్థితులు అనేక పర్యాయాలు తారుమారు అవుతూ వచ్చాయి. ఫ్రెంచి విప్లవం జరిగి నప్పటినుంచికూడ, స్పెయిను చాలా అధోగతి పాలై, సంక్షోభ స్థితిలోనే ఉన్నది. నిజానికి అప్పటినుంచి కూడా, స్పెయిను వరుసగా అనేక అంతర్యుద్ధాలకు నిల యమై, భీభత్సదశలోనే ఉన్నది. ఈ అంతర్యుద్ధాలు

ఒక్కొక్కప్పుడు అంతరంగికంగా దాగియుండి, ఒక్కొక్క సమయంలో బయటపడి దేశాన్ని రక్త పాతంలో ముంచేసేవి. ఇన్ని యుద్ధాలు జరిగినప్పటికి ప్రధాన సమస్య అయినట్టిన్ని ప్రజాబాహుళ్యాన్ని దారిద్ర్యావస్థలో ముంచి ఆర్థికోత్పత్తిని పెంపొందించనట్టి జమీందారి పద్ధతిని (Feudalism) రూపుమాపే విధానాన్ని మట్టుకు అమలుగో పెట్టలేక పోయినారు. జమీందారీ విధానం నాశనం అయితేగదా పైమెట్టయిన బూర్జువా డిమాక్రాటిక్ విప్లవాన్ని (Bourgeois Democratic Revolution) కొనసాగించేది. కాని 1931-వ సంవత్సరంలో, అనగా క్షీణదశకువచ్చిన 'ఆల్ఫోన్సో' రాజ్యాధిపత్యాన్ని పడద్రోసి స్పెయినులో ప్రజాయత్త పరిపాలన స్థాపించగానే, పైజెప్పిన ప్రధాన సమస్యను ఆపడానికి వీలులేక పోయింది. ఏమైనాసరే యీ సమస్యను చివరదాకా పరిష్కారం చేస్తేనేగాని ప్రజలకు దారిద్ర్యం తొలగి జమీందారులయొక్క, మతగురువులయొక్క, దాస్యశృంఖలాల్లోనుంచి తప్పించుకోలేరని ప్రభుత్వం పూర్తిగా గ్రహించింది.

స్పెయినులో ప్రజ్వలిస్తున్న సాంఘిక అశాంతికి, అసంతృప్తికి గల చారిత్ర్యాత్మక మయినట్టి, శాశ్వతమయినట్టి కారణాలను నేను యిక్కడ టూకీగా వివ

గిస్తాను. పురాతన మైనట్టి, నిరుపయోగ మైనట్టి, జమీందారీ వ్యవసాయ పద్ధతులు, అభివృద్ధిలేక కృశించే పరిశ్రమలు, దోపిడిమీదనే ఆధారపడిన ప్రభుత్వ వర్గముయొక్క పద్ధతి, ఎన్నియో శతాబ్దాలనుంచి అణచియుంచబడి పీడించబడుచున్న ప్రజా సామాన్యం యొక్క అసంతృప్తి—ఇవన్నియు జమీందారీ విధానం వల్ల విధిలేక కలిగే నష్టాలు. వీటినన్నిటిని సాకల్యంగా ఎదుర్కొని జయించాలంటె చాలా కష్టమైన పని. అయినప్పటికిని నూతనంగా స్థాపించబడ్డ ప్రజాప్రభుత్వం, ప్రజలయొక్క యోగక్షేమాన్ని తనవిధిగా ఎంచేది గనుక అట్టి కార్యభారము నెత్తిన వేసుకోక తప్పింది గాదు. స్పెయినులో పరస్పర వైషమ్యాలు, వైరుధ్యాలతో నిత్యము డీకొనుచున్న రాజకీయ కక్షులయొక్క చిత్రపటాన్నికూడా మీకు చూపించడానికి ప్రయత్నిస్తాను. ఆ కక్షులివి:—సోషలిస్టులు, అనార్కిస్టులు, కమ్యూనిస్టులు, తీవ్రవాదులతో నిండియున్న ప్రజాప్రభుత్వమున్ను (Popular Front Government), ఫాసిస్టులు, సైన్యాధిపతులు, మతగురువులతో చేరియున్న అభివృద్ధి నిరోధక వర్గము (Reactionary Right). ప్రజాప్రభుత్వము తన పాలనలో ఏమో పనులు చేసింది, ఏమో క్రొత్త మార్పులు తెచ్చిపెట్టింది, క్లుప్తంగా తెలియజేస్తూ,

1936 సంవత్సరంలో జరిగిన ముఖ్య విషయాలను గురించిన్ని, అవి ఏవిధంగా ఇంతత్వరలో అతిదారుణా మయిన అంతర్యుద్ధానికి దారితీసినదియు, చేతనయినంత క్లుప్తంగా వ్రాస్తాను. ఆఖరున యుద్ధాన్నిగురించి ముక్త సరిగా వ్రాస్తూ, ఇటలీ జర్మనీల పన్నాగాలు, ఇంగ్లండుకు తంత్రము, మెడిటరేనియను సముద్రంలో ఇంగ్లండు, ఫ్రాంసు, ఇటలీల పరస్పర వైరుధ్యాలకు కారణాలును యింకాయితర ముఖ్యవిషయాలనుగురించి వ్రాస్తాను. పాఠక మహాశయులు ఒకవిషయం ముఖ్యంగా గుర్తించాలె. క్రిందటి సంవత్సరం ఏప్రియల్ నెలలో సారగోసా పట్టణంలో మహా వైభవంతోను, అత్యుత్సాహంతోను జరిపిన సిండికలిస్టుసభలో, సోవియటుపద్ధతి అమలులో పెట్టితేనేతప్ప స్పెయినులో దారిద్ర్యం నశించ దని నిశ్చ యించుకొని, తత్క్షణమే స్థానికసోవియటులను స్థాపించుటకు నిర్ణయించుకొన్నారు. ఈ తిరుగుబాటు లేవని యెడల, నూతన ప్రభుత్వం సిండికలిస్టుల ఒత్తిడిచేత వారి తీర్మానాన్ని ఆచరణలో పెట్టక తప్పేదికాదు.



# స్పెయిన్ దుస్థితి.

—( ·D· )—

## సాంఘిక అశాంతికి కారణాలు

## జమీందారీ విధానంలో క్రుంగుచున్న స్పెయిన్

—(౧)—

వైశాల్యంలో ఇంగ్లండుకంటె రెండింతలు పెద్దదయినా స్పెయిన్ దేశములో దానిలో సగంకంటె జనాభా ఎక్కువగా లేరు. చదరపు మైలు ఒకటికి లెక్కచూస్తే ఇంగ్లండు, ఫ్రాంసు. ఇటలీ, పోర్చుగల్, పోలాండు, బెల్జియమ్ మొదలయిన పారిశ్రామిక దేశాలకంటె జనాభాలో చాలా తగ్గుతుంది. నాలుగు శతాబ్దాల క్రిందటివరకు స్పెయిన్‌లో జనాభా ఇంగ్లండుకంటె దాదాపు 50 లక్షలువరకు ఎక్కువ వుండేదే కాని, ముఖ్యంగా ఇంగ్లాండులో పారిశ్రామిక విప్లవంజరిగి, పరిశ్రమలు ఎక్కువ అవడంవల్ల స్పెయిన్‌తో సమానము కావడమే కాకుండా కొద్దికాలంలోనే మించిపోయింది. ఇంగ్లండులో జనాభా ఎక్కువ కావడానికి కారణం పారిశ్రామిక విప్లవమే కాకుండా, తత్ఫలితంగా ప్రపంచ మంతా రెక్కలు చాచి ఆవరించుకొనివున్న బ్రిటిషు సామ్రాజ్యం కూడా బలమయిన కారణమే. ప్రస్తుతం స్పెయిన్ జనాభా 2 కోట్ల 30 లక్షలయితే యింగ్లండులో 4 కోట్ల 60 లక్షలు.

సాధారణంగా అల్పజ్ఞానంకలిగి పరిస్థితులను లోతుగా పరిశీలించని ఏవ్యక్తికూడా ఇంగ్లండులోవున్న సాంఘిక సుస్థిరత్వానికిన్ని (Social stability) స్పెయిన్‌లో ఒకప్పుడు అంతర్గతంగాను ఒకప్పుడు బహిరంగంగాను చెలరేగే అంతఃకలహాలకు వున్న తీవ్రమయిన భేదాన్ని తెలుసుకోలేడు. సామాన్యుడయిన

ఇంగ్లండు దేశస్థుడు దౌర్జన్యానికి తీవ్రతకు, అశాంతికి అలవాటు పడియుండడు. అందుకే సామాన్యంగా దేశాన్ని మాద్దామనే వుద్దేశంతోనయినా స్పెయిన్‌కు పోవ సాహసించడు. ఒకవేళ ఎవరన్నా బలవంతపెట్టితే కావలెనని తప్పించుకుంటాడు. సాధారణంగా ఒక జాతికివుండే స్వభావం, లక్షణాలు, ఒకదేశం మధ్య ఇంకోదేశం మధ్యవున్న రాచకీయపద్ధతులలో భేదాలు లేకుండా ఎంతమాత్రం చేయలేవు! అడ్డుపెట్టనేలేవు. వివిధ దేశాలలో ఆచరణలో వున్న ఆర్థిక, సాంఘిక, రాచకీయ సిద్ధాంతాలు ఎప్పుడు ప్రజాకంటకంగా పరిణమిస్తవో, ఎప్పుడు ప్రజాసామాన్యం కళ్లు తెరచి తమ వ్యక్తిత్వాన్ని పొందగలుగుతారో అప్పుడే వారికి యితర ప్రభుత్వాలయొక్క, తమ ప్రభుత్వం యొక్కయు నిజానిజములను తెలుసుకోగలుగుతారు.

ఇది ఒకరు అడ్డుపెడితే ఆగేదికాదు. వారివారిసహజ ఔదార్య స్వభావం, లక్షణాలు వారిని శాశ్వతంగా అంధకారంలో ముంచలేవు. అనేకవిషయాల్లో స్థిరంగాను, శాంతియుతంగాను జీవనంచేసే ఇంగ్లీషు వ్యక్తికిని, ఉద్రేకపూరితుడయి శాంతి అనేది ఏమో తెలియని దక్షిణ ఐరోపా దేశస్థునికి భేదంవుంటే వుండవచ్చును. కాని నిజానికి ఇంగ్లండు చరిత్ర చదివినవారికందరికి ఇంగ్లండులోకూడా వుద్రేకపూరితమయినట్టి, సంక్షోభం కలిగించినట్టి, అంతర్యుద్ధాలు జరిగినవని బాగా తెలుస్తుంది. ఒక యింగ్లండే ఏమిటి! ఏదేశంలోనయినా, ఎప్పుడయినా, ప్రజాబాహుళ్యంలో తీవ్రమయిన ఆర్థికసాంఘిక సంక్షోభంకలిగి, వారి నిత్యజీవనానికే ముప్పు వాటిల్లినప్పుడు, అన్నిదేశాల్లోని ప్రజలును, రంగుభేదం లేక కులమతభేధములు పాటించక పొలిమేరభేదాలను అంతకుముందే విచారించక వారివారి న్యాయమయిన హక్కులకొరకు ఒకే మోస్తరుగా త్యాగాలుచేసి పోట్లాడుతారు. ప్రస్తుతం ఇంగ్లండు

అనేక కారణాలవల్ల సాంఘికంగాను రాజకీయంగాను ఒక మాదిరిగాస్థిరత్వం సంపాదించింది. కారణం, ముఖ్యంగా విస్తీర్ణమయిన సామ్రాజ్యాధిపత్యం! ప్రపంచమంతట విరివిగా మార్కెట్లను నిర్మించుకుంటూ, వలసరాజ్యాల (Colonies) నుంచి ముడిసరకులను తెప్పించుకొని తన ప్రజలను పోషించుకొనుచూ, తయారయిన సరకులను ఇండియా, యీజిప్టు, దక్షిణ ఆఫ్రికా, ఆస్ట్రేలియా, కన్నడా, పాలస్తయిన్ మొదలయిన దేశాలకు ఎగుమతి గావించి, కోట్లకొలది ధనాన్ని గడించడంవల్ల అచ్చటి ప్రజలు అంతమాత్రంచేతనే తృప్తిపడి ఒకమాదిరిగా జీవనంగడ పగలుగుతున్నారు. ఇంత సంపదతో తులతూగుతున్నా పోయిన ఐరోపా మహాసంగ్రామంలో తాను అమెరికాకు అప్పుబడ్డ లక్షల కొలదిపౌనులు యింకా తీరనేలేదు. తీరకపోగా ఆయుధాలకొరకు, యుద్ధ విమానాలకొరకు నూతనయుద్ధ భటులకొరకు లక్షలకొలదిగా ఖర్చుచేస్తున్నది. కార్మిక సభ్యులు పార్లమెంటులో ఎన్నిసారులు యీ విషయాన్ని హెచ్చరించినా, ప్రధానమంత్రియు, సైనిక మంత్రిగూడా ఏదోవిధంగా తాముచేసిన చర్యలను సమర్థించు కొంటున్నారు.

స్పెయిన్‌లో సాంఘిక అసంతృప్తికిగల ముఖ్యకారణం అచ్చట అమలులోవుండే పురాతనపు వ్యవసాయ పద్ధతులు. అంతేకాకుండా వుత్పత్తి, విభజనసాధనాలు అనాదీయమయినవి అగుటవల్ల, తినుబండారపు సరుకులు, ఇతరవస్తు సామగ్రియు విరివిగా వుత్పత్తి కాక అన్నివిధాలా దేశముయొక్క ఆర్థిక సంపత్తిని అరికట్టుతుండేవి. ఇంకొక కారణం, స్పెయిన్‌కు సామ్రాజ్యం అనేది అసలు లేనేలేదు గనుక యింగ్లండు మాదిరిగా కోట్లకొలది ధనాన్ని గడించే అవకాశం బొత్తిగాలేదు. మరొక ప్రబలమయిన కారణంవుంది. గడచిన 200 సంవత్సరాల వరకు

యింగ్లీషు చరిత్రలో ప్రధానస్థానాన్ని ఆక్రమించి దేశాన్ని అధో ఫాలుచేసిన "మతోద్ధారకులు" యిప్పుడు స్పెయిన్‌లో ప్రభుత్వాన్ని ఆక్రమించుకొని వారి యిష్టమువచ్చినట్లు విచ్చలవిడిగా సంచ రించుచూ క్రూరకార్యాలకు గడంగుచు, దేశ సౌభాగ్యమునకు శాంతికి విఘాతం కలిగిస్తున్నారు. ఈమతగురువులు కేవలం వారి మతానికి సంబంధించిన విషయాల్లో శ్రద్ధపుచ్చుకొనడం మానేసి "మతం" అనే దొంగవేషంలో అభివృద్ధి నిరోధకములయిన రాజకీయ కక్షులలో ప్రవేశించి వాటికి పూర్తిగా సహాయంచేశారు. వీరిని మత గురువులని చెప్పట చాలాగొప్ప తప్పని తోస్తుంది. వీరంతా పూర్తిగా రాజకీయ జ్ఞానంకలిగి యుద్ధానికి కాలు దువ్వుచు ఒకసేనగా తయారయి, ఫాసిస్టు, సైనిక వర్గాలకు వెన్నెముకగావుండి, ఎప్పుడు అవకాశం చిక్కునా, ఎప్పుడు యీ ప్రజాప్రభుత్వాన్ని కబళింపుదామా అని కాచుకొని వున్నారు. చాలా విషయాల్లో స్పెయిన్ యింగ్లండువలె ఒకే జాతిగా పరిగణింపబడుటలేదు. దీనికి కారణం జాతీయైక్యత లేకపోవు టయే. స్పెయిన్ ప్రత్యేక రాష్ట్రాలుగా విభజింపబడి, ప్రత్యేక పరిపాలనా పద్ధతులు ఆచరణలోకి వచ్చాక ఇట్టి పద్ధతులు ప్రజలకు పరిపాటియై "ప్రత్యేకత" అను రాష్ట్రీయ స్వాతంత్ర్య భక్తి వారి నాళినాళాలకు అంటిపోయింది. శాశ్వతంగా అణచివుంచబడ్డ స్వజాతీయుల అసంతృప్తికూడా ప్రస్తుతపు అశాం తికిగల ముఖ్యకారణాల్లో ఒకటి. మనము ఒక దేశాన్ని గురించి సమగ్రంగా తెలుసుకోవాలంటె, ఆ దేశంయొక్క జాతిస్వభావం, విద్యలు, రాజకీయకక్షులు, వాటి ప్రధాన నాయకులనుగురించి తెలుసుకోవడం చాలాముఖ్యం; అవుసరంకూడాను. కాని ఆ తెలుసుకోవడంకూడా మామూలుగా కాక అచ్చటి ఆర్థికపద్ధతి మీదను, యితర ముఖ్య సమస్యలమీదకూడా తప్పక ఆధారపడి

వుండాలె. అస్థిరమయిన వ్యవసాయపదధితులు, అనిశ్చయమయి అన్ని అభివృద్ధులకు ఆటంకం కలిగించే పరిశ్రమపద్ధతులు, రాజకీయ అసంతృప్తికి మూలకారణంగా ఏర్పడివున్నవి. కాబట్టి నేను ఆర్థికవిషయాలను గురించియిక్కడ క్లుప్తంగా వ్రాస్తాను.

## వ్యవసాయ సమస్య.

స్పెయిన్‌లో చాలా ప్రదేశము చవిటినేల. వర్షాధారం చాలా తక్కువ. శాస్త్రీయమయిన వ్యవసాయాభివృద్ధిని తీవ్రంగా నిరోధించే జమీందారీ ఆర్థికవిధానం అమలులో వుంది. అందువల్ల, వ్యవసాయోత్పత్తి అతి స్వల్పంగావుంటోంది. నీటివసతి చాలా ప్రదేశాల్లో లేకపోవడంవల్లను, కొన్నికొన్ని జిల్లాలలో సమృద్ధిగా వుండడంచేతను, వ్యవసాయానికి చాలా నష్టం కలుగుతూ వచ్చింది. అప్పుడప్పుడు స్పెయిన్ నదులు మన వుత్తరదేశంలో నదులుమాదిరిగా పొంగి పంటలను నష్టపరుస్తాయి. నిరుటి సంవత్సరం వుత్తర స్పెయిన్‌లో 'ఈబ్రో' నది పొంగి అసలే ఆకలిబాధచే క్రుంగి కృశించుచున్న బీదరయితులకును, వ్యవసాయ కూలీలకును భరింప రాని నష్టకష్టములను కలుగజేసింది. అనేక లక్షలపౌనులు నష్టం కలుగుటవల్ల, ప్రస్తుతం కార్మికకర్షకులు కట్టబట్ట, ఒకపూట తిన తిండీకూడలేక మలమల మాడుతున్నారు. భూస్వాములు కొద్దికాలం పాటే రయితులకు భూములను కవులుకు యివ్వడంవల్ల, వ్యవసాయ పద్ధతుల్లో నూతన మార్గాలు ఆచరణలో పెట్టుదామని రయితులు అనుకొనినను కవులు తీరినవెంటనే ఆమార్గాలు తమకు నష్టము కలిగి స్తవని వాటిని అమలులోనికి తేలేదు. అందువల్ల రైతులు భూములను అభివృద్ధిచేద్దామన్నా చేయలేకపోతున్నారు. ఈ విధంగా భూముల్లో జవసత్వాలులేక పంటలు సుభిక్షంగా పండ కుండావున్నవి. దీనికితోడు వ్యవసాయ సామగ్రిమీద గవర్న

మెంటు విధించిన సుంకములు (Agricultural Tariffs) ఎక్కువగా వుండుటచేత భూస్వాములకు నూతన పద్ధతులమీద వ్యవసాయాన్ని నడిపిద్దామనే వుత్సాహంకలుగలేదు. ఎందువల్లనంటె, ఈ ఎగుమతి సుంకాలు అనివార్యంగా వ్యవసాయ సరకుల యొక్క ధరలను ఎక్కువచేశి, పరాయదేశాలకు ఎగుమతి అగుటకు అనుకూల పరిస్థితులను ఏర్పరచవు. అందుచేత దేశంలో తయారయిన పంటయావత్తు దేశంలోనే అమ్ముడు పోవలసియుంటుంది. స్పెయిన్ ప్రజలయొక్క కొనుగోలుశక్తి చాలాస్వల్పమయిన దగుటవల్ల వుత్పత్తి ఏమాత్రం అధికమయినా వెంటనే అది యావత్తూ మిగిలిపోయి తప్పకుండాధరలు పడిపోతవి. దీనివల్ల జమీందార్లకు నష్టం కలుగుతుంది. గడచినకొద్ది సంవత్సరాలలో ప్రపంచంలో సంభవించిన వ్యవసాయ సంక్షోభంవల్లను, (World Agrarian Crisis) యితర దేశాలయొక్క తీవ్రతరమయిన పోటీవల్లను, స్పెయిన్‌లో పండే గోధుమలు, నూనె మొదలగు సరకులు, ఏషియా, ఫ్రాంసు మున్నగు దేశాలలో అమ్ముడుపోలేదు. 'అల్జియర్సు'లో తయారయిన ద్రాక్షసారాయితో స్పెయిన్‌సారాయి పోటీచేయలేక పడిపోయింది. ఇటలీ, స్పెయిన్‌యొక్క వద్ద యెగుమతి వ్యాపారాన్ని పాడుచేశింది. పాలస్టయిన్, దక్షిణ ఆఫ్రికా, యిటలీలలో పండే నారింజపండ్లు స్పెయిన్ నారింజ వ్యాపారాన్ని ధ్వంసంచేశింది. నారింజతోటల స్థానే పారిశ్రామాధికారులు ఫ్యాక్టరీలను నిర్మించి వ్యాపారాన్ని నిర్విఘ్నంగా కొనసాగించారు. అందువల్ల వాటిలో పనిచేయు కార్మికులకు అనార్కిస్టులు వారి సిద్ధాంతాలను నేర్పి ఒకబలవత్తరమయిన సంస్థగా యేర్పాటుచేశారు.

అనేక వేలకొలది యెకరాలుగల భూస్వాములుగూడా వ్యవసాయ, పరిశ్రమలలోగాని వుత్పత్తి సాధనాల విషయాల్లోగా

సాధారణంగా శ్రద్ధ తీసుకోకపోవడమేకాకుండా భూములున్న ప్రదేశాల్లోకూడా వాళ్లు కనుపించరు. ఏ 'మాడ్రిడ్' లోగాని 'బార్సిలోనా' లోగాని, మరి ఏ యితర రాష్ట్రముఖ్య పట్టణాల్లోగాని, విలాసభవనాల్లోను, ఆరామాలలోను, తమ భూములలో చెమట ఓడ్చి పనిచేసే కర్షకులవల్ల సంపాదింపబడ్డధనాన్ని యిష్టమువచ్చినట్లు దుబారాచేస్తూ మత్తెక్కి కొట్టుకొంటారు. ఇట్లాంటి పరాయి ప్రదేశాల్లోవుండే భూస్వాములు సాధారణంగా వాళ్ల యెస్టేట్లను తనిఖీచేయడానికై మేనేజర్లను నియమిస్తారు. ఈ మేనేజర్లు గ్రామాదులలోని రయితులను యితర బీదకార్మిక జనాన్ని వేధించుకు తింటూ వాళ్లకు ప్రబలశత్రువు లవుతారు. మనదేశాన్ని స్పెయిన్ దేశాన్ని పోల్చిచూస్తె జమీందారీ విషయంలో మాత్రం చాలావరకు కలుస్తాయి. అందులో ముఖ్యమయినది అనేక శతాబ్దాలనుంచి ఆచారంగా వస్తూవున్న జమీందారీ హక్కుల ప్రకారం రయితులు చెల్లించవలశియున్న శిస్తువిధానం. ఇటీవలి వరకు ఇంగ్లాండులోని గ్రామాదులలో ఒక చెడు సాంప్రదాయము అమలులోవుండేది. దీన్నిబట్టి పండినపంటలో 10-వ వంతు ప్రభుత్వం పన్నురూపంగా వసూలుచేయుచూ వచ్చేది. కాని అచ్చటి కర్షకులు ప్రపంచం అంతటితోపాటు వ్యక్తిత్వాన్ని సంపాదించినతర్వాత, తమ నిస్సహాయత, దుర్బలత్వాన్ని తలచుకొని, తమను అష్టకష్టాలుబెట్టుచూ, జలగమోస్తరుగా నెత్తురు పీల్చేప్రభుత్వంయొక్క నిరంకుశత్వాన్ని సహించలేక ఒక్కసారిగా ప్రభుత్వంమీద తిరుగబాటు చేశారు. కర్షకుల విప్లవధాటికి ఆగలేక పూర్వ సాంప్రదాయాన్ని రద్దుచేశారు. దీనిబట్టి స్పెయిన్లోకూడా జమీందారీ విధానమంటె కర్షకావళికి ఎంత ద్వేషమో మనకు చాలామట్టుకు అర్థమవుతున్నది.

వ్యవసాయం బీదస్థితిలో వుండటంచేత గ్రామాదులన్నీ గూడా బీదస్థితిలో వుండక తప్పదు. ఈ బీదస్థితి దేశంలోని పరిశ్రమాభివృద్ధిని తీవ్రంగా నిరోధించింది. దేశంలో పంటలు పండి సుభిక్షంగా వుంటే కదా కార్మికుల కొనుగోలు శక్తి ఎక్కువయి సౌభాగ్యంలో తులతూగుతూ వుండేది? 1930 సంవత్సరానికి పూర్వము సాధారణంగా వ్యవసాయ కార్మికునికి జీతము రోజునకు ఒక అణా ఎనిమిది పైసలు వుండేది. కాని 1923 సంవత్సరంలో, కాబల్లెరో ప్రభుత్వం క్రింద రోజుకు 5 అణాల 6 పైసలు వరకు హెచ్చించారు. కాని మళ్లా లెర్రాక్సు ప్రధానమంత్రిగా వున్న కాలంలో భూస్వాముల వొత్తిడివల్ల రూ. 0-5-6 నుంచి ఒక్కసారిగా 0-1-0 వరకు దించారు. దీనికి పర్యవసానంగా అనేక ప్రదేశాలలో కరువు బయిలుదేరి నిరుద్యోగ సమస్య మరింత తీవ్రరూపం దాల్చింది. ముఖ్యంగా 'బార్సిలోనా' లో నిరుద్యోగబాధ ఎక్కువయి వేలకొలది కార్మికులను దారిద్ర్యావస్థ పాలుచేసింది. ఆకలిబాధకు, కొనుగోలుశక్తికిని అవినాభావ సంబంధ ముండుట చేతను, యీ రెండింటిచేతనుగూడా కార్మిక కర్షకులు పీడింపబడుట చేతను, పట్నాలలో కష్టపడి జీవించే కార్మిక సోదరులకును, పల్లెలు దిక్కుల్లో జమీందార్ల నిరంకుశ చర్యలకు ఆహుతి అయ్యే కర్షక సోదరులకును రాజకీయంగాను ఆర్థికంగాను, బలమయిన సఖ్యత కల్గింది. ఈ సఖ్యత నిరుటి సంవత్సరం జూలై మాసానికి క్రమ క్రమంగా వృద్ధి అయింది. చరిత్ర చదివిన ప్రతి వ్యక్తికిగూడా కార్మిక కర్షకులకు సఖ్యత కుదరందే వారి న్యాయమైన హక్కులను గెల్చుకోలేరన్న సంగతి తప్పక తెలిసియుంటుంది. 14-వ శతాబ్ద ప్రాంతంలో ఇంగ్లండులో జరిగిన కర్షక విప్లవంలో కార్మికులు పాల్గొనకపోవడంవల్లనే విప్లవం విఫలమైపోయింది. ఇటీవలనే మెక్సికో దేశమందు (దక్షిణ అమెరికా) ను, ఫ్రెంచి

దేశమందును జరిగిన కార్మిక విప్లవాల్లో, కర్షక కార్మికులు నిండా చేయూతయిచ్చుకోక ఉదాసీనభావం చూపినందువల్ల, ఆ రెండు విప్లవాలుకూడా పూర్తిగా ఫలించలేదు. ఆ విధంగానే జర్మనీలో కూడా 1933-లో జరిగింది. కాని హిట్లరు దురాగతాలవల్ల, కార్మిక కర్షకసంస్థలు బహిర్గతంగా పనిచేయ లేకపోయినా, అంతర్గర్భితమై, నివురుగప్పిన నిప్పువలె ఉన్నాయి. ఏ నిముషాన విప్లవజ్వాలలు సమయం కనిపెట్టి చెలరేగునో యెవరు ఎట్లు చెప్ప గలరు! కాని 1789 సంవత్సరం నాటి ఫ్రెంచి విప్లవమున్నూ, 1917-వ నాటి రష్యా విప్లవమున్నూ మూడువంతులు కార్మికకర్షక అన్యోన్య సహకారంమీద ఆధారపడి యుండడంచేత, రెండు విప్లవాలుకూడా పూర్తిగా విజయంగాంచాయి. స్పెయినులో పరిశ్రమలకు పుట్టిల్లయిన 'బార్సిలోనా' లోను, వ్యవసాయానికి ముఖ్యస్థానమయిన 'ఆండలూషియా' లోను, కార్మికకర్షకులకు అన్యోన్యసహకారం పూర్తిగాకుదిరి, విప్లవం జయప్రదంగా జరగడానికి పరిస్థితులు అనుకూలంగా కనుపించడంచేత, కొంత ఆశాజనితంగా ఉన్నది. 'ఆండలూషియా'లోని వ్యవసాయ కార్మికులు బార్సిలోనా నుంచి 500 మైళ్లు దూరాన ఉన్నప్పటికిని, కష్టసుఖాల్లోను, పట్టుదలలోను, భావప్రేరణలోను, ఇద్దరూ చాలా సమీపంలోనే ఉన్నారు. ఆండలూషియాకు 10 లేక 20 మైళ్లి సమీపంలో ఉన్న రయితులతోగూడా అంతగా సఖ్యత కుదురలేదు. స్పెయిను సోషలిస్టులు యీ సమస్యయొక్క ప్రాముఖ్యతను తీవ్రంగా కనిపెట్టారు. బార్సిలోనాలోని అనార్కిస్టులుకూడా ఇటీవలనే యీ విషయాన్ని బాగా గ్రహించి పట్నాల్లో వారి ప్రచారాన్ని చాలామట్టుకు తగ్గించారు. ఎందు వల్లనన, పట్టణాల్లో పనిచేసే కార్మికులంతా యిదివరకే చాలా మట్టుకు అనార్కిస్టు సిద్ధాంతాలను నేర్చుకుని, వారుకూడా

అనార్కిస్టు ప్రచారం విరివిగా చేయ నారంభించారు. ఇక గ్రామాదుల్లో వారి ప్రచారం కేంద్రీకరించవలసిన ఆవశ్యకత ఏర్పడ్డది. మన దేశంలో మాదిరిగానే, స్పెయినులోగూడా, పల్లెటూళ్ళనుంచి కార్మికులు అనేకమంది ఫ్యాక్టరీలు మొదలయిన వాటికి నడచిపోవలసియుంటుంది. నాలుగు డబ్బులు చేతులో ఆడే కర్షకుడుమాత్రం కంచరిగాడిదమీద యెక్కి, భార్యా పిల్లలను వెంటవేసుకొని, తన పనిస్థలానికి పోతాడు. స్పెయినులో రిపబ్లికు అమలులోనికిరాక పూర్వం వ్యవసాయ కార్మికునికి రోజు కూలి అణా ఆరుపైసలు. కాని యిప్పుడు చాలావరకు పెరిగింది. గ్రామ జీవనానికి సంబంధించిన ప్రతివిషయంలోగూడా చాలా పురాతనంగా వాడబడే పనిముట్లే అమలులో వుండేవి. కాబట్టి పట్టణానికి పల్లెటూరుకు హస్తిమశకాంతరం వారవుంటుంది. ఇలాంటి పురాతనపు ఆచారాలను, జమీందారీ విధానాన్ని నాశనంచేసి దేశాన్ని నవీనపద్ధతిలోనికి తీసుకొనివచ్చి ప్రజా సామాన్యానికి సౌఖ్యావహమయిన జీవనోపాధిని సమకూర్చాలంటె స్పెయిన్ యిప్పుడు ఫాసిస్టు గుండగీండ్రనుంచి తప్పించుకొని సంపూర్ణ విజయాన్ని పొందితీరాలి. అప్పుడే స్పెయిన్ ప్రజలకు కంటినిండ నిద్ర కడుపునిండ కూడు అనుభవిస్తూ యికముందు ఫాసిస్టుల క్రూరత్వానికి ఆహుతికాకుండా కడుజాగ్రతగా వుంటారు. వారి కార్యభారంకూడ ఎక్కువగా ఉంటుంది. ఒక స్పెయిన్కే కాదు. సమస్త ప్రపంచమంతా కూడా ఫాసిస్టు అపజయానికి ఆనందిస్తుంది. స్పెయిన్లో ప్రజాస్వామికం ప్రవేశ పెట్టకముందు, వేలు, లక్షలకొలది బీదజనం పల్లెటిదిక్కుల్లో నిరుద్యోగంలో మునిగియుండేవారు. ప్రజాస్వామికం రాగానే ప్రభుత్వం సహకార వ్యవసాయశాఖ, పరిశ్రమశాఖ మొదలయిన నూతనసంస్థలను స్థాపించి నిరుద్యోగు లందరికి పని కల్పించింది.

## పరిశ్రమలు.

అనేక శతాబ్దాలనుంచి అవిచ్ఛిన్నంగాసాగే జమీందారీ విధానంవల్ల స్పెయిన్‌లో పరిశ్రమలు వృద్ధిలేక అడుగంటినవి. తక్కిన దేశాలలో పరిశ్రమలు చాలా అభివృద్ధిచెంది, వుత్పత్తి విధానంలో క్రొత్త క్రొత్త పద్ధతులు కనిపెట్టుతుండే కాలంలో స్పెయిన్ పరిశ్రమలకు వూరుపేరు లేకుండాపోయింది. స్పెయిన్ ప్రభుత్వం, గడచిన మహా సంగ్రామంలో పాల్గొన్న దేశాలకు తన సరుకులను ఎంతెవిరివిగా అమ్ముదామని ప్రయత్నాలుచేసినా, దేశంలో అన్నివిధాలా ఆటంకాలుండడంచేత ప్రయత్నాలు సఫలం కాలేదు. రాజరికం (Monarchy)లో మ్రగ్గుతున్న అప్పటి స్పెయిన్‌యొక్క ప్రధాన ఆకృతులు యీ క్రిందివిధంగా వుండేవి. దేశానికి ప్రకృతి ఎన్నిమంచి అవకాశాలు కలుగజేసినా, భూగోళ రీత్యా దేశం ఎటువంటిఅద్భుతమయిన స్థానాన్ని ఆక్రమించుకొన్నా, ఆర్థికంగాను, రాజకీయంగాను దుర్దశపాలు గావడానికి ముఖ్య కారణం స్పెయిన్ ప్రభుత్వంయొక్క నిరంకుశత్వం, పురాతనపు పరిపాలనావిధానమే. ఇదివరకే యూరప్ ఖండం, దానియొక్క చారిత్ర్యాత్మకమయిన శోభకుతీరని ఆటంకం కలిగించింది. ఇట్లాంటి సందర్భంలో వందల సంవత్సరాలనుంచి జమీందారీ తత్వంలోమునిగి తేలుతూ, ఆర్థికరాజకీయ దాస్యాలకులోనయిన స్పెయిన్ నవీన మార్గాలు కనిపెట్టి దేశాన్ని సౌఖ్యావహంగా చెయ్యకపోవడంలో ఆశ్చర్యమేమీలేదు. తక్కిన యూరప్ యావత్తుకూడా జమీందారీ (Feudalism) విధానం స్పెయిన్‌లోవలె ప్రబలక పోయినప్పటికి, స్పెయిన్‌కంటె ఎక్కువగా పరిశ్రమలలో, పూర్వం అభివృద్ధి గాంచలేదు. కాని ఇవుడు అభివృద్ధి గాంచినవి. ప్రపంచం అంతటా దొరకే ఉక్కులో స్పెయిన్ నూటికి ½ కంటె ఎక్కువ యిచ్చుట

లేరు. ఇంకా పని చేయకుండాయుండి, లక్షలకొలది టన్నుల ఉక్కు దొరకే గనులు అనేకమున్నవి. ఉక్కుపరిశ్రమలు విరివిగా లేకపోవడంచేత రైల్లమార్గములు దేశమందంతట వ్యాపించ లేదు. ఇతర పరిశ్రమలుకూడా వృద్ధి గాంచలేదు. ముఖ్యంగా మాడ్రిడ్, బార్సిలోనా, వాలెంషియావంటి ప్రధానస్థానములలో మాత్రం రైల్ల రాకపోకలు సాగుతున్నవి. కాని, తతిమ్మా రేవు స్థలాల్లోకి పట్నాల్లోకి ఎక్కువగా రైళ్లు వేయలేదు. ఎంతసేపటికి మిలిటరీ రాకపోకలకు, అధికారుల వసతులకు మాత్రమే యేర్పాటు చేసుకున్నారు. రైళ్లుకూడా అంతవడిగా పోవడంలేదు. పరిశ్రమలు కొద్దిగా సాగే ప్రదేశాల్లోకి కూడా పోకుండా వాటి అభివృద్ధికి అంతగా తోడ్పడటంలేదు. అధవా ఎక్కడయినా రైల్ల సౌకర్యం వున్నప్పటికీ, ఎగుమతికి గాని, దిగుమతికి గాని, ఫ్రాంసుదేశం రేట్లకు మూడునాల్గు రెట్లు అధికంగా వున్నవి.

దేశం ఎంత అధమ స్థితిలోవున్నా ప్రజా బాహుళ్యం బీద తనం, నిరుద్యోగంవంటి బాధలకు గురియగుతున్నా బ్యాంకులు మట్టుకుదిన దిన ప్రవర్ధమానంగా వర్థిల్లుతున్నాయి. సాధారణంగా జమీందారీ దేశాలలో పెట్టుబడిదారుడు కేవలం అధిక వడ్డీలకు అప్పులు యిచ్చి, వాటిమీదనే జీవనం చేస్తాడు. అతడి అవసరం అంతమట్టుకే. దేశంలోని ఆర్థిక రాజకీయ పరిస్థితులు కూడా అంతకంటె యింకొక పనికి అవకాశం కలుగనీయవు. కాని పెట్టుబడిదారి (Capitalist) దేశాల్లో వడ్డీవ్యాపారం బాహుళ్యంగా సాగిస్తూ యింకా అంతకంటె లాభసాటి అయిన వ్యాపారాల్లో జోక్యం పుచ్చుకొంటాడు. అనగా దేశంలో వుత్పత్తికి కావలసిన సాధన సామగ్రిని యావత్తు పెత్తనం వహించి ప్రధానస్థానం ఆక్రమిస్తాడు. స్పెయిన్‌లో వుత్పత్తి విధానం వృద్ధిపొందక కృశించి పోయే కాలంలో, బ్యాంకు లాభాలు అధికమయినాయి.

వృత్తివిధానంలోను, ఆర్థిక, రాజకీయ పద్ధతులలోను నూతన ప్రభుత్వం ఎల్లాంటిమార్పులు చేయడానికి ప్రయత్నాలు చేస్తున్నా, అనేక సంవత్సరాలనుంచి లాభాలుగడిస్తున్న బ్యాంకుల పరిపాలనలోమాత్రం ఏమీమార్పు చెందలేదు. 1789 సంవత్సరం నాటికి ఫ్రాన్సుదేశంలో, ఏమాదిరిగా జమీందారీ విధానంమీద ఆధారపడి వ్యర్థమయిన వ్యవసాయపద్ధతి అమలులోయున్నదో, ఏవిధంగా పరిశ్రమలు అడుగంటివున్నవో, ఏరీతి గా వడ్డీవ్యాపారస్థుడు అభివృద్ధిపొందుచున్నాడో, ఆవిధంగానే నేటిస్పెయిన్‌లో మనము కండ్లార ఆచిత్రపటాన్నే చూస్తున్నాము.

## సామ్రాజ్యం లేకపోవుట.

తెలివిగాను, చాకచక్యంగాను ప్రచారంచేయడంవల్లను, భయం కరమయిన గుప్తకృత్యాలవల్లను, జర్మనీ నాజీప్రభుత్వం అక్కడి ప్రజలను, దేశీయవిషయాలను మరుగుపెట్టి విదేశాంగ వ్యవహారములయందు పూర్ణంగా నిమగ్నులయ్యేటట్టు చేస్తున్నది. దీనివల్ల జర్మనీ ప్రజలుచాలామట్టుకు ప్రభుత్వంపన్నే మటు మాయలకు, మోసకృత్యాలకులోనయి, అంతరంగిక, ఆర్థిక, నిర్బంధంనుంచి విముక్తులయ్యే మార్గాలను అంత తీవ్రంగా ఆలోచించడంలేదు. అంటే అక్కడ కమ్యూనిస్టు ప్రచారం జరగడంలేదని, ప్రజాబాహుళ్యానికి పేదరికం లేదని మనము ఎంతమాత్రం అనుకోకూడదు. బ్రహ్మాండమయిన విప్లవం ఏ నిముషాన బయలుదేరుతుందో, ఎప్పుడు హిట్లరు దురంతాలు తుదముట్టి శాంతిభద్రతలు ఎప్పుడు ప్రపంచమంతా స్థాపింపబడతవో, ఎప్పుడు ప్రజాతంత్రవాదులు, కార్మిక కర్షకులు, శాంతి ప్రేమికులు గుండెమీద చేతులువేసుకొని హాయిగా నిద్రపోతారో నని యావత్ప్రపంచమంతా నిరీక్షిస్తున్నది. ప్రపంచంలో

హిట్లరు, ముస్సోలినీవంటి లోకకంటకుల అధికారం నాశనంకా
వటంతోటే రెక్కలువిరిగిన పక్షివలె ఫాసిజంకూడా నాశనం
కాక తప్పదు. ఇంగ్లండులో ప్రభుత్వంయొక్క సూక్ష్మబుద్ధివల్లను,
పార్లమెంటులో ప్రభుత్వ వ్యతిరేక పక్షముయొక్క స్వవినాశ
కరమయిన ప్రవర్తనవల్ల, జర్మనీలోని పరిస్థితులే యిక్కడా
ఏర్పడ్డవి. కార్మికోద్యమాల ఆంతరంగిక వ్యవహారాల్లోకూడా
ప్రజలదృష్టిని సామ్రాజ్య సమస్యలలోనికి ఆకర్షించి మిగిలిన ఆర్థిక
రాజకీయవ్యవహారాల నన్నిటిని వెనుకకు నెట్టేశింది. కాని
స్పెయిన్ రాజకీయ పరిస్థితులకున్ను, జర్మనీ, ఇంగ్లండు పరిస్థితు
లకును చాలా వ్యత్యాసమున్నది. స్పెయిన్‌లో ఆంతరంగిక
వ్యవహారాలు పూర్తిగా రాజకీయరంగాన్ని ఆవరించివున్నాయి.
స్పెయిన్, యూరపులో ఒకమారు మూలగావుండటంచేత అంత
ర్జాతీయ కక్షలలో సంబంధం బొత్తుగాలేక దూరంగానేవుండటం
సంభవించింది. జర్మనీ, యిటలీలలోమాదిరిగా స్పెయిన్‌లోకూడా
'గిల్‌రోబిల్స్' వంటి ఫాసిస్టునాయకుడు ప్రజలను మోసంచేయక
పోలేదు. నిజానికి 'గిల్‌రోబిల్స్' తక్కిన ఫాసిస్టులతో కలసి
స్పెయిన్‌మీదికి ఎవరో దండెత్తివస్తున్నారని "మాతృదేశము"
అపాయస్థితిలో నున్నదని, ప్రచారంసాగించి ప్రజలను రెచ్చగొట్టి
సామ్రాజ్యవాద యుద్ధాల్లోకి లాగుదామని ప్రబలప్రయత్నాలు
చేశాడు. ముఖ్యంగా స్పెయిన్ ఫాసిస్టులు, మెడిటరేనియన్ మహా
సముద్రంలో ఇంగ్లాండునకును ఇటలీకిని తగాదాయున్నదని,
యీతగాదాముదిరి యుద్ధంగామారితే తమ స్వాధీనంలోవున్న
బేలరిక్ దీవుల స్వాతంత్ర్యానికి భంగంవస్తుందని తీవ్రంగా ప్రచా
రంచేశారు. అదిగాకుండా యీ బేలరిక్ దీవులు ముందుముందు
తప్పని సరిగా యింగ్లండు యిటలీలమధ్య సంభవించే సామ్రాజ్య
వాద యుద్ధంలో నిశ్చయంగా ప్రాముఖ్యత వహిస్తయని

వాదించారు. అందుకోసమని వారిమిత్రులయిన తక్కిన ఫాసిస్టు నాయకుల్లాగా ఆయుధాలను అపరిమితంగా ఎక్కువచేస్తేనేగాని శత్రువులను గెలువలేమనియూ, జాతియొక్క స్వతంత్రశక్తి, రక్షణ, ఔన్నత్యం ఎక్కువకావని వారి అభిప్రాయం. క్రిందటి ఎన్నికలలో రక్షణ మంత్రిగానున్న 'గిల్ రోబిల్స్' ఒకకోటి పౌనులు దేశరక్షణక్రింద, విమానాలకొరకు ఖర్చుపెట్టెదనని శింకాలుకొట్టాడు. కాని అతని ఆశలన్నియు అడియాసలయినవి. పాపం ప్రజలు ఏకోన్ముఖంగా అతనికి వోట్లుయివ్వడం మానివేశారు.

నిజానికి స్పెయిన్‌కుసామ్రాజ్యం లేదు. ఏవో కొన్ని ద్వీపాలు ఆఫ్రికా సముద్రతీరంచుట్టును, ఆఫ్రికాలో కొన్ని ప్రదేశాలునుమాత్రం వున్నవి. స్పెయిన్ వలసప్రదేశాల్లో జనాభా అంతాకలిసి షుమారు పదిలక్షలుకంటె ఎక్కువ లేదు. సూర్యుడు అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యంలోని జనాభాలో యిది ఒక అణుమాత్రమే. నూరు సంవత్సరాల్లో అనగా క్రీ. శ. 1500-1600 సంవత్సరాలనడుమ స్పెయిన్ ఒక బ్రహ్మాండమయిన సామ్రాజ్యాన్ని అతిత్వరలో నిర్మించింది. కాని పునాదులు గట్టివికానందువల్ల, స్వాతంత్ర్యపిపాస ఎక్కువ అవడంవల్ల క్రమక్రమంగా సామ్రాజ్యం విచ్ఛినం అయిపోయింది. మొట్టమొదట యూరపులోని నెదర్‌లాండ్సు, దక్షిణయిటలీ, సిసిలీ మొదలైన దేశాలను కోలుపోయింది. 19-వ శతాబ్దారంభంలో స్పానిష్ అమెరికా, స్వాతంత్ర్యం సంపాదించుకొన్నది. 1898-వసంవత్సరంలో అమెరికా, క్యూబా, పోర్టోరికో, ఫిలిప్పైన్ దీవులను పట్టుకొన్నది. ఈ విధంగా క్రమంగా స్పెయిన్ ప్రతిభక్షీణించడం మొదలుపెట్టినతర్వాత, తనంతట తానే తన సామ్రాజ్యపటిమ క్షీణించినదని ఒప్పుకున్నది. అంత గొప్ప సామ్రాజ్యం వున్నదని విర్రవీగే స్పెయిన్‌యొక్క

గర్వం, అహంకారం ప్రభుత్వానికి మత్తుగప్పి దేశాన్ని జమీందారీ విధానంనుంచి నవీనయంత్ర యుగంలోకి మార్చుచేతామనే తెలివి తేటలు లేకుండా మందమతులను చేశింది. సామ్రాజ్యం లేకపోవడము, అందువల్ల కలిగిన స్థబ్ధత, స్పెయిన్ రాజకీయాల్లో కలిగిన మార్పులకు ప్రధానకారణాలలో ఒకటి. తక్కిన ఏ పెద్దదేశములోనయినా యిదేమాదిరిగా సామ్రాజ్యాధికారం నశించడంతోటే యీ రీతిగానే సంభవిస్తుండేది. పరాయి శత్రువువచ్చి దండెత్తునేమో అనేభయం ఏగాలేనప్పుడు కూడా, స్పెయిన్ ప్రభుత్వం తన యిష్టమువచ్చినట్టు యింతకుముందు చేయ ప్రయత్నించినట్లు ఇపుడు .ప్రజలను భయపెట్టి శాంతిస్థాపన బొత్తుగా చేయవీలు లేదు.

హిట్లర్ అధికారంలోకి వచ్చినప్పటినుంచికూడా, పశ్చిమ దేశాలు భయోత్పాతంచేత ఆయుధగారాలను, ఆయుధాలను, యితరయుద్ధ సామగ్రిని విరివిగా తయారుచెయ్యడం యింతవరకు మానలేదు. ముసోలినీ హుంకారములకు బలహీనమయిన చిన్న దేశములేకాక ఫ్రాన్సు యింగ్లండులవంటి పెద్ద దేశాలుకూడా దద్దరిల్లుతున్నాయి. పయికి ఎన్ని కబుర్లుచెప్పినా లోలోపల ఎన్ని ప్రయత్నాలు చెయ్యాలో అన్ని జరుగుతునేయున్నాయి. కాపిటలిస్టుదేశాల్లో కార్మికకర్షకులకు ' రాజ్యాధికారాల్లో ఏమాత్రంపాలు యివ్వకుండా ప్రభుత్వం మధ్యపెట్టి సామ్రాజ్యవాదయుద్ధాలలోదింపి వారివల్ల కోట్లకొలదధనాన్ని, కొత్తదేశాలను గడించారు. ప్రతిప్రభుత్వంకూడా కార్మికుణ్ణి ఏదోరకంగా ఒప్పించి దేశంకోసం పోట్లాడవలసినవిధి తనయందున్నదని వత్తిడిచేస్తున్నది. దీనికి తార్కాణంగా జర్మనీ, యిటలీ, జపాన్, యింగ్లండ్ మొదలయిన దేశాలు. పైజెప్పిన తక్కినదేశాల్లో మాదిరి కాకుండా ఫ్రాన్సులో చాలామార్పులు జరిగాయి. పాప్యులర్

ఫ్రంట్ ప్రభుత్వం స్థాపించి ఆర్థిక రాజకీయ విధానంలో సంస్కరణలు ప్రవేశ పెట్టినప్పటినుంచి కార్మిక కర్షకులకు చాలావరకు ఆర్థికజీవనంలో సంతృప్తి కలిగింది. వారిలో తమదేశాన్ని కాపిటలిస్టు ఫాసిస్టు దేశాలనుంచి రక్షించుకోగలమనే వ్యక్తిత, త్యాగశక్తి ప్రస్ఫుటంగా కలిగింది.

ఫ్రాన్సులో కాపిటలిస్టు విధానాన్ని మార్పుచేయ్యక పోయినా, ప్రభుత్వం కర్షకుల ఆర్థికరాజకీయ హక్కులను న్యాయంగానే కాపాడుతున్నది. జర్మని మొదలయిన దేశాలు, ఇట్లాకాక కార్మికకర్షకులను పిల్చి పిప్పిచేస్తున్నవి. స్పానిష్ పాప్యులర్ ఫ్రంటుయొక్క రాజకీయనిపుణులు ఒకరూ స్వతహాగా వున్నారు. స్పెయినుకు కొత్తగా ఇప్పుడు వ్యాపారం చేసుకోడానికి పంచుకుబడి ప్రదేశాలు లేవు. అందుకోరకు సామ్రాజ్యం రక్షించు కొనుటకుగాను అవసరమయ్యేసైన్యం, విమానాలు మొసరంగులు మొదలయిన తతంగం ఉంచటంగాలేదు. ప్రభుత్వంయొక్క ఉద్దేశ్యం దేశాన్ని యుద్ధానికి తయారుచేయాలని కానేకాదు. ఎంతసేపటికి, స్వయంకృషిచేత దేశాన్ని నిరాంతాకీ అనుపాలనుంచి తప్పించి, పరిశ్రమల్లోను, వ్యవసాయంలోను, నూతనపద్ధతులను ప్రవేశపెట్టి ఇక్కన దేశాలతోపాటు తానుకూడా ప్రపంచశాంతి విధానానికి తోడ్పాటు కావలెననే వారికోరిక.

# స్పెయిన్ దుస్థితి

——(౧)——

## మతప్రచారం — విద్యావిధానం.

స్పెయిన్‌లో మత గురువులు అనేక సంవత్సరాలనుంచి ఒక బలవత్తరమైన ప్రతీఘాత కక్షగా ఏర్పడి, ఆర్థిక, రాజకీయ జీవితాభివృద్ధికి ప్రబలమయిన ఆటంకంగా వుండేవాళ్లు. స్పెయిన్ చర్చి అనేకలక్షల ఎకరాల భూమికిన్నీ, కోట్ల ఖరీదు చేసే భవనాలకున్నూ ఆధిపత్యం వహించి అందలి ఆదాయాన్ని చర్చి అధికారుల భోగ సంతృప్తికొరకు దుబారా చేస్తుండేది. దేశము యొక్క ఆర్థిక రాజకీయ జీవనం యావత్తు స్వలాభపరులయిన యీ మత గురువులవల్ల పాడయి పోయింది. అనేక శతాబ్దాలనుంచి వారు యీ విధంగా సాగిస్తూ ప్రభుత్వంయొక్క అండ సంపాదించుకొని వుండటంచేత వారి అధికారాన్ని ఎగురగొట్టడం దుస్సాధ్యమయింది. క్రమంగా రాజకీయాధికారాన్ని గూడా యీ మత గురువులే వహించడంచేత వారి నిరంకుశత్వం, దోపిడి, నిర్బంధ విధానం మితిమీరిపోయి అప్పుడప్పుడు తిరుగుబాట్లు జరుగుతుండేవి. క్రైస్తవులలో ఒక తెగవారయిన 'జస్యూట్లు' లక్షల పౌనులు మొరాకో దేశంలోని పరిశ్రమాలయాల్లో పెట్టుబడిపెట్టి లాభాలను సంపాదించారు. ఇంకా అచ్చటి గనులలో పెట్టుబడిపెట్టిన ధనానికి మితిలేదు. ఈవిధంగా వ్యాపారంవల్ల సంపాదించిన ధనాన్ని దేశ సౌభాగ్యం నిమిత్తం వుపయోగించక స్వలాభాల కొరకు వినియోగించుకొన్నారు. చారిత్ర్యాత్మకంగా పరిశీలించినట్లయితే స్పెయిన్‌లో దౌర్భాగ్యానికిని, చర్చి అధికారానికి

ప్రత్యక్ష సంబంధం వున్నది. వినోదార్థం స్పెయిన్‌లోని చర్చి భవనాలను చూచి ఆనందిద్దామని అనుకునే వాళ్లంతా తప్పక అప్పుడప్పుడన్నా చర్చీలకు, పూరిగుడిసెలకు వున్న తారతమ్యాన్ని గ్రహించకపోరు. చర్చి భవనం ఎంత మహోన్నతంగా వుంటుందో, అంతకు పది యిబ్బళ్లు హీనంగా వుంటవి చీప కార్మిక కర్షకుల పూరిగుడిశెలు. ఆహా, మత గురువులమని పేరు పెట్టుకొని, ప్రపంచంలో ధర్మన్యాయస్థాపన చేస్తామని కంకణం కట్టుకొన్న వారి పరిపాలనాక్రమం యింత శోచనీయంగా వుంటుంది గదా! స్పెయిన్ దేశాన్ని జమీందారీ విధానంలో వుంచగలిగితేనేగాని మతాధికారులు అధికారం నిలువ బట్టుకోలేమని వారికి స్పష్టంగా తెలుసును. ప్రజాప్రభుత్వ వాదులు, సోషలిష్టులు, కమ్యూనిష్టులు మొదలయిన వారంతా యీ రక్తపిపాసులయిన మతాధికారులను బద్ధ శత్రువులుగా పరిగణిస్తారు. స్పెయిన్‌లో కార్మికోద్యమ మయినా, లేక మధ్య తరగతి వుద్యమమయినా, మతగురువుల అధికారాన్ని కూలద్రోయడమే వుద్యమంయొక్క ముఖ్య సూత్రం. ఏలనన వారి అధికారాన్ని నాశనం చేస్తేనేగాని జమీందారి విధానం నుంచి విముక్తి నొందరు. రష్యాలో మాదిరిగానే స్పెయిన్‌లోగూడా యీ మతగురువులు, వినాశకాలాన్ని చేరుతున్న నిరంకుశ ప్రభుత్వంతో యేకీభవించి ప్రజా సామాన్యాన్ని ఆర్థిక దుస్థితిలో అణచి వుంచారు. ఫాసిస్టు నియంతఅయిన "ప్రిమో డి రెవీరా" ఆధిపత్యం గ్రహించి, మతోద్ధారకులు నియంతతో చేరి చర్చి అధికారుల జీతాలను చాలా ఎక్కువ చేయడమే కాక, వారి స్వంత విద్యావిధానాన్ని అమలులో పెట్టించుకున్నారు. యీ విద్యావిధానం ప్రజలయొక్క సర్వతో ముఖాభివృద్ధికి ఏవిధంగా తీవ్రమయిన ఆటంకం కలుగ జేస్తుందో చదువరులకు గ్రాహ్యము కాగలదు.

స్పెయినులో విద్యావ్యాప్తి చాలా తక్కువగా ఉండటానికి కారణం ముఖ్యంగా మతగురువులు. కార్మికులకుగాని, వారి సంతానానికిగాని రాజకీయ విద్య నేర్పడమంటే మతాధికారులే గాకుండా, మితవాద నాయకులుకూడా ఆటంకాలు కలుగజేశారు. రాజకీయ విద్యమూలంగా కార్మికులకు వర్గచైతన్యం కలిగి ప్రభుత్వంమీదను, సంఘంమీదను తిరుగుబాటు చేయుదురని వారి భయం. స్పెయిను నిరంకుశాధికారవర్గం, యితర దేశాలలోని వారి మితవాద సోషలిస్టులకంటె కూడా మామూలుగా రోజూ జరిగే విషయాలు గాక యితర వ్యవహారాలలో సౌఖ్యం పుచ్చుకోవడంలో అంతగా జ్ఞానం కలిగి సంపాదించలేక పోయేవాళ్లు. సోషలిస్టు సిద్ధాంతాల్లో ఉత్సాహులు కావాలంటే కారాగృహాల్లో తప్ప తక్కిన ప్రదేశాలలో అవకాశముండేది కాదు. జైలుజీవితం ప్రతి తీవ్రవాదిని అయిన సోషలిస్టును, విశేషానుభవం కలిగించేది. దేశంలో అప్పుడప్పుడు బయలుదేరే తిరుగుబాట్లలో, తీవ్రవాదు లంపెరని జైలులో ప్రభుత్వంవారు పడేస్తుండేవారు. 'లెర్రాక్స' ప్రభుత్వకాలంలో షుమారు 4000 మంది సోషలిస్టులను కమ్యూనిస్టులను ఒక్క మాడ్రిడ్ జైలులోనే వేశారు. ఈ జైలులో ఏడెనిమిది మందిని ఒక్కొక్క గదిలోనికి నెట్టి తాళాలు వేశారు. ప్రతి గదిలోకూడా, తమ విరామకాలాన్ని వృథావాగ్వాదాలలో కాలయాపన చేయక, తరగతులుగా ఏర్పాటయి, మార్క్సు సిద్ధాంతాలలోను, విదేశభాషలలోను, ట్రేడ్ యూనియను సిద్ధాంతాలలోను, కృషి చేసేవాళ్లు. కారాగృహాల్లోతప్ప బయట యీ విధంగా ఉపన్యాసా లివ్వటకుగాని వినుటకుగాని బొత్తిగా అవకాశముండేదికాదు. ఏండ్లకొలంది చేసిన కృషి ఫలితంగా, బయటికి వచ్చేటప్పటికి వీరు వ్యక్తిత్వముగల మార్క్సిస్టులుగాను, విప్లవవాదులుగాను తయారయ్యేవారు.

ప్రజాప్రభుత్వం క్రింద (Popular Front Government) అభివృద్ధి సూచకములైన ప్రతిశాఖలోను చాలా శ్లాఘనీయమైన మార్పులు కలిగాయి. పుస్తక భాండాగారాలు విరివిగా పునరుద్ధరింపబడ్డాయి. ఫాసిస్టు నిర్బంధవిధానంక్రింద తగుల పెట్టబడ్డ లక్షల పుస్తకాలు మగల పుస్తక భాండాగారములలోకి ప్రవేశపెట్టబడ్డాయి. 'యూనివర్సిటీ యెక్స్టెన్షన్' అను విద్యావిధానాన్ని ఒకదాన్ని స్థాపించి దానిలో ప్రొఫెసర్లు, విద్యార్థులు చాలా శ్రద్ధపుచ్చుకొని వేలకొలది విద్యార్థులకు సోషలిస్టు సిద్ధాంతాలను నేర్పి వాటిలో ఉత్తీర్ణులను చేశారు. ఈ పని పార్టీలలోనేగాక, ఎక్కువ చోట్లకంటే, మునుపుగా సాగింది. ఇంతేగాక, పోయినసంవత్సరం, మే, జూన్ నెలలలో వరుసగా కొన్ని సభలను జరిపి, వాటిలో, వ్యవసాయ, పరిశ్రమ శాఖలను సంఘటితం చేద్దామనికూడా తీవ్రంగా చర్చించారు.

సాంఘిక అశాంతికిగల కారణాలను పూర్తిగా విమర్శించాలంటే, అప్పుడు కలిగిన జాతీయోద్యమాలను గురించికూడా తెలుసుకోవాలి. అప్పుడుగాని విమర్శ పూర్తిగాదు. 15-వ శతాబ్దం చివరకు ఒకవిధమైన జాతీయైక్యతను పొందటానికి, యూరపులో స్పెయిన్ మొట్టమొదటి దేశమైనప్పటికిని, అనేక రాష్ట్రాలు, యింకా ఒకదానినుంచి యింకొకటి, సరిహద్దులుగా యేర్పడ్డ కొండలవరుసలచేత, ప్రత్యేకించినే యున్నాయి. ఈ అడ్డంకులవల్ల రాకపోకలకు చాలా యిబ్బందిగా వుంది. 'కాటలోనియా,' 'విజకేయా,' వంటి రాష్ట్రాలు ప్రత్యేకించబడి యుండటంచేత 'కార్లిస్టు' యుద్ధాలకు మూలకారణమయింది. ఈ కార్లిస్టు యుద్ధాలు 19-వ శతాబ్దంలో స్పెయిను ధనాన్ని, మనుష్యులను తెగ పొట్టనపెట్టుకున్నాయి. కాటలోనియా ప్రజలు, ప్రత్యేక భాష, ఆచార వ్యవహారాలు, సంఘజీవనాన్ని కలిగి

యున్నారు. ఇప్పటికిని కాటలోనియా ముఖ్యపట్టణమయిన 'బార్సిలోనా' లోని ప్రజల నడవడిక యేవిధంగా జాతీయ ఆశయాలను నిరూపిస్తున్నదో మనకు తెలుస్తుంది. అనవరతం కొండలమధ్య జీవనం చేయుటచేతను, కాయకష్టమే వారి జీవనానికి ఆధారభూతమగుటచేతను, వారికి సహజమైన స్వాతంత్ర్యాభిలాష కలిగింది. ఇక్కడ ఒక విషయంమాత్రం పాఠకులు తెలుసుకోవాలె. 'కాటలోనియా' రాష్ట్రం మొదటినుంచి స్పెయిన్ ప్రభుత్వం క్రింద లేదు. 'కాటలోనియా' స్పెయినులో ఒక భాగం అని అనుకునేవారంతా, అది యీ విధంగా అవుటకు కారణం 1822-45-లో జరిగిన భీషణ యుద్ధాలవల్లనే అని తెలుసుకోవలశివస్తుంది. స్పెయిను దేశమంతటికి, యిప్పుడు కాటలోనియా రాష్ట్రం చాలా భాగ్యవంతమయినది. స్పెయిన్ ఆదాయంలో, కాటలోనియా ఇరువదివవంతు చెల్లిస్తుంది. అయినప్పటికి కాటలోనియాలో వసూలయిన పన్నులను యిచ్చటి ప్రజోపయోగార్థం వినియోగించకుండా, దూరంగావున్న యితర రాష్ట్రాలలో ఖర్చుపెట్టారు. కేంద్రప్రభుత్వం, కాటలోనియా పరిశ్రమలకు కావలసిన అసాధారణమైన అవసరాలను గుర్తించ లేక పోయింది. ఎన్నిపర్యాయాలు, అచ్చటి అవసరాలను పరిశ్రమాధికారులు తెలియజేసినా, ప్రభుత్వం, పెడచెవినిపెట్టి, అభివృద్ధికితీరని ఆటంకం కలిగించింది. 1900 నుంచి 1919 సంవత్సరంవరకు కాటలోనియా జాతీయోద్యమాన్ని ఆధారంగా చేసుకుని, బార్సిలోనాలోని పరిశ్రమాధికారులు (Industrialists) వారి పరిశ్రమలను రక్షించుకోవడానికి, సుంకాలను విధించమని మాడ్రిడ్ ప్రభుత్వాన్ని ఒత్తిడిచేశారు.

కాని పరిస్థితులు తారుమారైనవి. బార్సిలోనాలో కార్మికోద్యమం బలవత్తరంగా విస్తరించింది. ఎప్పుడు కార్మికులు

కండ్లు తెరచి అనివార్యమయిన ఒకవర్గంగా తయారయినారో, బార్సిలోనాలోని పరిశ్రమాధికారుల ఆశయాలు మాయమై పోయినవి. వెంటనే పరిశ్రమాధికారులు, స్పెయిన్‌లోని యితర పరిశ్రమాధికారులతో సంధిచేసుకుని రక్షణకు కావలసిన మార్గాలన్నిటికి ప్రయత్నము చేసుకున్నారు. ఈవిధంగా కాటలోనియాలోని జాతీయోద్యమం మధ్యతరగతుల సొత్తయింది. మధ్యతరగతుల నాయకులు, యెట్టి ఖండితమైన ఆశయాలులేకుండా స్వాతంత్ర్య ప్రజాస్వామ్యాన్ని (Autonomous Republic కోరారు. ఇటీవలనే స్పెయిన్ ప్రజాయత్త ప్రభుత్వం చాలా వరకు, కాటలోనియాకును, విశాలభూభాగం కలిగియున్న వాలెంషియా, మూర్షియా, గలీషియా, అండలూషియా, విజ్కాయా, అరగాన్, బేలరిక్ దీవులకు పరిపాలనా స్వాతంత్ర్యాన్ని (Administrative Independence) యిచ్చింది.



# స్పెయిన్ దుస్థితి.

—(o)—

## పరస్పర వైరుధ్య రాజకీయ కక్షలు.

తక్కిన యూరపియను దేశాలలో మాదిరిగానే స్పెయినులోగూడా, తీవ్రవాదులందరు అనేక రాజకీయ కక్షలుగా చీలిపోయారు. వాటిలో, సోషలిస్టులు, అనార్కిస్టులు అనే రెండూ ముఖ్యమైనవి. సోషలిస్టు పార్టీలో సభ్యులు దాదాపు 60,000 ఉన్నారు. సోషలిస్టు యూనియన్లలో 15 లక్షలపైగా సభ్యులున్నారు. అనార్కిస్టు సిద్ధాంతాలు స్పెయినులో 70 సంవత్సరాలనుంచి కార్మికుల్లో సంచలనం కలుగజేసి యుండడంచేత, వారి విశ్వాసాన్ని, ప్రేమను పూర్తిగా సంపాయించగల్గాయి. అనార్కిస్టులు గూడా రెండుభాగాలుగా ఏర్పడ్డారు. ఫెడరేషన్ అనార్కిస్టా ఐబీరికా (Federation Anarquista Iberica) అనే రహస్యసంఘం ఒకటియు, మరియొక బహిరంగ సంఘమును ఉండేవి. రహస్యసంఘంలో 10,000 మంది సభ్యులు పని చేస్తున్నారు. ఎన్నటికయినా ఫాసిస్టు ప్రభుత్వం నిరంకుశ విధానంవల్ల బహిరంగంగా పనిచేసే సంఘాన్ని నాశనంచేయునని భయంచేత రహస్యసంఘాన్ని భవిష్యదుపయోగార్థం తయారులో దాచిపెట్టుకున్నారు. అనార్కిస్టులు దీనిని చట్టసమ్మతంగా పనిచేయడం యెప్పుడూ ఒప్పుకోరు. బహిరంగంగా ప్రచారం చేసే సక్రమసంఘంలో లక్షలమంది సభ్యులున్నారు. 1919 సంవత్సరంలో అనగా మూడవ కమ్యూనిస్టు అంతర్జాతీయ సంఘం (Third Communist International) యొక్క రెండవ మహాసభ జరిగినప్పుడు అనార్కిస్టులు 'ఇంటర్నేషనల్' లో ఏకీ

భవించి తీవ్రంగా ప్రచారం సాగిద్దామని నిశ్చయించుకున్నారు. అంతేకాకుండా "కార్మిక కర్షక నియంతృత్వాన్ని (Dictatorship of the Proletariat) కూడా స్పెయిన్‌లో స్థాపిద్దామనుకున్నారు. కాని వారి మనోనిశ్చయాలు ఫలించలేదు. 'ప్రిమో డి రెవీరా' ప్రభుత్వంక్రింద అనార్కిస్టులకును, ప్రభుత్వపక్షంవారికిని భయంకరమైన యుద్ధంజరిగి, దానిలో అనార్కిస్టులు అపజయం పొందారు. వెంటనే వారి సంఘాలన్నిటినికూడా ప్రభుత్వం, సంవత్సరాల పర్యంతం తలయెత్తకుండా అణచివేసింది. ఆ మహాయుద్ధంలో ప్రభుత్వం అనార్కిస్టులయెడల చేసిన ఘోరకృత్యాలు యింతవంటివని వర్ణించటానికి అలవికానివి. కాని కొంతకాలమయిన తర్వాత, అనార్కిస్టు సిద్ధాంతాలు, సుప్రసిద్ధమయిన ఉవడంచేత, మరల తలయెత్తినాయి. మునుపటిమాదిరిగానే కార్మికుల్లో పూర్తిగా వ్యాపించినాయి. ఇప్పుడు వారు వారి విధానాన్ని మరల నిర్ణయించుకుని దానిప్రకారం కార్యక్రమాన్ని ప్రచారాన్ని నిరాటంకంగా సాగించుకుంటున్నారు. వారి పలుకుబడి స్పెయినులో మాత్రమే కాక, తక్కిన రాష్ట్రాల్లోకూడా, అనేక చోట్ల, అసమానంగా ఉన్నది. పైచెప్పిన రెండు అనార్కిస్టు సంఘాలకును, సిద్ధాంతాల్లోను, లక్ష్యాలలోనుకూడా కొన్నికొన్ని అభిప్రాయభేదా లుండడంవల్ల, యీ రెండు సంఘాలను సమ్మేళన చేయటానికై యెన్ని విశ్వప్రయత్నాలుచేసినా, సాధ్యం కాలేదు. స్పెయినులో "అంతర్జాతీయ కమ్యూనిస్టు సంఘం" యొక్క శాఖకూడా పనిచేస్తున్నది. దానిసభ్యులు 50,000 కు పైగా యున్నారు. "ముండో ఓబ్రిరో" అనే దినపత్రికనుగూడా మాడ్రిడ్ నగరమందు నడుపుతున్నారు.

స్పెయిన్ కమ్యూనిస్టుపార్టీ అంతగాబలం సంపాదించక పోయినప్పటికీ, తీవ్రమయిన విప్లవవిధానం సాగించినంతమాత్రాన

ప్రభుత్వంతో తగాదా కలుగుతుందని, తన ప్రచారాన్ని మాత్రం మానలేదు. సోవియట్ రష్యామీదను, అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీమీదను ద్వేషంగల కొందరు 'ట్రాట్స్కీ పార్టీ' సభ్యులును, యితర వ్యక్తులును స్పెయిన్ కమ్యూనిస్టు పార్టీ కార్యవిధానంయెడల విరోధభావాన్ని వహించారు. అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ, యీ విధంగా, తనగమ్యస్థానమయిన "ప్రపంచవిప్లవ సిద్ధాంతాన్ని" మరచిపోయి, సంకుచిత జాతీయతను అవలంబించుచున్నదని అపవాదం వేయుచున్నారు. ఈ అపవాదానికి యెక్కడా అవకాశంలేదని చదువరులకు మనవి చేయుచున్నాను. ఇంకొక ముఖ్యవిషయం స్పెయిన్‌లో ట్రాట్స్కీ సిద్ధాంతాలను ప్రచారం చేస్తున్న "పార్టిడో ఓబ్రిరోడి యూనిఫికేషన్ మార్క్సిస్టా" (Partido Obrero De Unification Marxista) అను పార్టీ ఫ్రాంకో-సోవియట్ సంధి (Franco-Soviet Pact) వల్ల స్పెయినుకును, రష్యా, ఫ్రాన్సు దేశాలకునుగల అన్యోన్యత చెడునసే అభిప్రాయంలో తీవ్రప్రచారాన్ని సాగించలేదని ప్రచారం గావిస్తున్నది. నేడు ట్రాట్స్కీ, సోవియట్ ప్రజాస్వామికంమీద గావించుచున్న విద్రోహకరమైన దాడివల్లను, అచ్చట లేవదీయుచున్న కుట్రలవల్లను, కోపోద్దీపితుడగుచున్న ప్రతివ్యక్తికూడా పైనెప్పబడ్డ గుప్తప్రచారంయెడల ఆశ్చర్యచకితుడు కాజాలడు.

ఫ్రెంచి-సోవియట్ సంధికి విఘాతం కలుగుతుందనికాని, తన్మూలాన స్పెయిన్-ఫ్రెంచి స్నేహం దెబ్బతింటుందనికాని భయపడి, స్పెయిన్ కమ్యూనిస్టుపార్టీ విప్లవప్రచారాన్ని సడలివిడచారని తలచడంమాత్రం పొరపాటు. అంతేకాకుండా నేడు స్పెయినులో పాప్యులర్ ఫ్రాంట్ ప్రభుత్వాన్ని స్థాపించి, ఫాసిస్టు తిరుగుబాటును ధీరత్వంతో ఎదుర్కొనుటకుగూడా కమ్యూనిస్టుపార్టీయే ముఖ్యకారణ మని తప్పక తెలుసుకోవాలె. కార్మికకర్షకుల్లో

విప్లవప్రచారంసాగిస్తూ, దినకార్యక్రమంలోగూడా సోషలిస్టు, ఆనార్కిస్టు సోదరులతో ఏకీభవించి తీవ్రంగా పనిచేస్తున్నారు. నేడు స్పెయిను ప్రభుత్వానికి విపరీతమైన అండనిచ్చి, ప్రజాయత్త విజయంకొరకు అత్యద్భుతమయిన త్యాగపరాక్రమాలను ప్రకటిస్తున్నారు. అంతర్యుద్ధంలో ప్రభుత్వానికి విజయమే కల్గితే, కమ్యూనిస్టుల పలుకుబడికి విపరీతమయినబలం చేకూరడానికి సంశయంలేదు.

పై పేర్కొనబడ్డ "పార్టిడో ఓబ్రిరో డి యూనిఫికేషన్ మార్క్సిస్టా" అనుపార్టీకి, పాపులర్ ఫ్రాంట్ అంటేగాని, యునైటెడ్ ఫ్రాంట్ అంటేగాని మొదట్లో నమ్మకం ఉండేది కాదు. దానివలనతమ ఆశయాలనుంచి దిగజారి, ఇతరపార్టీలతో కలసిపోతామనియు, తమ వ్యక్తిత్వాన్ని నిలుపుకోలేక పోతామని భయపడేవారు. కాని అంతర్యుద్ధంలో ఫాసిస్టులకు వ్యతిరేకంగా యునైటెడ్ ఫ్రాంటు (సమ్మిళిత సంఘట్టన) ఏర్పరచవలసిన ఆవశ్యకత వీరికి బోధపడింది. కమ్యూనిస్టుపార్టీవారి యెత్తులు లాభకరమైనవనికూడా గ్రహించక తప్పిందికాదు.

బార్సిలోనాలో "మార్క్సిస్టు"లకు విస్తారంగా పలుకుబడి ఉన్నది. బార్సిలోనా స్పెయిన్‌లో ప్రధానమయిన పరిశ్రమస్థానం అవుటవల్ల, అచ్చట పుట్టి, అభివృద్ధిచెందిన మార్క్సిస్టు సిద్ధాంతాలు, స్పెయినులో అంతటాకూడా కొద్ది రోజులలోనే వ్యాపింపక తప్పవు.

స్పెయిన్ సోషలిస్టు పార్టీలో అంతర్గతంగా మూడు శాఖలు ఏర్పడ్డాయి. వీటిని గురించి యిచ్చట విపులంగా ముచ్చటించటానికి చోటునూ లేదు, అదీకాక, అవసరంకూడా అంతగా కనుపించదు. ఈ మూడిట్లో ప్రధానస్థానం వహించింది "లెఫ్ట్

రివల్యూషనరీస్," (Left Revolutionaries) మిగిలిన రెండు పార్టీలు— రైట్ వింగ్ (Right wing) ఒకటీ; రెండవది సెంట్రిస్టులు (Centrists or Reformists) తీవ్రవాదులయిన "లెఫ్ట్ రివల్యూషనరీస్" నకు, స్పెయిన్ ప్రధాన మంత్రిగా ఉన్న 'కామ్రేడ్ కాబల్లెరో' నాయకత్వం వహించి కార్యక్రమాన్ని తెలివి తేటలతో జయప్రదంగా నిర్వహిస్తున్నాడు. కామ్రేడ్ కాబల్లెరో ప్రజా సామాన్యంలో చాలా పలుకుబడి కలిగినవాడు. కార్మిక కర్షకులే కాకుండా, విద్యార్థులు, యితర వర్గాలవారుకూడా అతన్ని యెంతో ప్రేమిస్తారు. సోషలిస్టు పార్టీలో యింతకు పూర్వం యెటువంటి తీవ్ర విభేదాలు ఉన్నప్పటికీ, ఫాసిజం అందరికీ బద్ధశత్రువే. కాబట్టి, భేదాలను మరచిపోయి, అందరూ చేతులు చేతులు కలిపి శత్రువును జయప్రదంగా ఢీకొంటున్నారు. ఉత్తరోత్తరా కూడా అభిప్రాయభేదాలను దేశక్షేమంకొరకు సవరించుకొని, అంతశ్శత్రువులను బహిశ్శత్రువులను రూపుమాపితేనేగాని, ఫాసిస్టు పెనుభూతం నుంచి ప్రజాసామాన్యానికి శాంతి కలుగదు. ఇట్లా తప్పకుండా సంభవిస్తుంది. తీవ్రవాదుల మనస్సులను, పరస్పర వైరుధ్యంగల అనార్కిస్టు సిద్ధాంతాలు, లెనిన సిద్ధాంతాలు తీవ్రంగా కలవరపెట్టుతున్నాయి. ఈ రెండుపార్టీల సిద్ధాంతాలను, సమన్వయం చేసి, ప్రజాసామాన్యాన్ని ఒక పార్టీ నాయకత్వం క్రిందనే నడిపిద్దామంటే, యింతమట్టుకు సాధ్యంకాలేదు. ముఖ్యంగా రెండు విషయాల్లో యీ రెండు సంస్థలకూ అభిప్రాయాలు భేదించినాయి. మితవాది ప్రభుత్వంతో కలిసి దేశాన్ని పరిపాలిద్దామనే అభిప్రాయం ఒకటి ఇంకొకటి, సాంఘిక విప్లవాన్ని త్వరలో ప్రవేశపెట్టుదామని. మితవాది నాయకుడైన 'ప్రీటో', ప్రభుత్వంతో కలిసి పనిచేద్దామంటాడు. చేతులారా, తీవ్రమైన కార్య

క్రమాన్ని అమలులో పెట్టి మధ్య తరగతులవారి సానుభూతిని గోల్పోయి, ఫాసిస్టులవశం చెయ్యకుండా, క్రమక్రమంగా సాంఘిక సంస్కరణాలను అమలులోకి తీసికొనిరావలెనని అతని అభిప్రాయం. అంతేకాకుండా, కల్లోలాలవల్ల, సంక్షోభంవల్ల, సమ్మెలవల్ల కార్మికులకు నష్టం కలిగి, వారికున్నస్థితి కొంత పోతున్నవయి, వారిని ఫాసిస్టులచేతుల్లో వప్పగించడమే కాని, ప్రయోజనమేమీ కలుగదని వాదించే వాడు.

అనుభవశాలి అయిన కామ్రేడ్ కాబల్లెరోకు ఇలాంటి వానికి ప్రోవనుమాన్నే మాటలంటే మహామంట. దేశములోని ఆర్థిక రాజకీయ పరిస్థితులను, సమగ్రంగా పరిశీలించి, ప్రజాసామాన్యానికి ఎటువంటి సిద్ధాంతాలు అవసరమో, ఎంతవరకు వాటిని అమలులో పెట్టవలయునో, సూక్ష్మబుద్ధితో ఆలోచించే మేధాశాలి. ప్రతిపక్షికిగూడా అనుభవం అవసరమని అనుభవాన్ని ఆధారంగా చేసుకొని రాజకీయరంగంలో పనిచేయాలెనని అతను గట్టిగా నొక్కి చెప్తూ వుండేవాడు. సంస్కరణ (Reformism) అంటే అతనికి బొత్తిగా సరిపడదు. ఇటలీ, జర్మనీ, ఆస్ట్రియాలాంటి దేశాల్లోను, ఇంగ్లండు, బెల్జియమ్ దేశాల్లోగూడా సంస్కరణ పద్ధతి యెటువంటి మహావిపత్తుకు కారణభూతమయినదో, కాబల్లెరో ప్రజలకు, నాయకులకుగూడా విస్పష్టముగా తెలియ చెప్పాడు. సంస్కరణ పద్ధతికి క్రమంగా అలవాటుపడి, విప్లవం అంటే అనవసరమయిన పిరికితనం, భయం తెచ్చుకొని, ఫాసిస్టు మాయలకు లోనయినది, చరిత్రవల్ల పూర్తిగా నేర్చుకొనుచున్నారు. ఇటీవలనే బెల్జియమ్ దేశంలో జరిగిన "రెక్సిస్టుల" (Rexists-ఫాసిస్టులు) తిరుగుబాటుపై వాదనకు తార్కాణం. కాబల్లెరో పార్టీవారు, ధనికవర్గంతో (Bourgeois) గాకుండా కార్మికులు

తమలో తామే ఐక్యత ఏర్పరచుకొని ప్రభుత్వాన్ని తమ స్వాధీనం చేసుకోవలశిన దని మాటిమాటికి చెపుతూ వుండేవారు.

ఇతరదేశాల్లో అనార్కిస్టు సంఘాలను చాలమట్టుకు అణచివేశిన తరువాత, ఆ వుద్యమం విజృంభించి స్పెయిన్ రాజకీయాల్లో, అనార్కిస్టు వుద్యమం బలవత్తరమయిన పాత్ర వహిస్తున్నది. స్పెయిన్‌లో దాని విజృంభణకు కారణం అచ్చటి ప్రత్యేకమయిన సాంఘిక పరిస్థితులు. చదువరులకు తెలియపరచడానికి కొన్ని ముఖ్యమయిన అనార్కిస్టు సిద్ధాంతాలను, లక్ష్యాలను గురించి యిచట క్లుప్తంగా వ్రాస్తాను. అనార్కిస్టుల చట్టప్రకారం స్వాతంత్ర్యంకంటె ఉత్తమమయినదిని, బలాత్కారంకంటె అధమమయినదిని ప్రపంచంలో ఎక్కడా లేదు.

అనార్కిస్టు సంస్థలయొక్క చట్టము (Statute Book) ఎలాంటి కష్ట పరంపరలనయినా ఎదుర్కొని ఎటువంటి త్యాగాలు చేసయినా స్వేచ్ఛను కాపాడుకోవాలె నని శాసించింగి. ప్రతి కూలిబానిసను (Wage slave) క్రమంగా మానవోచితమయిన ఆత్మగౌరవం కలిగినవానినిగా చేయగలుగుదుమని అనార్కిస్టుల దృఢనమ్మకము. ఆ విధంగా ఆత్మగౌరవం కలిగిన కార్మికుడే తన కున్న బలాన్ని, గౌరవాన్ని, వ్యక్తిత్వాన్ని తెలుసుకోగలడు. నిరాటంకమయిన స్వేచ్ఛ, నిరభ్యంతరమయిన అభివృద్ధి, మానవుడు తప్పక అనుభవించి తీరాలె నని అనార్కిస్టు సిద్ధాంతంయొక్క ముఖ్యసూత్రం. అనార్కిస్టులు ఏ విధానాన్ని గూడా కేంద్రీకరించడ మంటె అసలు ఒప్పుకోరు. కేంద్రీకరణం అంటె మహాచెడ్డ అసహ్యం. కేంద్రీకరణం (Centralization) కేంద్రాధికారాన్ని నిరంకుశంగాచేశ, రాష్ట్రాల్లోని కార్మిక కర్షకుల పయిన అధికారాన్ని చలాయిస్తుం దని వారి భయం. నియమానుసారంగా

అనార్కిస్టులు ఏ రాజకీయ సంస్థకును చెందివుండరు. రాజకీయ సిద్ధాంతాలను అనుసరించరు. రాజ్యాంగమంటె వారికి అసలే గిట్టదు; బద్ధశత్రువు. రాజ్యాంగసూత్రాన్ని ఎక్కడా నామ రూపాలు లేకుండా నాశనంచెయ్యాలని వారిసంకల్పం. బాహుళ్యం మీద పరిశ్రమలు నడిపించడం, వుత్పత్తిని ఎక్కువచేయడం, ఎక్కడా వారికి సరిపడదు. దీనివల్ల వీరు, ప్రజాసామాన్యానికి వుత్సాహంతగ్గి, వుత్పత్తి వృద్ధికావడానికి అవకాశంలేకుండా చేశారు. అనార్కిస్టులు కేవలం భౌతికవాదులు. ప్రపంచంలో ఏస్వల్ప విషయానికికూడా భౌతికసిద్ధాంతరీత్యా వ్యాఖ్యానం చేస్తారు. కార్మికులలోను వారి పారిశ్రామిక సంఘాలలోను (Syndicates) మూర్తీభవించు నీతి, మర్యాద లక్షణాలను గురించి తరుచుగా అనార్కిస్టులునొక్కి ఉపన్యసించే వారు. వారి సుగుణా లను, నీతి నిర్మలత్వాన్ని గురించి వారి శత్రువులయిన సోష లిస్టులుగూడా గ్రహించి విస్మయ మొందేవారు. వారి ధైర్య సాహసాలు, వారి త్యాగపటిమ, కష్టసహిష్ణుత, నడవడి, దౌర్జన్య పద్ధతులమీద కార్య క్రమాన్ని నడపవలెననెడి పట్టుదల, వారిలో నుంచి అనేక వీరశిఖామణులను తయారుచేశి అమోఘమయిన త్యాగానికి పురికొల్పింది. అనార్కిస్టులకు ప్రధానమయిన ఆయుధం సమ్మె. సమ్మెలు జరిగేకాలంలో ఎలెక్ట్రిసిటీని విధ్వంసంచేయుట, యంత్రాలను చెడగొట్టుట మొదలయిన యెత్తులచేత సమ్మెలను జయప్రదంగా సాగిస్తారు. ఇటీవలనే స్పెయిన్‌లో "ఆస్‌లాండ్ సిమెంటు ఫాక్టరీ" లోని కార్మికులు అనేకవేలమంది సమ్మెచేశారు. సమ్మె సాధారణమయిన పరిస్థితు లనుదాటి తీవ్రరూపం దాల్చింది. ఒకనాటి సాయంకాలం 'మాడ్రిడ్', 'బార్సిలోనా', 'సాదగోసా', పట్టణాల్లో ఎలెక్ట్రి సిటీని నిర్మూలంచేశి గాఢాంధకారంలో ముంచేశారు. లండను

"డెయిలీ హెరాల్డ్" పత్రికలో సారగోసాలోని ఒక అనార్కిస్టు తను సూచించిన అభిప్రాయం ప్రకటన అయింది. ఈ అనార్కిస్టు సమ్మెలో పాల్గొన్న ఒక కార్మికుడు అతని అభిప్రాయాన్ని యీ క్రిందివిధంగా వ్యక్తీకరించాడు "దౌర్జన్యానికి పాల్పడందే యింతవరకు చరిత్రలో యెక్కడా, ఒక గొప్ప కార్యాన్ని సాధించినట్టులేదు. దౌర్జన్యం జయానికిగాని అపజయానికి గాని అన్ని పనులకుకూడా అత్యంతావశ్యకం. దౌర్జన్యం ఉపయోగించందే, ఉత్సాహం గాని ఉద్రేకంగాని కలిగి కార్యశూరులు కారు. రివాల్వరులు, మరఫిరంగులు, స్వాతంత్ర్య యోధుడికి లక్షణం. సిరిశిపండులు, బానిసలు వీటిని ధరించుటకు అశక్తులు. ఇదిగో వీరిద్దరకునుగల భేదం. చెడిపోయి ఎందుకు పనికిరాని పురాతన పద్ధతులను తుడిచి వెయ్యాలంటే దౌర్జన్యమే తప్ప వేరేమార్గం లేదు. సర్వతోముఖాభివృద్ధి చెందగోరుచున్న నూతన సమాజానికి పరమ శత్రువుల నందరిని రక్తపాతంలో ముంచెయ్యాలి. దౌర్జన్యంతో సంఘశత్రువులను సంపూర్ణంగా హతంచెయ్యందే, సాంఘిక దురాచారం మడుగంటదు. సాంఘిక విప్లవం సామ్యప్రదంగా నెరవేరదు. మానవ చరిత్రలో, శతాబ్దాల నుంచి జరుగుచున్న కొన్ని మార్పులు ప్రజాసామాన్యాన్ని అధోగతి పాలుచేసి, వారి ఆర్థిక, సాంఘిక, రాజకీయ స్వేచ్ఛను అరికట్టి ఏ కొద్దిమంది ధనాఢ్యులకో బానిసలుగా చేయడంచేత, ప్రజల క్రోధాగ్ని మితిమీరిపోయి, వారు వట్టికబుర్లతోనే తృప్తి చెందక, అవుసరమయితే త్యాగంచేసి, క్రోధాగ్ని చల్లారేటట్లుగా ఏది అడ్డువచ్చినా నాశనం చెయ్యడానికని, వారుకూడ నాశనం కావడానికి సిద్ధంగా వున్నారు. ఇంగ్లీషు, ఫ్రెంచి, రష్యను విప్లవాల్లో ప్రజాసామాన్యం, హింస, దౌర్జన్యం అంటే భయంవేసి, తమ శత్రువులు తమను నానాబాధలుపెట్టి నాశనంచేస్తున్నా,

ఓర్చుకోటానికి ప్రయత్నించారు. దీనివల్ల విప్లవకారులకే మోసమువాటిల్లి, వారి శత్రువుల చేతుల్లోనే నాశనం అయ్యారు.''

ఫాసిస్టు నియంతఅయిన 'ప్రైమోడి రవీరా' అధికారం నుంచి పడిపోగానే, ఏ విధంగా ఆనకట్టను తెగకొట్టిన తర్వాత మహాప్రవాహం గ్రోసుకొనివస్తుందో, అట్లాగే అంతకు ముందు వరకు త్రొక్కివుంచబడ్డ అనార్కిస్టు ప్రచారమంతా ఒక్క మాటుగా పైకి పొంగింది. క్రమేణా ఒక మహాప్రవాహం మాదిరిగా బయలుదేరి ప్రజలలో విజృంభించింది. లక్షలమంది కార్మికులు అనార్కిస్టు సిద్ధాంతాలలోనే తమ భవిష్య దభివృద్ధి వున్నదని హృదయ పూర్వకంగా నమ్మిరి. ఇంతలో 1936-వ సంవత్సరం ఫిబ్రవరినెలలో క్రొత్తయెన్నికలు జరిగినవి. ఆ యెన్నికలలో కమ్యూనిస్టులు, అనార్కిస్టులు, సోషలిస్టులు, మితవాదులు, తీవ్రవాదులు అంతా కలియడంవల్ల, కార్మిక కర్షకుల ధైర్యోత్సాహాలు వెయ్యి యిబ్బళ్లు అధికమయ్యాయి. ప్రజాసామాన్యం అంతాకూడా ఏకోన్ముఖంగా నిలిచి ఎన్నికలలో తీవ్రంగా పనిచేసి, వారి యావచ్ఛక్తిని పాప్యులర్ ఫ్రాంట్ గవర్నమెంటు సంపూర్ణ విజయానికి ధారపోశారు.

---

# స్పెయిన్ దుస్థితి.

——(D)——

## స్పెయిన్‌లో అంతర్యుద్ధాలు.

18-వ శతాబ్దంలో అనేక విప్లవాలు, అంతర్యుద్ధాలు స్పెయిన్‌లో జరిగాయి. ఈ అంతర్యుద్ధాలలో ఒకపక్షం వైపు మితవాదులును, రెండవపక్షంలో సైన్యాధికారులును, నౌకాదళం, పోలీసు, 'మతగురువులు' అంతా కలిసి యుద్ధంచేశారు. మితవాద నాయకులు దేశాన్ని నవీనపద్ధతులమీద క్రొత్తయంత్రాలను అమలులోపెట్టి తక్కిన దేశాలతోపాటు అభివృద్ధికి తీసుకొద్దామని ప్రయత్నిస్తుంటే, సైన్యాధికారులు, మతగురువులు మొదలయిన అభివృద్ధి నిరోధకవర్గాలన్నికూడా, దేశాన్ని యింకా అంధకారంలో ముంచి తమ దోపిడిని, నిరంకుశాన్ని పూర్తిగా చెలాయిద్దామని ఆలోచించారు. ఇదివరకే స్పెయిన్ అనేకయుద్ధాల వల్ల అలసిపోయి ఆర్థికంగా చాలాహీనస్థితికి వచ్చింది. స్పెయిన్ దేశాన్ని ఓడించి తమ స్వాధీనం చేసుకుందామని, ఫ్రెంచి, బ్రిటిష్ దేశములు, స్పెయిన్‌లో హోరాహోరిగా పోట్లాడి స్పెయిన్ ప్రజలను ఆర్థికంగా అణగద్రొక్కారు. ఆర్థికసాధనాలన్ని అంతరించి దేశంయొక్క వాణిజ్యం మందగించింది. ఈ యుద్ధం అయినతరువాత, అంతర్యుద్ధాలు బహిర్యుద్ధాలు కంటె ఎడతెరిపి లేకుండా జరగడంచేతను, అంతులేని ధనప్రాణనష్టము కలగడం చేతను, ఆర్థికంగా దేశం మళ్లీ పూర్వపుస్థితికి రాలేక పోయింది. ఈ రక్తపాతంలోకూడా, స్పెయిన్ మితవాదులు కాస్తో కూస్తో ముందుకుసాగారు. పరిశ్రమలు అచ్చటచ్చట, యుద్ధంవల్ల తాకిడి

లేని ప్రదేశాల్లో, పెరిగాయి. ఎగుమతి దిగుమతులు నాలుగురెట్లు ఎక్కువయ్యాయి. 1850-1918 సంవత్సరాలలో జనాభా కూడా ఎక్కువయింది. 19-వ శతాబ్దాంతంలో, క్యూబా, పోర్టోరికో. ఫిలిప్పైన్ దీవులు కొంతకాలం స్వాతంత్ర్యసమరం సాగించిన తరువాత, స్పెయిన్ నిరంకుశత్వంనుంచి స్వేచ్ఛ సంపాయించుకొన్నాయి. కాని తిరిగి వెంటనే అమెరికా వారి స్వేచ్ఛను అపహరించి తన వశం చేసుకున్నది. ఈ దెబ్బతో స్పెయిన్ యొక్క జాతీయప్రతిష్ఠ కాస్తా క్షీణించింది. 1900 సంవత్సరంలో స్పెయిన్‌కు ఎక్కడాకూడ పరాయిచోట్ల స్థానంలేదు. మొదట్లో నిరాశ పూర్తిగా కలిగింది. తాను తక్కిన దేశాలతోపాటుగా గౌరవంతో తలయెత్తుకొని తిరిగే యోగ్యత కలుగలేదని చాలా చింతించింది. పెందలకడనే మేల్కొని తక్కిన దేశాలవలె, యంత్రాలను, నవీన ఆయుధ సామగ్రిని తయారుచేసుకొన్నట్లయితే తనకు యిన్నిపాట్లు కలిగియుండవు కదా యని పాపము చాలా విచారించింది. ఆత్మబలం, ఆత్మ విశ్వాసం కొద్దిగా దెబ్బతిన్నాయి. తదుపరి తెలివి తెచ్చుకొని స్పెయిన్ ప్రభుత్వం (ఇప్పుడు అధికారంలోవున్న ప్రజాప్రభుత్వం) గతించిన దానికి చింతించి ప్రయోజనం లేదని నిశ్చయించుకొని, యికనయినా అప్రమత్తతతో మెలగి, సంఘంలో ఏయే లోపా లున్నవో, యిన్నాళ్లనుంచి, తాము అపజయాన్ని పొందుటకు హేతువేదో తెలుసుకొని, ఆర్థిక, రాజకీయ, సాంఘికాభి వృద్ధికి కావలసిన మార్గాలను కనిపెట్టాలెనని నిశ్చయించుకొన్నది. దానికి ఫలితం యిప్పుడు జరుగుచున్న అంతర్యుద్ధమే. ఐరోపా మహాసంగ్రామం ఆరంభమవటంతోటే, స్పెయిన్‌లో పరిశ్రమలు అభివృద్ధి పొందినవి. స్పెయిన్ ముడిసరకులను, తయారయిన సరకులను, దేశంలోని ప్రజలకును, యుద్ధంలో పాల్గొన్న దేశా

లకును సప్లయి చేయవలసివచ్చింది. డబ్బున్నవారంతా ప్రజా ప్రతినిధులయ్యే రోజులు ఎప్పుడో అయిపోయినవి. ప్రజా సామ్యవాద సూత్రాలు, ప్రతివ్యక్తిలోను నాటిపోయి, ధనాఢ్యులు ఎక్కడబడితే అక్కడ తన్నియ్యబడ్డారు. అంతకు ముందు ధనాఢ్యులు బెదరించే బెదరింపులకు తావులేకుండా పోయింది. విధేయులంతా అవిధేయులై స్వతంత్ర్యాభిలాషులయినారు. 1917-వ సంవత్సరంలో చిన్న చిన్న వ్యాపారస్తులు, మధ్య తరగతులవారు, కార్మికులు అంతాకలశి ధనాఢ్యులమీద వరుసగా తిరుగుబాట్లు చేశారు. అధికార మదోన్మత్తతవల్ల పశుబలంవల్ల, యీ న్యాయమయిన తిరుగుబాట్లను అణగగొట్టారు. కాని యీ నిరంకుశం ప్రస్తుతం తనపనిని కొనసాగించుకొన్నప్పటికి, నూతనంగా ప్రజలకు అవసరమయిన ఆర్థిక పంథా, క్రొత్తరాజకీయ నాయకత్వానికిని, రాజకీయ సిద్ధాంతాల కొరకును ఎదురుచూశింది. ఇంతలో 1921-వ సంవత్సరంలో జరిగిన ప్రపంచ ఆర్థికమాంద్యం స్పెయిన్ పరిస్థితులను తారుమారుచేశి విషమస్థితికి తీసుకొనివచ్చింది. తాత్కాలికంగా కొన్నిచట్టాలను ప్రవేశపెట్టినా, అశాంతిమాత్రం చల్లారకుండా ఎక్కువకావడం ఆరంభించింది. చివరకు 1923-వ సంవత్సరంలో సైనికనియంతృత్వం (Military Dictatorship) స్థాపింపబడ్డది. ఏ ప్రభుత్వమయినా చిక్కుల్లోబడి, ఉపద్రవస్థితిలో వున్నప్పుడు, సైనిక నియంతృత్వమేగదా గత్యంతరం! ప్రజాసామాన్యంగాని, మధ్య తరగతులుగాని, యీ నియంతృత్వానికి యెంతమాత్రం ఆటంకం కలుగచేయలేదు. నూతనంగా వచ్చిన నియంతపేరే ప్రైమోడి రివేరా. ఇతరఫాసిస్టు నాయకులైన హిట్లరు, ముస్సోలినీలకు తీసిపోకుండా, ఫాసిస్టు ఫక్కీలో, ప్రజలను రెచ్చగొట్టకుండా, చేతిబీరకాయవంటి తియ్యని వాగ్దానాలను చేయుచు, పూర్వపు

ప్రభుత్వాలుచేసిన అత్యాచారాలను, అన్యాయాలను, నిజంగాద్వేషం గలవాడి మాదిరిగా ఖండించడం మొదలుపెట్టాడు. 'సోషలు డిమాక్రాటు పార్టీ' వారుకూడా నియంతృత్వానికి అడ్డు తగలకుండా తటస్థంగా నిలిచారు. అనార్కిస్టులుకూడా, యింతటివరకు తాము అనుభవించిన నిరంకుశ విధానంవలని బాధలచేతను, రాజకీయాల్లో అప్పటికి అంతగా ఉత్సాహంలేక పోవడంచేతా, తమలో తమకు చిల్లరతగాదా లుండడంవల్లా, నియంతృత్వానికి నిరోధం కలుగజేయలేదు. అధికార ప్రియుడైన ప్రైమోడిరివీరా, తొందరపడి, వెనుకముందు ఆలోచించకుండా, తిరుగుబాటును చేయించటంవల్ల, స్వతహాగా రాజ్యాధికారాన్ని నిర్వహించలేక పోయాడు. రాజ్యాంగ వ్యవహారాలయందు అనుభవంఅటే యెక్కువగా లేనివాడవుటచేత చక్రం యెట్లా నడపాలో అతనికి పాపం తెలియలేదు. అందుచేత అతనికి ఇటాలియను ఫాసిజాన్ని అనుసరించక తప్పింది కాదు. యూరప్‌లో యితనే ఇటలీఫాసిస్టు సిద్ధాంతాలను అనుసరించి స్పెయినులో అమలులోపెట్టినవాడు. 13-వ ఆల్ఫోంసో చక్రవర్తియును, యితడునుకలిసి, ముస్సోలినీ సలహాలను తీసుకోడానికై ఇటలీకి ప్రయాణంకట్టారు. 1923-లో మొరాకోలో ఉంచబడ్డ స్పెయిన్‌సైన్యం అచ్చటిజాతీయ విప్లవంలో ఓడించబడి, చాలానష్టాలపాలయింది. కాని ఫ్రెంచి సైన్యం సహాయంవల్ల మొరాకోజాతీయ నాయకుడైన అబ్దెల్ క్రిమ్ అనునతనిని, అతని సైన్యాన్ని స్పెయిన్ గవర్నమెంటు జయించింది. అప్పటినుంచి, కూడా, మొరాకో పరిస్థితులు క్రమంగా శాంతిని పొందాయి. 'డిరివీరా' అమలులో పెట్టిన ఆర్థికవిధానంవల్ల, పరిశ్రమాధికారులు, పెట్టుబడిదార్లు తృప్తి పడ్డారు. అన్ని పబ్లిక్ శాఖల్లోను, బ్రహ్మాండమైన కార్యక్రమాలను తయారుచేసి అమల్లోకూడా పెట్టారు. జాతీయ ఋణాలను

మూడింతలు యెక్కువచేసి, వాటిలోనుంచి, దేశాభివృద్ధికి కావలసిన ఖర్చులకై వినియోగించారు. కాటలోనియా, విజ్కాయా రాష్ట్రాలు పెక్కుసంవత్సరాలనుంచి, కేంద్ర ప్రభుత్వమును కోరు చున్న జాతీయ ఆర్థికరక్షణ విధానాన్ని (Policy of Economic Nationalism) కూడా ప్రవేశపెట్టారు. అధికంగా సుంకాలను విధించడంచేత, విదేశపోటీ వ్యాపారాన్ని అరికట్టింది. ఇవన్నీ బాగానే యున్నవి గాని, దేశసౌభాగ్యానికి మూలకందమైన కార్మిక కర్షకుల వేతనాలుమాత్రం ప్రభుత్వం యెక్కువ చెయ్య లేదు. చెయ్యకపోగా తగ్గించడంకూడా జరిగింది. న్యాయంగా వేతనాలను, ఎక్కువ చెయ్యమని కార్మికులు ప్రచారం చేసినందుకును, కొంత అలజడి కలిగించినందుకును, వారిని క్రూరంగా హింసించారు. క్రూరవిధానంవల్ల గాని, మరియే యితర మాయోపాయాలవల్ల గాని, 1918—1921 సంవత్సరాల్లో, అతిప్రాముఖ్యత వహించిన రయితుల తిరుగుబాట్లు, యిపుడు మచ్చునకైనా కనుపించడం లేదు. సాధారణంగా ఫాసిస్టులకు పరిపాటయిన కపటోపాయాలవల్ల, కార్మిక కర్షకులలో విప్లవ జ్వాలలు తగ్గుతాయనే అభిప్రాయంతో, సోషలు డిమాక్రాటు నాయకులకును, యితర కార్మికనాయకులకును, మంచి గొప్పగొప్ప ఉద్యోగాలు, 'రివీరా' సృష్టించాడు. కార్మికుల శ్రేయోభివృద్ధికై కంకణంకట్టుకుని, స్వాభిలాష యేమాత్రంలేక, సకలకష్ట పరంపర లకునోర్చి, పోరాడే యీ వీరాగ్రేసరులు, యీ ఫాసిస్టు నియంత, నాలుగుద్యోగాలు ఆశపెట్టడంతోటే, తమ ప్రతిజ్ఞను విడిచి పోవునంతటి పిరికిపందలుకారని పాపం అతనికి తెలియదు కాబోలు. కాని 1928-వ సంవత్సరం దాటినతర్వాత మరలప్రపంచ ఆర్థికో త్పాతం తటస్థించింది. క్రమంగా ప్రైమోడిరివీరా, తాను యెవరిని యిన్నిరోజులనుంచి నమ్మాడో, అటువంటి పరిశ్రమాధి

కారులు, సైన్యం, మధ్యతరగతులు, అతనికి సహాయంచెయ్యడం మానేశారు. అతనికి అండ పూర్తిగా నశించడంవల్ల, అధికారం కూడా దానితోపాటు నశించింది.

మధ్యతరగతుల్లో, అశాంతి, అసంతృప్తి, మితిమీరి పోయింది. కొన్ని ప్రదేశాల్లో విద్యార్థుల్లోకూడా, అసంతృప్తి యెక్కువై మొట్టమొదట అల్లరులలోకి దించింది. ఎన్నివిధాల దేశంలో విజ్ఞాన జీవితాన్ని ఉక్కిరిబిక్కిరి లాడకుండా, అణగ గొట్టాలని నిశ్చయించుకున్నాడో అన్నివిధాలా, ప్రయత్నించాడు. పత్రికలపైన కఠినమైన నిర్బంధవిధానాన్ని ప్రయోగించాడు. మత గురువులు నిశ్చయించి సిఫార్సుచేసిన విద్యావిధానాన్నే అమల్లోకి తెచ్చాడు. జెస్యూటు కాలేజీలోని పరీక్షాపద్ధతిని 'శాంక్షన్' చెయ్యాలని, జెస్యూట్లు, విశ్వవిద్యాలయాధికారులను ఒత్తిడిచేసేటప్పటికి, శాంక్షన్ చేయక తప్పిందికాదు. జెస్యూటు కాలేజీలో విద్యావిధానం చాలా తక్కువ రకమని విశ్వవిద్యాలయాధికారులకు తెలియకపోలేదు. కాని మతగురువులు సంఘంలో ఆక్రమించుకొన్న స్థానాలు బలవత్తరమయిన వవుటవల్ల, వారి మాట జవదాటడానికి వీలులేకపోయింది. ఈ ప్రయత్నంలో జెస్యూట్లు, సులభంగా జయంపొందారు. ప్రభుత్వం యీ కాలేజీ పరీక్షా పద్ధతులను అంగీకరించినట్లు, చట్టంకూడా ప్యాసుచేసింది. దేశమంతటాకూడా, విద్యార్థులు ప్రభుత్వపక్షంమీద తిరుగుబాటు చేశారు. వీధుల్లో సహితం, దీర్ఘకాలం పోరాటం పోలీసులతో జరిపారు. అప్పుడుగాని ప్రభుత్వం లొంగలేదు. స్త్రీవిద్యార్థులు కూడా చాలా ఉత్సాహంగాను, ఉద్రేకంగాను పోట్లాడారు. సైన్యంలోను, పారిశ్రామిక, మధ్యతరగతి వర్గాలలోనుంచి బయలుదేరిన తీవ్రమగు అసంతృప్తిని యెదుర్కొనలేక, తన్నుతానే కార్మిక కర్షకులలోనుంచి, సైన్యంలోనుంచి ఆవిర్భవించే విప్లవ

జ్వాలలనుంచి తప్పించుకుందామని, అల్ఫాంసో చక్రవర్తి, ప్రైమోడి రెవీరాను 1930-లో, నియంతృత్వాంనుంచి తొలగించడమే కాకుండా, ప్రభుత్వ వ్యవహారాల్లో జోక్యమే లేకుండాచేశాడు. అల్ఫాంసో ఒకందుకు తల్లడిల్లాడు. కార్మిక కర్షకులను యిన్నాళ్లనుంచి అపరిమిత బాధలుపెట్టినందుకు, వారి అవకాశం తీసుకొని శత్రువులపైన పగతీర్చుకొని రూపులేకుండా చేస్తారేమోనని భయపడ్డాడు. అందుకనే డీ రెవీరాను పదభ్రష్టుడిని చేశినయెడల కొంతవరకన్నా కార్మికుల ఉద్రేకం తగ్గుతుందనుకున్నాడు. దేశమంతటా ఎక్కడచూచినా ఊరేగింపులే, ఉత్సాహమే. వారి (కార్మిక కర్షకులు) సంతోషం యింతింతని వర్ణించటానికి వీలే లేదు. ఏమూలచూచినా "రాజు నశించుగాక" అను కేకలే. మూలమూలలు, జయజయధ్వానాలతో మారు మ్రోగిపోయాయి. డిరెవీరాపతనం స్పెయిను విప్లవనాటకానికి మొదటి అధ్యాయమవుతుంది. నూతన యెన్నికలుజరిగాయి. రిపబ్లికనులు (ప్రజాతంత్రవాదులు) పూర్ణమైన మెజారిటీతో గెలిచారు. 1932-వ సంవత్సరం చివరవరకు, స్పెయిన్ రిపబ్లికు ప్రభుత్వరక్షణార్థం, శత్రువులను అణచుటకై చాలా కఠినమైన శాసనాలను అమలు చేశారు. ఈ చట్టాలలో ముఖ్యమైనవి యివి: రిపబ్లిక్ రక్షణార్థం ఒకటియూ, రెండవది జెస్యూట్లు, చర్చి మతగురువులు అధీనమైయున్న అనేకలక్షలు, కోట్లధనము, భూములును జప్తుచేశి ప్రభుత్వవశం చేసుకొనుటకును, మూడవది స్త్రీలకు వోటింగు అధికారం యిచ్చుటకును ప్రవేశించబడినవి. 1932 సంవత్సరం చివరనుంచి రిపబ్లికునకు చాలా గొప్పచిక్కులు కలిగాయి. ఆర్థిక వ్యవహారాల్లో రిపబ్లికుయొక్క అభివృద్ధి అంత తృప్తికరంగా లేదు. ఇదే సందు దొరకింది గదా యని, ప్రభుత్వవిరోధులయిన ప్రతీఘాతులు, అంతా ఒకటై అర్థిరోత్సాతం కలిగినందుకు ప్రభుత్వంమీద విరుచుకుని

పడి నిందించడం మొదలుపెట్టారు. 1927 సంవత్సరంనుంచి 1933 వరకు 3000 సమ్మెలు జరిగాయి. వీటికి పర్యవసానంగా, స్పెయినులో 1933—35 మధ్య భయంకరమైన ప్రతిక్రియ (Reaction) కలిగింది. విద్రోహులు చెలరేగారు. 1933 మార్చి నెలలో ప్రభుత్వం ఫాసిస్టు ప్రచారాన్ని నిషేధించింది. ఆ సంవత్సరంలోనే జూలై మాసంలో సోవియటు రష్యా, స్పెయిను ప్రభుత్వాన్ని, చట్ట, సమ్మతమయినదనిన్ని, ప్రజాసమ్మతమయినదనిన్ని న్యాయమైనదనిన్ని, అంగీకరించింది. కాని ఆగష్టు నెలలో స్పెయిను రిపబ్లికు రక్షణార్థం ప్రయోగించిన చట్టాన్ని రద్దు చేశారు. డిశంబరు నెలలో ఒక నూతన పార్లమెంటును (Cortez) ఎన్నుకొన్నారు. దీనిలో 207 రైటు వింగు (Right Wing) సభ్యులును 62 మంది 'గిల్ రోబిల్స్ ఫాసిస్టు పార్టీ' తరపున యెన్నుకొనబడ్డ సభ్యులును, 58 సోషలిస్టులును ఒక కమ్యూనిస్టున్ను, సోషలిస్టు పార్టీలోనే అంతశ్శాఖ అయిన 'సెంట్రిస్టుపార్టీ' తరపున ఎన్నుకొనబడిన సభ్యులు 167 మందియును ఉన్నారు. 1934 సంవత్సరం జనవరి నెలలో "కాన్సెంట్రేషన్ క్యాంపుల్," (Concentration Camps) [హిట్లరు జర్మనీలో అధికారమునకు వచ్చినప్పటినుంచి యిప్పటివరకు యిటువంటి కాన్సెంట్రేషన్ క్యాంపులను వందలకొలది ఏర్పాటుచేశి, సోషలిస్టులను, కమ్యూనిస్టులను, సోషల్ డిమాక్రాటులను, చివరకు క్యాథలిక్ మతగురువులను సహితము వాటిలో పడవైచి నోటికిరానన్ని క్రూరకృత్యముల పాల్జేయుచున్నాడు.] అను కారాగృహములను స్థాపించాలని ప్రకటించింది ప్రభుత్వం. ఏప్రియల్ నెలలో 'రైటువింగు'కు చెందిన రాజకీయ ఖైదీల విడుదల కొరకు చట్టాన్ని అమలులోపెట్టారు. 1935 జూన్ 8-వ తారీఖున ప్రజాస్వామిక వాదులలో తీవ్రవాది అయిన క్యాప్టెన్ అజానా

ప్రభుత్వంలోనుంచి రాజీనామా యిచ్చాడు. సెప్టెంబరులో ప్రజాస్వామికపార్టీలో మితవాది అయిన 'లెర్రాక్స్' మరల ప్రభుత్వవర్గాన్ని ఏర్పరచుకొన్నాడు. అనంతరం లెర్రాక్స్ పదభ్రష్టుడుకాగా, అతనిస్థానే 'సాంపర్' అధికారంలోకి వచ్చాడు. సాంపర్ ప్రభుత్వవిధానం యించుమించుగా అన్ని విషయాల్లోగూడా జర్మనీలోని 'వాన్‌సాపెన్' ప్రభుత్వాన్ని పోలి ఉండేది. సాంపర్ దేశంలోని అసంతుష్టిని, అశాంతిని చూచి ఖంగారుపడి, ప్రభుత్వాధికారాన్ని తెలివి తేటలతో చలాయించ లేక పోయినాడు. పైగా స్పెయినులో అశాంతి యేమీలేదనీ, అంతా సవ్యంగాను, తృప్తికరంగానే నడుస్తున్నదని గంభీరంగా ప్రకటించాడు. సమ్మెలు మహోద్రేకంగా వ్యాపించినాయి. ఇన్ని సంవత్సరాలనుంచి, సాంపర్ ప్రభుత్వాన్ని ప్రతిఘటించడానికి మాడ్రిడ్‌లోని కార్మికులు ఒక పెద్దసమ్మెను యేర్పాటుచేసి సాగించారు. అస్టూరియాస్ అను రాష్ట్రంలో 'గిల్‌రోబిల్స్' ఏర్పాటుచేసిన ఫాసిస్టు ఉత్సవానికి ప్రతిక్రియగా జవాబు చెప్పటకు బ్రహ్మాండమైన సమ్మెను ఏర్పాటుచేసి, దానిని విజయవంతంగా సాగించారు. అనార్కిస్టులు తమలో ఉన్న భేదాలను మరచిపోయి, గవర్నమెంటుతో పోరాటం సల్పడానికి ఏకమయినారు. సోషలిస్టులు, కమ్యూనిస్టులు కలసి, మాడ్రిడ్‌లో ఒకలక్షమంది గల సభను ఏర్పాటుచేసి ప్రభుత్వాన్ని భయభ్రాంతులను చేశారు. వెంటనే కార్మిక నాయకులను, కమ్యూనిస్టులను, వేలమందిని అరెస్టుచేసి, కఠినశిక్షలు విధించింది ప్రభుత్వం. మాడ్రిడ్‌నందు కార్మికుల యిండ్లలోను, కమ్యూనిస్టు, సోషలిస్టు ఆఫీసులలోను సోదాలు జరిగాయి. ప్రభుత్వాధికారులు అకస్మాత్తుగా గాభరాపడ్డారు. రిపబ్లికు పార్టీవారు, సోషలిస్టులు యింకా యితరులు, ప్రభుత్వం తమయెడల జరిపిన అవమానాలు

అకృత్యాలు సహించలేక, తిరుగుబాటు చేశారు. జయప్రదంగా సమ్మెలు జరిగాయి. రిపబ్లికనులకు, ఫాసిస్టులకు భయంకరమైన పోరాటం జరిగి దానిలో రిపబ్లికనులు పూర్తిగా ఫాసిస్టులను జయించారు. విజయసూచకంగా, సంతోషాన్ని, ఉత్సాహాన్ని వెల్లడించుటకు, లక్షలమంది మాడ్రిడ్ లో ఉత్సవంలో పాల్గొన్నారు. ఆయుధాలను తమకు వెంటనే సప్లయి చేయవలసినదని కార్మికులు ప్రభుత్వాన్ని కోరగా, వెంటనే వారి కోరిక తీర్చి వారిని "పీపుల్సు మిలిషియా" (Peoples Militia) అను ప్రజా సైనికదళాన్ని త్వరత్వరగా ఏర్పాటుగావించారు. అక్టోబరు 5-వ తారీఖు సాయంత్రము 10000 మంది మిలిషియాలో ఒకరిబలవంతం యెంతమాత్రంకూడా లేకుండానే చేరారు. ఆ సాయంత్రమే, కొంత లోనితరా జాతీయవాదుల కోరికప్రకారం అచ్చట, రిపబ్లికు, ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని నెలకొల్పాలని ప్రకటించారు. ఆస్టూరియాలోని కార్మికుల తిరుగుబాటుకు ఫలితంగా అచ్చట "కమ్యూన్" (కమ్యూనిస్టు సిద్ధాంతాల ననుసరించు తాత్కాలిక ఆర్థిక రాజకీయ ప్రభుత్వపద్ధతి) స్థాపించారు. ఈ కమ్యూన్ 15 రోజుల పాటుమాత్రమే, అమలులో ఉన్నది. (1935 సంవత్సరం అక్టోబరు 5-వ తారీఖునుంచి 19-వ తారీఖువరకు) ఆస్టూరియా తిరుగుబాటులో ప్రథమపర్యాయం, ఆస్టూరియాలోని గనులలో పనిచేసే కార్మికులు, సోషలిస్టులు, అనార్కిస్టులు, కమ్యూనిస్టులు, ఏకమయి, ఒకసంఘంగా ఏర్పడ్డారు. కమ్యూనిస్టు సైన్యాన్ని తక్షణం ఏర్పరచి దానికి కావలసిన రివాల్వరులు, డైనమైట్లు మొదలయిన ఆయుధపరికరాల నన్నిటిని సప్లయిచేశారు. ఈ శుభవార్త ఆస్టూరియాలోని గనులప్రాంతమంతా వ్యాపించింది. ఎక్కడికార్మికులక్కడ తమ అధికారులమీద, బ్యాంకులమీద, పోలీసు స్టేషనులమీద, మిలిటరీ బ్యారెక్సుమీద తిరుగుబాటు

చేశారు. గవర్నమెంటు సైన్యాన్ని దొరకినదానిని దొరకినట్టుగా ధ్వంసంచేసి వేలకొలది ఫిరంగులు, మెషీన్‌గన్‌లను వశంచేసుకున్నారు. మూడు గవర్నమెంటు ఆయుధఫ్యాక్టరీలను, బ్యాంకీలను ఆక్రమించుకున్నారు. ఫాసిస్టుప్రభుత్వం గత్యంతరంలేక స్వజాతీయులైన అస్టూరియా కార్మికులను, అరేబియా, మొరాకో సైన్యంచేతా, విదేశసైనికదళాలకు డబ్బిచ్చి వారిచేతా, చావమోదించి చివరకు ఓడించారు. అంతటితోపోకుండా కడుపు తరుక్కుని పొయ్యేటట్టుగా, అకృత్యాలాచరించారు. కార్మికులను చిత్రవధగావించారు. బ్రతికివున్నవారిని సహితం మండుచున్న అగ్నిలో పడవేశారు. ఇంకెన్నో దుష్కృత్యాలు సల్పారు. బ్రతికి తప్పించుకొని పోయినవారు కొండల్లోకి, అడవుల్లోకి పారిపోయి ఆకలిబాధకు సహించలేక చాలామంది చనిపొయ్యారు. కొంతమంది చలికి, మంచుకు గడ్డకట్టుకుపోయారు. దేశంమొత్తంమీద 35,000 సోషలిస్టులు, అనార్కిస్టులు, కమ్యూనిస్టులను శిక్షించి జైళ్లలో వేశారు. చాలామందిని ప్రవాసాలకు పంపించారు. ప్రభుత్వ దౌర్జన్యం, దురాగతాలు, నిరంకుశత్వం యెక్కువయినకొలది, ప్రజలలోను, అందులో ముఖ్యంగా, కార్మికుల్లో అశాంతి ప్రబలింది. ప్రభుత్వానికి అన్నిప్రక్కలనుంచి ఒత్తిడి యెక్కువ అయింది. దేశమంతటా, సమ్మెలు తీవ్రంగాను, విరివిగాను సాగటం మొదలుపెట్టాయి. అస్టూరియాలో కార్మికులు చూపిన ధైర్యాన్ని, త్యాగాన్ని చూచి, కార్మికకర్షకులు ఐకమత్యం చెందారు. గవర్నమెంటు గజగజవడకింది. మూరస్థంగా కాపురంచేస్తూ, సమస్తసుఖాలననుభవిస్తున్న భూస్వాములు, దేశానికి భారమయి, కంటకులుగా పరిగణింపబడ్డారు. వారివల్ల ఆర్థికపునరుద్ధరణానికి చాలా దుర్ఘటమై ప్రబలమైన ఆటంకం గలిగింది. 1936 సంవత్సరం ఫిబ్రవరినెలలో మరల క్రొత్తయెన్నికలకు సమయంవచ్చింది.

ఆ యెన్నికలలో దక్షిణప్రాంతా లన్నిటికంటె అస్టూరియా రాష్ట్రంలో నూటికి నూరుమంది ప్రజాపక్షనాయకులకు మాత్రమే ఓట్లిచ్చారు. కమ్యూనిస్టులంతాకూడా యింతకుముందు రాజకీయ నిర్బంధం అనుభవిస్తున్న 35000 ఖైదీలను విడుదలచెయ్యాలని గట్టిగా పట్టుపట్టారు. వారిపట్టు సాగిందికూడాను. కార్మికులను నానాబాధల పాల్జేశి, వారిని పశువులకంటెకూడా హీనంగాను నిర్లక్ష్యంగాను చూచినందుకు, ప్రభుత్వమే పూర్తిగా దెబ్బ తిన్నది. అస్టూరియాలోని కమ్యూనిస్టులు కొన్ని రాజకీయయెత్తులలో లోట్లుపాట్లు చేసినప్పటికి, మొత్తంమీద జయభేరి మ్రోగించారు. ఫిబ్రవరిలో స్థాపించిన పాప్యులర్ ఫ్రాంటుగవర్నమెంటులో మితవాదులయిన రిపబ్లికనులనుంచి అతివాగులయిన కమ్యూనిస్టులవరకు ఉండే వర్గాలవారందరూ కలశిఉన్నారు. అంటె నూతనప్రభుత్వం సర్వజనసమ్మతంగా ఎన్నుకోబడ్డదన్న మాట. ఫాసిస్టు నియంతృత్వంక్రింద, కార్మిక కర్షకులేకాక, సామాన్య ప్రజలు పడ్డబాధలు, అవమానాలూ మరచిపోదామన్నా మరపునకు రానివి. శత్రువులచేతిలో యున్న అనుభవాలు అనుభవించిన తర్వాత, ప్రజలంతా ఐక్యకంఠంతో నూతన ప్రభుత్వానికి విజయం చేకూర్చి తమకష్ట పరంపరలను పోగొట్టుకుందామని ఆశించారు. నూతన ప్రజాస్వామ్యంయొక్క అఖండవిజయంతో, స్పెయిన్ చరిత్రలో ఒక నూతనశకం ఆరంభమయింది.



# స్పెయిన్ దుస్థితి.

——(౦)——

## లార్గో కాబల్లెరో

స్పెయిను విప్లవచరిత్ర తెలుసుకునేటప్పుడు సోషలిస్టు విప్లవపక్షానికి నాయకుడయి ప్రధానమంత్రిగాను, సర్వ సేనాపతిగానున్న కామ్రేడ్ కాబల్లెరోను గురించి యిచ్చట క్లుప్తంగా వ్రాయుట అప్రస్తుతం కాదు. కాబల్లెరో తీవ్రవాద సోషలిస్టు నాయకుడై స్పెయినులో అఖండమైన పలుకుబడిని సంపాయించిన సంగతి ప్రపంచమంతా ఒప్పుకున్న విషయమే. యూరప్ సోషలిస్టు ఉద్యమంలోగూడా లెనిన్ చనిపోయిన తర్వాత, అసమానమైన ఖ్యాతి గడించిన మహావ్యక్తి యితడు. సోషలిస్టులమని దొంగపేర్లు పెట్టుకొని, ఉద్యమాలు లేవదీశి, తమ దేశపు కార్మికులను, ప్రజాసామాన్యాన్నే గాకుండా, ప్రపంచ కార్మికులను సహితం మోసగించి, కార్మికోద్యమానికి అపఖ్యాతి కలిగించిన మాక్డొనాల్డు, స్నోడన్ వంటి ద్రోహులు, స్వలాభపరాయణులవలె యెంతమాత్రంగాక, కార్మిక కర్షకులే ప్రపంచ సౌఖ్యానికి ఆధారభూతులని నమ్మి, వారి సంపూర్ణబలము, ఐక్యత, క్షేమం మీదనే ప్రపంచం బ్రతుకు ఆధారపడియున్నదని విశ్వసించి, యెల్లప్పుడు వారి మధ్యనే మెలగుతూ, వారిలోనే ప్రచారం చేయుచుండెడి స్వార్థత్యాగి కాబల్లెరో. కాబల్లెరో గొప్ప కుశలతగల మేధావి. ఎడతెరిపిలేకుండా ట్రేడ్ యూనియన్ కార్మికులలో ప్రచారంచేస్తూయుండేవాడు. లెనిన్ మాదిరిగానే సామాన్యమైన బీదరయితు కుటుంబంలో జన్మించాడు. అతడుచేసే రాజకీయాలోచనలనుబట్టి, యెత్తులనుబట్టి, విచారిస్తే,

స్పెయిను రయితులయొక్క మనోభావాలు, కార్యదీక్ష స్పష్టపడు తుంది. అతని వయస్సు యిప్పుడు 66 సంవత్సరాలయినను 40 లేక 45 యేండ్ల యువకుని మోస్తరుగా కనుపిస్తాడు. అయిదారు సార్లు కారాగృహవాసం అనుభవించి పెక్కుబాధలకు గురియవుట వల్లను, భార్యా వియోగుడవుట వల్లను, అతని మనస్సును పెద్ద తనంలో వికలపరచాయి. కాని ఉత్సాహం, విప్లవశక్తి, కార్య దీక్షలలో మట్టుకు, సాటిలేనివాడనుట నిర్వివాదము. యువకుల కంటెను, ముందంజవేశి, యువకులకే మార్గం చూపేవాడు. అతడు ఏడు సంవత్సరాల బాలుడుగానున్నప్పుడు ఒక చిన్న కార్మికు డుగా ప్రవేశించి పొట్ట పోసుకుంటేవాడు. దాదాపు 20-వ సంవత్సరం వచ్చేవరకు కార్మికుడుగానే జీవితం గడిపాడు. 20-వ సంవత్సరం ప్రవేశించిన తర్వాత అతడు చదువను, వ్రాయను నేర్చు కున్నాడు. 40 సంవత్సరాల కాలంవరకు కాబెల్లెరో ట్రేడ్ యూనియన్ సంఘాలను స్థాపించి ప్రచారం సాగించాడు. భవ నాలను నిర్మించే కార్మికసంఘాలను ట్రేడ్ యూనియన్ యాక్టు క్రిందకు తీసికొనివచ్చి, చాలాకాలం వాటికి అధ్యక్షుడై జరుగా పని చేశాడు. అతడు శాస్త్రీయమైన ఆలోచనచేసి కార్మిక కర్షకుల యోగక్షేమానికి అవసరమైన కార్యక్రమాన్నే ఆచరించాడు. 1917 సంవత్సరంలో ప్రభుత్వం యితనికి యావజ్జీవ కారాగార వాస శిక్ష విధించింది. కాని ప్రైమోడిరివీరా ప్రభుత్వకాలంలో యితన్ని వదిలేశారు. ఎన్నికలలో అభ్యర్థిగా నిలచి "కౌన్సిల్ ఆఫ్ స్టేటు" కు సభ్యుడుగా ఎన్నుకోబడ్డాడు. 1931 సంవత్స రంలో రిపబ్లికన్ ప్రభుత్వం యితనిని 'కార్మికమంత్రి' గా నియ మించింది. పార్లమెంటరీ విధానం అంటేకూడా చిన్నప్పటి నుంచి కాబెల్లెరోకు చాలావరకు విశ్వాసం ఉంటేది. తను ఏ పని చేతామనుకున్నా, మనస్సును దానియందే లగ్నంచేశి,

ఆ పని నెరవేరిందాకా పట్టువదలేవాడుకాడు. ఆత్మవిశ్వాసం అతనికి పట్టుకొమ్మ. కొంతకాలమయిన తర్వాత, యితర మంత్రుల యందు యితనికి అసహ్యం తోచింది. స్వార్థపరాయణులయిన వారితో కలసి మంత్రివర్గంలో ఉన్న యెడల తనతీవ్రకార్యక్రమానికి విఘాతం కలుగుతుం దనుకున్నాడు. ఇతరమంత్రులకు యితన్ని చూస్తే గిట్టేదికాదు. అసూయ నానాటికి వృద్ధి అయిపోయింది. ఈ విధంగా సహచరులైన మంత్రుల మనస్సును బాగాగుర్తించి, వారి సాంగత్యంవల్ల మంచి అనుభవం సంపాయించాడు కాబెల్లెరో.

గవర్నమెంటు భవనంలో మొదటి అంతస్థులో ఇతని ఆఫీసు ఉండేది. కుశాగ్రబుద్ధి కలవాడు గనుక, చట్టాలను, ఆర్డర్లను త్రుటికాలంలో తయారుచేసి, మిగతా వివరాలను పూర్తి చేయుటకొరకు తన క్రింది ఉద్యోగస్తులుండు రెండవ అంతస్థుకు పంపేవాడు. ఉద్యోగస్తులకు యితడంటే అనవసరమయిన ఈర్ష్య ఉండడంవల్ల, యితడనుకున్న ఉద్దేశాలకు వ్యతిరేకంగా నడుస్తూ, యితనితో సహకారం చెయ్యడం మానేశారు. తన క్రింది ఉద్యోగస్తులుకూడా. యితరమంత్రుల మాటలువిని, యితనికి యేవిధంగా నయినా విసుగుపుట్టించి, రాజీనామా యిప్పించాలని నానా విశ్వప్రయత్నాలు చేశారు. కామ్రేడ్ కాబెల్లెరోకు మనశ్శాంతి కలుగలేదు. నెలల పర్యంతము క్రింది అధికారులతో మందలింపు చేసినను, ప్రయోజనం లేకపోయింది. ఇతర యూరపియన్ దేశాలలోని తన సహచరుల మోస్తరుగా గాకుండా, ఇతడు పదవులను తృణీకారభావంతో చూచేవాడు. ఇతరదేశాలలోని మంత్రులు ఇటువంటి పరిస్థితులలో, అధికారాన్ని వదులుకొనుటకు యిష్టంలేక, తమ ఆత్మగౌరవానికి భంగంవాటిల్లి, ప్రజలు నిరసించినాగూడా,

వాటినే పట్టుకుని ఊగులాడుచుండే వారు. తన ఉద్దేశాలను చెప్పించి, తనచే ప్రవేశపెట్టబడిన బిల్లులు, పార్లమెంటులో బలమైన మెజారిటీచే ప్యాసుకాబడినను, ప్రభుత్వం అతనిమీద ఉండే రాజకీయ క్రోధంచేత, వాటిని ఆచరణలోనికి తెచ్చేది కాదు. ఇంతకు అతని క్రింది అధికారులే, తాను వేయు రాజకీయ మంత్రాలోచనలకు అన్ని వైపులనుంచి ఆటంకాలు కలిగించి ప్రజా క్షేమంకొరకు ఉపయోగపడే చట్టాలను అములులోకి రాకుండా ద్రోహం చేశారు.

ఈ తీవ్రమైన అనుభవాలు, కాబెల్లెరోకు మంచివిలువగల పాఠం నేర్పి, అతనిచేత అసాధారణమైన కార్యానికి పురికొల్పినాయి. మార్క్సు-లెనిన్ సిద్ధాంతాల నన్నిటిని ఓపికతో చదవడం మొదలుపెట్టాడు. ఉన్నవి ఉన్నట్టుగా పరిస్థితులను అవలోకించాడు. తాను యిన్నాళ్లనుంచి ఏ మితవాద ధనాఢ్యనాయకులతో (Liberal Bourgeoisie) సహకారం చేశాడో, వారు తమ స్వాభిలాషను విడువగనియు, వారిలాభాలను ఎన్నటికి సంఘపరసపరం చెయ్యరనియు, దృఢంగానమ్మాడు. ఇతరులనుగూడా తన అభిప్రాయమునకే తీసుకొనివచ్చాడు. ప్రస్తుత పరిస్థితులనుబట్టి చూస్తే, మితవాదులతో సఖ్యత దేశప్రజల చేటునకు కారణమనియు, సోషలిస్టు, కమ్యూనిస్టుల ఆత్మగౌరవమునకు, ప్రతిష్టకు మచ్చ అనియు గ్రహించాడు. ఇసుమంతయినా ప్రయోజనం కలుగనేరదు. 1934 సంవత్సరంలో నిరంకుశప్రభుత్వం రాజ్యంచేయుచున్నప్పుడు, కామ్రేడ్ కాబెల్లెరో కారాగారవాసశిక్ష ననుభవిస్తున్నాడు. ఆ శిక్ష అతని జీవితకాలంలో అనుభవించుటం ఆరవ పర్యాయం. నవంబరు 1935 సంవత్సరంలో అతను విడిచిపెట్టబడ్డాడు. పార్లమెంటులో పనిచేయుచున్న సోషలిస్టుపార్టీలోని ఒకశాఖ, పార్టీనుంచి విడిపోయి, ప్రత్యేకంగా స్వతంత్రపార్టీ

స్థాపించుకున్నది. ఈ తెలివితక్కువ చర్యను కాబల్లెరో జైలు
నుంచియే కడుతీవ్రతతో నిరశించి హోరాహోరిగా పోట్లాడాడు.
క్రమంగా అతనిపలుకుబడి అన్నిసంస్థల్లోను, ప్రజాబాహుళ్యం
లోను, బలమవుచుండుటవల్ల, ఇతనిని ప్రజలు ఏకగ్రీవంగా తీవ్ర
మయిన సోషలిస్టునాయకుడని ఒప్పుకున్నారు. ప్రజామోదాన్ని
పూర్తిగా పొందాడు. స్పెయిన్ ముఖ్యపట్టణాల్లో, యిండ్లగోడల
మీదను, చర్చిలమీదను, రైలుబండ్లమీద, నాటకశాలలమీద,
యింకా అనేకచోట్ల "కాబల్లెరో వర్ధిల్లుగాక — కాబల్లెరోకు
జై" అను వాక్యాలు యిప్పటికిని కనుపిస్తాయి.

అక్టోబరుమాసంలో జరిగిన తిరుగుబాటు సందర్భంలో
కాబల్లెరో కొన్ని పొరపాట్లు చేసినప్పటికిని, అతని పలుకుబడి
ఏమంత యెక్కువగా దెబ్బతినలేదు. ప్రజలు అతన్ని సర్వాధి
కారిగా పరిగణించి గౌరవించారు. ప్రజలు అనేకమంది ఆ
తప్పులు అతనివి యెంతమాత్రం కావనియు, అతని సలహాదారు
లవేననియు అభిప్రాయపడ్డారు. కార్మిక కర్షకుల మధ్య ఐకమత్యం
తీసుకొని రావలయునని, యితర కార్మిక నాయకులెవ్వరును కాబె
ల్లెరో మోస్తరుగా శ్రద్ధతో పాటుబడియుండలేదు. మొట్ట
మొదట సోషలిస్టులను, కమ్యూనిస్టులను, యువజన సంఘాల్లోకి
ప్రవేశపెట్టి, తద్వారా, యువకులలోను కార్మికులలోను ప్రచారం
చేయించాడు. తరుపరి, సోషలిస్టులకును, అనార్కిస్టులకును,
భేదాభిప్రాయాలుండడంచేత వాటినన్నిటిని చాలావరకు సర్దుబాటు
చేసి, రెండుశాఖలను కలుపడానికి తీవ్రకృషిచేసి, యీ ప్రయ
త్నంలో జయంపొందాడు. రాజకీయ ప్రచారకుల్లోను, ప్రజా
సామాన్యంలోను, యితడంటే, అఖండమైన, గౌరవప్రేమలు
యిప్పటికిని ఉన్నవి. దీనికి నిదర్శనంగా, యీమధ్యనే, అనా
ర్కిస్టు ఉద్యమానికి కేంద్రస్థానమయిన సారగోసా పట్టణానికి

యితడు వెళ్లి, 30000 మంది ప్రజల్లో అనార్కిస్టులను గురించి చెల్లుమాట మాట్లాడకుండా, వారికి కోపంకలుగ చేయకుండా గంభీరంగా ఉపన్యసించాడు. కొన్ని అనుమానాలు మాత్రం ఉండడంచేత, వాటిని గహితం చేసుకొనుటకు అనార్కిస్టులు ప్రశ్నలువేయగా, వాటికి సమాధానం సహేతుకంగాను, తెలివి తేటలతోను చెప్పాడు. స్పెయినులో యెన్నటి కయినా సంపూర్ణ మయిన సాంఘికవిప్లవం జయప్రదంగా సాగాలనంటేగాని ప్రజా సామాన్యంయొక్కయు, ముఖ్యంగా కష్టజీవులయొక్కయు. కోరి కలు పూర్తిగా ఫలించాలనంటే గాని, కాబల్లెరోవంటి మహా వ్యక్తి తప్పయింకొకడు ప్రస్తుతకాలంలో స్పెయినులో ఉద్యమం నడుపుటకు సమర్థుడుకాడు.

కాబల్లెరోను, "స్పెయిను దేశపు లెనిన్" అని ప్రజలు వాడుకగా పలుస్తారు. లెనిన్ ఉపన్యాసాలు, వ్యాసాలవలెనే, కాబల్లెరోవికూడా నగిషీ చెక్కినట్లుగాను, కేవలం భావప్రేరి తముగను, ఉద్రేక పూరితమయినవి గాక, ఒకసిద్ధాంతం మీద ఆధార పడి, ఉన్నవాటిని ఉన్నట్లుగా పరిశీలనచేసి, తన నిజాభిప్రాయ మును ఖండితంగా వ్యక్తీకరించే వాడు. ఈ ఇద్దరు గొప్పవ్యక్తులను చూచినవారు, ఇద్దరుకూడా ఒకేరూపులో ఉంటారని చెప్పుదురు. కాబల్లెరో ముఖలక్షణాలు, ముఖంతీరు, గొప్పమేధస్సు, రాజ కీయ నిపుణతగల వ్యక్తిముఖంలాగా ఉంటుందని చెపుతారు. అతని మిత్రులు అతనితో అప్పుడప్పుడు కొన్నివిషయాల్లో వ్యతిరే కాభిప్రాయాలతో వాదించినా, అతనిచాటున వారిదే తప్పని ఒప్పు కుంటారు.



# స్పెయిన్ దుస్థితి.

——(౦)——

## ప్రజాసమ్మిళిత సంఘట్టనా పరిపాలన

ఒకానొకప్పుడు కారల్ మార్క్సు మహాశయుడు యీ విధంగా చెప్పాడు. ఫ్రెంచివిప్లవం మూడుగంటలలో పూర్తి అయింది. కాని స్పెయిన్ పరిస్థితులను విచారించిచూస్తే, మూడు సంవత్సరాల్లో యెన్నటికీ విప్లవం జయప్రదంగా సాగదనియు, తొమ్మిది, పదిసంవత్సరా లయినను ఆలే అంతదీర్ఘకాలం కాదనియూ చెప్పాడు. ప్రస్తుతపు స్పెయిను విప్లవం అయిదుసంవత్సరాల క్రిందట బయలుదేరింది. కాని యింతదీర్ఘకాలమైనను, పాతబడ్డట్టుగాని, నశింపు సూచనలుగాని యేంతమాత్రం యింతవరకు కనుపించుటలేదు. ప్రస్తుతపు స్పెయిన్ అంతర్యుద్ధం, ఆకస్మాత్తుగా, ఎవ్వరు అనుకోకుండా బయలుదేరిందికాదు. అయిదేండ్లనుంచి కూడా, స్పెయిన్ పరిస్థితులు తారుమారై, సంక్షోభంలో మునిగి, సమ్మెలు, కాల్పులు, స్థానికంగా తిరుగుబాట్లు దినదినానా జరుగుచుండేవి. కార్మికకర్షకులు ఫాసిస్టులక్రింద భయంకరమైన నిరంకుశ విధానంవల్లా, వర్ణింపనలవికాని బాధలవల్లా, ఉద్రేకంకలిగి, సమ్మెలరూపంగాను, తిరుగుబాట్లు ద్వారాను, ఉద్రేకాన్ని శాంతింపచేసుకుని, పాప్యులర్ ఫ్రాంటుగవర్నమెంటుక్రింద వారి వారి ఆర్థికరాజకీయ స్వాతంత్ర్యాన్ని చాలావరకు సంపాదించుకోగలిగారు. వారిలో చాలావరకు శాంతికలిగింది. ప్రజాసామాన్యం గూడా నూతనరాజకీయ వ్యవహారాల్లో, పూర్ణంగా నిమగ్నులయిపోయి, సాంఘిక, ఆర్థిక, రాజకీయ హక్కులను యిచ్చుటకు ప్రభుత్వంచేత వాగ్దానం చేయించుకున్నారు. ఫిబ్రవరిలో యెన్ని

కలు పూర్తి అయినతర్వాత తీవ్రవాదులయిన రిపబ్లికనులలోనుంచి ఎన్నుకోబడ్డ మంత్రులు, సైన్యానికి, పోలీసుశాఖలకు అధిపతులుగా చేయబడ్డారు ప్రభుత్వంచేత. ఈ చర్యవల్ల యింతకుపూర్వం నిరంకుశంగా పోలీసువారివల్ల కలిగే తీవ్రమయినభయం చాలా మట్టుకు అంతరించింది. ఎన్నికలు అయిన ఉత్తరక్షణమే, రాజ్యాంగ విషయాలను, కార్మిక ప్రతినిధులు తమ అధీనంచేసుకొని, రాజకీయ నిర్బంధితులను మొట్టమొదట విడుదలచేశి, దేశంలో చాలామట్టుకు శాంతిని నెలకొల్పారు. ఈ చర్యను వెంటనే శాసనరూపంగా అమలులో పెట్టారు. ఈ విధంగా కార్మికకర్షకుల కుపకరించే స్వాతంత్ర్యచట్టాలను అనేకం ప్యాసు చేశారు. అందులో ముఖ్యమయినవి, మతగురువుల అధీనంలో ఉన్న భూములు, యితర ఆస్తులను జప్తుచేసి, భూములులేని బీదరయితులకు పంచియిచ్చుట. రిపబ్లికనులు తమపై కసి తీర్చుకొందురేమోనని, ఫాసిస్టులు, వారి అనుచరులు, వెంటనే దేశంనుంచి పారిపోయారు. పారిపోకుండా అచ్చటనేయున్న చాలామంది ఫాసిస్టులను, విచారణచేసి, దీర్ఘమైన కఠినశిక్షలు విధించారు. కార్మికులను అనేకవిధాల హింసించి కాల్చిన ఫాసిస్టులను, ప్రభుత్వం తగురీతిన దండించింది. కాని అక్కడక్కడ సైనికులు, సివిల్ రక్షకులు, ఫాసిస్టులు, అమాయకులైనట్టియు, నిరాయుధులయినట్టియు కార్మికకర్షకులను చంపుటకు చేశిన ప్రయత్నాలకు వారి యెడల తీసుకున్నచర్యలు, తీవ్రంగాను, శక్తివంతంగాను లేనందువల్ల, అసంతృప్తి, అసమ్మతి కలిగింది ప్రజల్లో.

ఒకవంక ప్రభుత్వంయెడల ప్రజలలో అయిష్టత ప్రబలుతుందేమోనని భయపడి, స్వంత ఆస్తులు, స్వంత లాభాల విషయంలో ప్రభుత్వం యెంత మాత్రం నోక్యం కలిగించుకోకుండా ఉంటుంటే, యింకొకవంక అసలేదుర్భరమైన ఆకలి

బాధచే కృంగి కృశించిపోవుచున్న ప్రజాసామాన్యాన్ని, నియటికి సంవత్సరం పంటలు పండక, కరువు బయలుదేరి పీడింపడం మొదలు పెట్టింది. కాబట్టి వారికి నూతనరాజ్యాంగ ప్రణాళిక యిచ్చిన స్వాతంత్ర్యశక్తిని వినియోగించి, స్వంతలాభాలను, స్వంత ఆస్తులను తుదముట్టించి, వారి సౌకర్యాలను ముందు వృద్ధిచేసుకోక తప్పింది కాదు. అందుకోసం సమ్మెలు ముఖ్యంగా అవసరం. పాప్యులర్ ప్రాంటు ప్రభుత్వానికి సహాయంగా ఉన్న సోషలిస్టులు, సమ్మెలు తీవ్ర రూపందాల్చి, దేశాన్ని సంక్షోభం కలుగచేస్తాయని భీతిల్లారు. తుదకు ప్రభుత్వంకూడా సమ్మెలవల్ల తారుమారై, రాజ్యమును నడుపలేని స్థితికి వస్తుందనికూడా భయపడ్డారు. ఈ భయంవల్ల ప్రేరేపింపబడి, సోషలిస్టులు మరీ మరీ మార్పులకు అంతగా అంగీకరించని ఒక తీవ్రమైన మహాశక్తిగా తయారయినారు. (Conservative force) అసలు సమ్మెలే బయలుదేర నియ్యకుండా చేయటానికి ప్రయత్నించారు. అథవా, సమ్మెలు సాగినయెడల, వాటిని త్వరలో ముగించటానికై త్వర పడేవారు.

దీనికి నిదర్శనంగా, బార్సిలోనాల్లో, హోటళ్ళలోని నౌకర్లు సమ్మెచేసినప్పుడు, వారు తమ హక్కులను గెల్చుకొనకముందే, సోషలిస్టులు వారిని తొందరపెట్టి సమ్మెను ఆపుచేయించారు. సమ్మెలవల్ల ప్రజలకు తినుటకు తిండి, యితర సౌకర్యాలకు ఆటంకం కలుగుతుందని, పట్టణంయొక్క శాంతి వాతావరణానికి భంగపాటు గలుగుతుందనీ, యిందుమూలంగా ప్రభుత్వాన్ని కష్టాల్లో పెట్టవలసి వస్తుందనీ, సోషలిస్టులు భయపడ్డారు. అనేకమంది వ్యాపారస్థులు, మధ్యతరగతివారు, తమ స్వంత ఆస్తులు పోతవనే భయంచేత, విసువుపుట్టి, అప్పుడే ఫాసిస్టు సిద్ధాంతాలయెడల తమ సమ్మతి వెలిబుచ్చి, ఫాసిస్టుపార్టీపక్షం చేరడం మొదలుపెట్టారు.

తమన్యాయమైన హక్కులను సంపాయించుకోటానికి అంతరాయం కలిగించటంవల్ల కార్మిక కర్షకులకు ప్రభుత్వంవల్ల ఆశాభంగం కలిగింది. కార్మిక కర్షకుల్లో అశాంతి, అలజడి ప్రబలుటవల్ల గవర్నమెంటు యేమీ ఆలోచించటానికి వీలులేక సందిగ్ధావస్థలో పడిపోయింది. అశాంతి క్రమక్రమగా పెరిగి విప్లవరూపంగా బయలుదేరునేమో నని, యీ సమస్య విషయమై, ప్రభుత్వాధికారులు బహువిధాల తహతహపడ్డారు. కార్మిక కర్షకుల్లో పరిస్థితులు యీ విధంగా ఉండగా, ఇంకో ఉపద్రవం బయలుదేరింది.

స్పెయిను దేశానికి బయటదేశాలతో యుద్ధాలుచేయుటకు అవకాశం లేకపోవుటవల్ల, వారి దృష్టి అంతాకూడా దేశీయ సమస్యలమీదనే మళ్లించారు. జమీందార్ల యొక్క, భూస్వాముల యొక్క కుమాళ్లకు, బంధువులకు, గొప్పగొప్ప ఉద్యోగాల నిప్పించి, ప్రజా ప్రభుత్వాన్ని సాగనీయకుండా చేయవలయు ననియే ఫాసిస్టులు, సైన్యాధికార్లు తమ ఆశయంగా పెట్టుకున్నారు. స్పెయిన్ సైన్యాధికారులు, ఫ్రెంచి సైన్యాధికారులకంటె మూడురెట్లెక్కువగా ఉన్నారు. స్పెయిన్ సైన్యాధికారులు బహిరంగంగా ఫాసిస్టులమని చెప్పుకుంటారు. ఎందుకనగా, ఫాసిస్టు సిద్ధాంతాల కనుకూలముగా ఉండే విధానాలలో ముఖ్యమైనది జమీందారీ విధానమే; అదే వారి నిరంకుశత్వాన్ని, దోపిడిని (exploitation) ఆమోదించి, అన్నివిధాలా చేయూత యిస్తుంది. కాని నూటికి 95 పాళ్లు సైనికులును, కార్మికకర్షకులు, యువకులు, విద్యార్థులు, యింకాయితర తీవ్రవాద వ్యక్తులు, ప్రభుత్వానికి అండగాయుండి, అన్నివిధాలా సహాయంచేసి, ఫాసిస్టు ప్రచారాన్ని, జమీందారీ విధానాన్ని, మతాధికారాన్ని నాశనం చెయ్యాలని పట్టుదలగా యున్నారు. వారి సర్వస్వంకూడా దారపోయుచున్నారు. ప్రజలలో కొంతమందికి రిపబ్లిక్ ప్రభుత్వం

యెడల నమ్మకం తగ్గిందేమోనని సందేహించి, ప్రభుత్వరక్షణార్థం 5 సంవత్సరాలలోపల పోలీసుశాఖను 32000 నుంచి 64000 వరకు చేశారు. తీవ్రవాదులయిన రిపబ్లికను మంత్రులను, గవర్నరులను, పోలీసుశాఖకు అధిపతులుగా నియమించినందున, పోలీసుశాఖ యావత్తు ప్రభుత్వానికి వ్యతిరేకంగా నడువదనిన్ని, ప్రభుత్వానికి పూర్తిగా నమ్మకంగా వుంటుండదనిన్ని, కాకపోయినా, వారిని యేదో విధంగా ఉపయోగించుకొనవచ్చుననిన్ని, సోషలిస్టులు విశ్వసించారు. వారిశక్తిలోనే వారునమ్మకొని, యువకులైన కార్మికులంతా, ఫాసిస్టు, వ్యతిరేక సైన్యంగా ఏర్పాటు గావించుకున్నారు. ఈ సైన్యాన్ని, వీరశిక్షణ చూచి వారిశత్రువులుకూడా హడలుకున్నారు.

స్పెయిన్ గవర్నమెంటు సైన్యం యావత్తు నాలుగు భాగాలుగా విడిపోయింది. ఫాసిష్టులు, గవర్నమెంటు విధానం వల్ల ఆశాభంగం చెందారు. వీరంతా ప్రత్యేక ప్రతీఘాత సైనిక వర్గంగా తయారయ్యారు. కార్మికులు ప్రత్యేకంగా ఒక గొప్ప సైన్యాన్ని తయారుచేసుకున్నారు. సోషలిస్టులలో తీవ్రవాదులును, అనార్కిస్టులు, విప్లవంవల్లనే అధికారానికి రావలెనని నిశ్చయించుకొని అందులకు తయారయినారు. పోలీసుశాఖలోను, సైన్యంలోను, చాలామంది మీద ప్రభుత్వమునకు నమ్మకం తక్కువ అవడం వల్లను, ఫాసిష్టు వ్యతిరేకదళం దీర్ఘకాలం పాటు యుద్ధాన్ని సాగించినయెడల అపాయం సంభవిస్తుందేమోనని దానికి సిద్ధపడలేదు. ఫాసిజమును ఎరుగొనవలనంటే, పాక్ పోలీసు వారి మీద ఆధారపడి యుండక తప్పదు. ఎందువలన ననగా ఇటీవల పాక్ పోలీస్ ఉద్యోగస్తులను అనేకమందిని 'సోస్ కాల్వో సోటిలో' అను రాజవంశీయుడైన ఫాసిస్టు చంపించాడని అతనిని అంతర్యుద్ధానికి పూర్వమే చంపారు. అందువల్ల పాక్ పోలీసు

వారికని, సోటిలో పక్షియులను పచ్చిగడ్డివేస్తే భగ్గున మండు తుంది. ఇప్పటి అంతర్యుద్ధానికి సోటిలా హత్యే యెక్కువ ప్రాము ఖ్యత వహించినది కాకపోయినను, యుద్ధం యింతత్వరలో మునెంచుకొని రావటానికి గల కారణాలలో ఒకటయింది. అంతర్యుద్ధం క్రిందటి సంవత్సరం 18 జులై తారీఖున ఆగంభ మయింది. అనేక మంది రిపబ్లిక్ నాయకుల హత్యలతోను, కమ్యూనిస్టులు, అనార్కిస్టుల చిత్ర వధలతోను, భీభత్సంగా చెలరేగింది తిరుగుబాటు. యుద్ధం యేప్రకారంగా కారుచిచ్చు లాగా ఒకప్రదేశంనుంచి, యింకొక ప్రదేశమునకు వ్యాపించిందో, యెంత జన నష్టంకలిగిందో, యెటువంటి భవనాలు, యెటువంటి విచిత్రవస్తుశాలలు నాశనం కాబడినవో, కార్మికులు, కర్షకులు, ఆకలి బాధతోపరితపించుచు, ఒక పూటవుండి, ఒక పూటలేక మాలిన్యమైన పూరి గుడిసెలలో, దుర్భర బాధల ననుభవించు చున్నను, స్వాతంత్రతృష్ణచేతను, ఫాసిజం యెడల తమకుగల క్రోధానలం బలమయి హృదయాల్లో విప్లవాగ్ని రగుల్కొను మండుటచేతను, ఏవిధంగా ఫాసిజాన్ని పరాక్రమించి ఎదుర్కొ న్నదియు, ముందు తెలుసుకుందాం.

## 1936 లో జరిగిన విషయాలు

యూరప్‌లోని యే దేశంలోకూడా స్పెయిన్‌లో జరిగిన విపరీత రాజకీయ మార్పులు జరిగియుండలేదు. తక్కినచోట్లకును, స్పెయినుకును హస్తిమశికాంతరం భేదమున్నది. అసలు వాటి స్వరూపమే వేరు. ప్రస్తుతం స్పెయిన్‌లో జరుగుచున్న భీషణ సంగ్రామానికి పూర్వం అచ్చటిరాజకీయ వాతావరణం యేవిధంగా వున్నదో, పాఠకసోదరులకు తెలియజేయడానికి అచ్చట మే నెలలో జరిగినకొన్ని ముఖ్యవిషయాలను ఉదహరిస్తాను. స్వతహాగా

స్పెయిను పరిస్థితులను తిలకించిన ప్రతివ్యక్తికీగూడా అచ్చటి బాహ్యజీవితం యేవిధంగా కార్మికుల క్రోధాగ్నిని వ్యక్తపరుస్తుందో స్పష్టంగా అర్థమవుతుంది. కార్మికులకు వీధులే యుద్ధరంగాలు. వీధులలో యుద్ధాలు చేయలేకపోయిన యెడల, రాజ్యాంగాన్ని వశపరచుకోడానికి, తిరువాత నడపడానికి సమర్థులు కారు. కార్మికవిప్లవచిహ్నాలు యిప్పటికీ యెక్కడబడితే అక్కడ, యిండ్లమీద, గోడలమీద, చర్చీలమీద, రైల్వేబండ్లమీద కనుపిస్తాయి. కార్మికుడు యితరులను మొదటిపర్యాయం కలుసుకొన్నప్పుడు మోచేతిని ముంగుకుచాచి పైకెత్తి, పిడికటినిగట్టిగా నిలిపిపెట్టుట గౌరవార్థమైన వాడుకగా ఉంటుంది. ఈ ఆచారం ప్రపంచమంతటాకూడా కార్మికులలోను కమ్యూనిస్టు, సోషలిస్టులలోను ఉన్నది. స్పెయినులో యెప్పుడు అంతర్యుద్ధాలు సంభవించినా, అవి నిర్దయాత్మకమై, క్రోధావేశములతో, స్పష్టమైన రాజకీయ సిద్ధాంతాలమీద ఆధారపడి పోరాడబడుచుండేవి. ఒకవైపు సమ్మెరయె, ఆయుధంగాగల కార్మికులును, మరొకపక్షం భూస్వాములు, ధనాఢ్యులు, మతగురువులు, సైన్యాధికారులు, పోలీసు ఉద్యోగస్థులు; వీరి ఆయుధం తుపాకిగుండు. బార్సిలోనాలో, అనేక హోటళ్లలోని సేవకులును, కర్మాగారాలలోను, పరిశ్రమల్లోను, పనిచేయు కార్మికులు అనేకవేలమంది సమ్మె చేసినప్పుడు, అక్రమంగా, తుంటర్లమారిగా ప్రవర్తించారని చాలామందిని అరెస్టుచేశారు ప్రభుత్వాధికారులు. నిజంగా సమ్మెదారులయొక్క పట్టుదలవల్ల, కార్యదీక్షవల్ల, ఓర్పువల్ల, పట్నంలో ఒక్క నిమిషం పాటుగూడా ఒక్కపని సాగకుండా చేయగలిగారు.

సమ్మెదారులయొక్క ముఖ్యమైన కోరికలు యివి:—వారి జీతాలను 9 పౌనుల 10 షిల్లింగులనుంచి 11 పౌనుల 7 షిల్లింగుల 6 పెన్నీలవరకును యెక్కువచేయమనిన్ని, వారి ఆత్మగౌరవానికి,

స్వేచ్ఛను, నైతికానికిని భంగంగలుగ జేయుచున్న కొన్ని దురా-
చారాలను వెంటనే తీసివేయ్యాలనియు కోరారు. తక్కువకోరి-
కల్లోకల్లా ముఖ్యమయినది రోజుకు 8 గంటలకాలమే పనిచేయించ-
వలసినదనియు, అనారోగ్యముగ నున్నప్పుడు మూడుమాసాల
వరకును పనిచేయకపోయినా జీతాలు యియ్యవలసినదనియును;
కోటలోనియూ ప్రభుత్వమును, అచ్చటి కార్మిక విషయాల్లో సలహా-
దారుడుగానున్న అధికారియు సమ్మెలోనైక్యము పుచ్చుకొనుట
వల్ల, సమ్మె ఆగిపోవలసి వచ్చింది. కార్మికులయొక్క హక్కులు
చాలామట్టుకు గవర్నమెంటు ఆమోదించింది. వెంటనే కార్మికులు
సభలుచేసుకొని నాయకులు చేసుకున్న సంధిషరతులకు తమపూర్తి
ఆమోదమును చూపించిరి. కాని మార్క్సిస్టులును, అనార్కిస్టు-
లును, దానికి యెంతమాత్రం ఒప్పుకొనలేరు. చాలాగల్లంతు,
ఉద్రేకం వారిలో బయలుదేరింది. కారణం తీవ్రవాదుల్లో యింకను
భేదాభిప్రాయాలు, వైరాలు చావకపోబట్టియె. నేను యింతకు
పూర్వమే, దేశంలో సమ్మెలుజరగడం, సోషలిస్టులకు యిష్టంలేద-
నిన్నీ, దీనివల్ల, స్పెయిన్ ప్రభుత్వానికి చిక్కులు సంభవిస్తవనిన్నీ
చెప్పియున్నాను. సోషలిస్టులను, కమ్యూనిస్టులను మితవాదులతో
రాజకీయంగా సఖ్యత నడినందులకు నిరశిస్తూ, అనార్కిస్టులు వారిని
తడవతడవకు నిందించడం మొదలుపెట్టారు. ఈసఖ్యతవల్ల కార్మి-
కుల గస్థితి, నిరాదరణ, వారియెడల అన్యాయాలు, అకృత్యాలు,
యెక్కువకావడమేకాని, ఉపశమించదని వారి అభిప్రాయం.
అందుకొరకు, యితరనాయకుల ప్రమేయం ఎంతమాత్రంలేకుండా,
ప్రభుత్వం ఆమోదించినా, ఆమోదించకపోయినా, చట్టసమ్మతం
గాదని లోకులు నిందించినాసరే, వారిప్రత్యేకనాయకత్వంక్రింద
సమ్మెలను నడిపించుటకు నిశ్చయించుకున్నారు. వారు నాయకత్వం
సహించి, నడిపించినకొలది, సమ్మెల్లోకూడా, వారు బలవంతపెట్టి-

సమ్మెచేయించటమే కాకుండా, సమ్మెరోజుల్లో అడ్డంవచ్చిన వారినికూడా భయపెట్టసాగారు. ఇట్లాంటి అవినీతి కరమైన, కౌర్జన్యకరమైనట్టి పనులలోనికి దిగడంవల్ల, అనార్కిస్టులప్రతిభ చాలావరకు తగ్గుతూవచ్చింది.

ప్రతి రోజు స్పెయినులో వందలకొలది స్థానిక సమ్మెలు జరుగుతుండేవి. ఈ సమ్మెలను గురించిన వార్తలను ఒకచోట నుంచి యింకొక చోటికి తెలియకుండా ప్రభుత్వం నిషేధించింది. స్థానిక ప్రదేశాల్లోమట్టుకు తెలిసేటందుకు పత్రికల్లో ప్రచురింపబడటానికి గవర్నమెంటు అంగీకరించింది. దేశంలో దారిద్ర్యానికి తోడుగా, ప్రపంచార్థికోత్పాతంవల్ల కలిగిన ఆర్థిక మాంద్యం, పూర్వపు ఫాసిస్టు ప్రభుత్వాల అమానుషమైన నిరంకుశాధికారం, వీటి అన్నిటివల్ల, కార్మిక కర్షకుల వేతనాలు చాలా వరకు తగ్గిపోయి, తిండికి గూడా ఒక పూట వుంటే రెండవ పూట లేక నానా అవస్థపాలయినారు. తమకు ప్రస్తుతం అనుకూలంగా ఉన్న రాజకీయ పరిస్థితులను ఉపయోగించుకొని, తమ జీతములను కావలశినంతవరకు యెక్కువ చేసుకొనుటకు నిశ్చయించుకున్నారు. తమ యజమానులు యెక్కువ జీతాలను యివ్వగలరని కూడా వారికి తెలియకపోలేదు. సమ్మెసాగే రోజుల్లో ప్రతీఘాతులు సహించలేక, గురహంకారులయి, సమ్మెదార్లను తుపాకులతో కాల్చిగాని, గొడ్డళ్లతో నరకగాని చంపేవాళ్లు. అనేక పర్యాయాలు వీధుల్లో ఒక వంక సమ్మెదార్లకును, రెండవ ప్రక్క ఫాసిస్టులు, సైన్యాధికారులకును సంఘర్షణలు జరగటంతటస్థించి, వాటిలో నిరాయుధులయిన కార్మికులను అనేక మందిని ఫాసిస్టులు చిత్రవధ గావించారు.

ఈ పరిస్థితుల్లో, కార్మిక కర్షకుల యోగక్షేమాదులు తమ హృదయాల్లో నాటుకొనిపోయిన వారంతాకూడా, క్రూరమయిన

యీ ఫాసిస్టు-పోలీసు చర్యలను గర్హించకపోరు. తీవ్రంగా కవింపబడ్డాకూడా, కార్మికులు చూపుచున్న సహనము, పట్టుదల, శిక్షణ, త్యాగమును కొనియాడకపోరు. ఎక్కడ చూచినాకూడా ఫాసిస్టుల కవింపులే. కవించిన తర్వాత పోట్లాట పెట్టుకొని, తమ చేతుల్లోయున్న సైనికబలంచేత వారిని చావమోదేవాండ్లు. తీవ్రవాదులయిన సోషలిస్టులు, అనార్కిస్టులు, ఆయుధసహితమైన విప్లవాన్ని లేవదీస్తేనేగాని కార్మికులకు జయం కలుగదని భావించారు. సైన్యంలోను, పోలీసు శాఖలోను ఉన్న ఫాసిస్టులు, కార్మిక నాయకులను, కార్మికసోదరులను యెంత కవించి పోరాటానికి ప్రేరేపించినను, వారు తొందరపడక, సహనంవహించి, తెలివితేటలతో, సరియైన అవకాశంకొరకు నిరీక్షిస్తూఉన్నారు. ఫాసిస్టుల కుతంత్రాలు పై జెప్పినవిధంగా సాగుచూవచ్చాయి. స్పెయినులో నిరుటిసంవత్సరం పంటలు సరిగా పండలేదనీ, ఆర్థికమాంద్యం సంభవించినదనినీ యిదివరకే తెలుసుకున్నాము. పంటలు మహా నష్టాలు అయినదాకా పోరాటాన్ని ఆపితే, కరవువల్ల, అప్పుడు కార్మికుల్లో అసంతృప్తి యెక్కువయి, లక్షలకొలంది కార్మికులు యేకమయి, ఫాసిస్టులను హతమారుస్తారని భయపడ్డారు. అంతకు పూర్వమే యుద్ధంలోకి దింపినట్లయితే, మతాధికారులచేత, పార్లమెంటుచేత ఆశలుకల్పించి, తమ కార్యాన్ని సులభంగా నెరవేర్చుకొనవచ్చునని యుక్తిపన్నారు. ఈ యుక్తికి పై యుక్తిముందే కనుక్కొని, పైకి ఉద్రేకాన్ని కనిపించనీయకుండా, అణచుకున్నారు ప్రజాతంత్రవాదులు, కార్మికనాయకులు, కమ్యూనిస్టులు మొదలయిన వారందరుకూడా.

ప్రతిఘాతుల కుతంత్రాలను, ఫాసిస్టు దౌర్జన్యాలయెడల తమకున్న ద్వేషాన్ని, సాధించుటకు, అభివృద్ధిని ఆశించు వివిధ రాజకీయ సంఘములు, వారిలో వారు ఐక్యతపొంది, సమ్మిళిత

సంఘట్టనలోచేరి నియటిసంవత్సరం ఫిబ్రవరి నెలలో అఖండమైన విజయాన్ని సంపాయించారు. రిపబ్లికనులలో తీవ్రవాదులయిన వారు 'కాసరస్ క్విరోగా' అను నతని ఆధిపత్యంక్రింద ప్రభుత్వ మును ఏర్పరిచారు. సోషలిస్టులు, కమ్యూనిస్టులు మొట్టమొదట ప్రభుత్వంలో అధికారపదవులను స్వీకరించుటకు అంగీకరించక, బయటనుంచియే ఫాసిస్టులను అణచుటయందు ప్రభుత్వమునకు పూర్తిగా సహకారంచేస్తామని నిశ్చయించుకొన్నను, తర్వాత విషమపరిస్థితులు వారినికూడా ప్రభుత్వాధికారంలో పాల్గొన వలశినదని కోరినంగున, విధిలేక ఒప్పుకొనవలశివచ్చింది.

## ఉత్పత్తిసాధనాలు

నూతనంగా ఏర్పడ్డ ప్రజాస్వామ్యం ఆర్థికంగా దేశంలో యేయే మార్పులను తెచ్చింది? ఏ విధంగా ఉత్పత్తి విభజన సాధనాలను ఉపయోగంలో పెట్టింది? ఈ ప్రశ్నలకు సమా ధానం తెలుసుకోడం చాలాముఖ్యం. మనం యిదివరకే స్పెయిన్ బ్యాంకు, అధికవడ్డీలమీద వ్యాపారం సాగిస్తూ, విపరీతమైన లాభాలు పొందుతూ, దేశంయొక్క ఆర్థికాభివృద్ధిని యెంతగా నిరోధించిందో తెలుసుకొన్నాము. ఫ్రెంచి ప్రభుత్వంమాదిరిగా స్పెయిన్ బ్యాంకును, ప్రభుత్వాధికారం క్రిందికి తీసుకొనిరావలె నని సంకల్పించలేదు. కాబ్రేడ్ కాబల్లెరో, లక్షలు, కోట్ల కొలది ధనం బ్యాంకుల్లోను యినుపపెట్టెల్లోను మూలుగుతుండడం అనవసరమని ఆలోచించి, ఆ ధనాన్ని వెంటనే గవర్నమెంటు వశంచేసుకొని, ప్రజాక్షేమకరమగు కార్యములయందు వినియోగిం చుటకై పట్టుపట్టాడు. కాని అతని సలహాలను పెడచెవిని పెట్టి, ప్రభుత్వం తన పట్టునే సాగించుకొన్నది. కార్మిక కర్షకులనుంచి ఒత్తిడివస్తేనేతప్ప, లేనియెడల స్పెయిన్ రిపబ్లిక్ ప్రభుత్వం

ప్రైవేటు ఆస్తులను, లాభాలనుగురించి న్యాయమైన చర్య తీసు కోదనిన్ని, అంతవరకు ప్రైవేటు లాభాలను ప్రభుత్వం రక్షించు ననిన్ని, యిదివరకే వ్రాశియున్నాను. దానిని గురించి మరల యిచ్చట విపులీకరించి వ్రాయుట అనవసరము, చరిత్ర నిర్మాణము కూడాను. దేశంయొక్క ఆదాయం, యింకను, స్వాభిలాషు లైన పెట్టుబడిదార్ల అధనంలోనే యున్నది. ఈ ధనాధికారుల యొక్క అధికారాన్ని తుదముట్టించకపోతే, వీరు తప్పక దేశ ద్రవ్యాన్ని వారి అధికారాన్ని ఉపయోగించుకొని, పూర్వపు రాచ రిక కాలంనాటి పరిస్థితులనే అమలులోనికి తీసుకొనివచ్చుటకు ప్రయత్నిస్తారు.

ఫ్యాక్టరీ యజమానులు చేసిన దుండగములను ఎదుర్కొను టలో కార్మికులు చాలా జయప్రదంగా ప్రచారాన్ని సాగించారు. వేతనములను యెక్కువచేయుటకును, సౌకర్యాలు అధికంగా సంపాయించుకొనుటకును, కార్మికులు చేసిన పోరాటములు, పరిశ్రమాధికారులనుభంగదీసి, వారి హక్కులను కోరిన ప్రకారం యిప్పించుకొనగల్గారు. అందుచేత వారి లాభాలకు అడ్డుకలిగింది. రాజకీయ కారణాలకై అరెస్టుచేయబడిన కార్మికులను కడచిన సంవత్సరం ఫిబ్రవరి నెలలో విడిచిపెట్టుటకును, వారిని వెంటనే ఫ్యాక్టరీలలో చేరిపించుటకును, రాజశాసనము అమలులో పెట్టుట వల్ల, పరిశ్రమాధికారులు ప్రభుత్వం యెడల తమ తీవ్రమయిన అసమ్మతి వెలిబుచ్చారు. అంతేకాక, మరల పనిలో ప్రవేశించిన వారిని యేకారణములచేత తీసివేయ కూడదనికూడా శాసించుటచేత, వారిలో మరింత నిరసనభావం యెక్కువయింది. అంతకు పూర్వం కొద్దిమంది మాత్రమే పనిచేయుచున్న ఫ్యాక్టరీలు, యీ నూతన చట్టంవల్ల ఫాక్టరీలన్నీ కార్మికులతో నిండిపోయ్యాయి. నూతన ప్రభుత్వం విప్లవ సిద్ధాంతాలమీద ఆధారపడి యుండుటవల్లను

అట్లాంటి విప్లవ సిద్ధాంతాలలో న్యాయం తప్పక మూర్తీభవించియుండుటచేతను, నూతన, ప్రభుత్వం, ఇంతకు పూర్వం, ప్రతీఘాతులుగానుండి కార్మికులను నానా అగచాట్లు పెట్టిన ఫ్యాక్టరీ యజమానులకు న్యాయంగానే తగిన రీతిగా శాస్తిచేసింది. ప్రభుత్వం, వారికి ప్రక్కలో బల్లెమయి కూర్చుంది.

అనేకమంది సోషలిస్టులు, సమ్మెలు జయప్రదంగా సాగడంవల్ల, ఫ్యాక్టరీ మేనేజిమెంటును తమచేతుల్లోకి తీసుకోడానికి యిది సరియైన అదనని నిశ్చయించుకున్నారు. పోయిన పోతుగునా, వారికి సమ్మెలు సాగించినంత మాత్రమున నే ప్రయోజనం కలుగదనియు, వాటివల్ల శాశ్వతంగా స్పెయిన్ కార్మికులకు ఉపయోగం కలుగదనియు, ఫ్యాక్టరీలను తమ అధీనం చేసుకుంటేనేగాని, వాంఛలో కొంతవరకయినా యీడేరదనియు, అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. అనేకచోట్లలో, [illegible]గా హోటళ్ళలోను, యితర పరిశ్రమ శాఖల్లోను, కార్మికులు తిరుగుబాటుచేసి ఆయా సంస్థలను తమ వశంచేసుకొని పోలీసు ఆటంకమేమీ లేకయే జయప్రదముగా నడుపసాగారు. యజమానులు ప్రతిఘటించుటకు సమర్థత చాలక విడిచిపెట్టి వెళ్ళిపోయారు.

ఫ్యాక్టరీలను వశంచేసుకొనడం కార్మికులయొక్క బలాన్ని సూచిస్తుందనీ, అందువల్ల యజమానులకు నష్టంకలుగుతుందనీ, అది క్రమంగా, తక్కిన సంస్థల్లోకికూడా ప్రాక, ఉద్యమానికి విపరీతమయిన బలం చేకూరుతుందనీ అనార్కిస్టుల అభిప్రాయం. కాని సోషలిస్టుల అభిప్రాయంమాత్రం యిదికాదు. వ్యక్తిగతంగా ఫ్యాక్టరీలనుగాని, యితర సంస్థలనుగాని, గవర్నమెంటువారి సహకారం, సలహాలుగాని, వారివల్ల ముడిసరకులను సంపాయించుకొనుటకు అవసరమైన గ్యారంటీగాని సంపాయించందే, జయ

ప్రదంగా నడుపలేమని సోషలిస్టుల దృఢాభిప్రాయం. అట్టి సంస్థలను వశ్యంచేసుకొనుటవల్ల, నైతికంగా కార్మికులకు బలంచేకూరినా. సాంకేతికంగా (Technically) అసాధ్యం. దానివల్ల ప్రయోజనం యేమీ కలుగకపోగా విపత్తుకుగూడా కారణమవుతుంది. కాబట్టి అతివాద సోషలిస్టులలోగూడా యింకా తీవ్ర దృక్పథంకల వారు బలవత్తరమయిన తిరుగుబాటుకొరకై ఎదురుచూచుచు, దానివల్లనే రాజ్యాధికారాన్ని, దానితోపాటు, తక్కిన పరిశ్రమలను, జాతీయప్రణాళిక ననుసరించి జయప్రదముగ సాగించగల్గుమని వేచియుండిరి.

## వ్యవసాయ సంస్కరణ.

నూతన ప్రభుత్వం పరిష్కరించవలసిన ప్రధానమైన సమస్యలలో అతిముఖ్యమైనది భూముల సమస్య. స్పెయిన్, మనదేశంమాదిరిగానే వ్యవసాయ దేశమవుటచేతను, ప్రజాసామాన్యానికి వ్యవసాయమే జీవనాధారమవుటచేతను, అట్టి జీవనాధారానికి విఘాతం కలిగించి, లక్షలకొలది యకరములు జమీందారులు, మతగురువులు, తమ యాధీనంలోయుంచుకొని, వాటివల్ల మిక్కుటమగు ద్రవ్యమును సంపాయించుచు, కర్షకావళిని, ప్రజాసామాన్యాన్ని దరిద్రులను చేయుటవల్ల, ప్రథమంలో ప్రభుత్వం యీసమస్యను న్యాయముగ పరిష్కరింప తలచుకొన్నది. భూములవిషయంలో, కార్మిక కర్షకులకు నిజంగా అధికారం యెక్కువకలుగచేసింది నూతనప్రభుత్వం. ఎక్కడబడితే అక్కడ ప్రభుత్వం కర్షక కార్మికులకు అనుకూలమయ్యేటట్టుగా కళాశాలలను స్థాపించి, పంటలవిషయం, ఉత్పత్తి విషయం యింకా అనేకవ్యవసాయ సమస్యలనుగురించి బోధించటానికి ఏర్పాట్లుచేసింది. గ్రామాదులయందు ప్రత్యేకశ్రద్ధ వహించి కృషిచేశారు. ఈ కళాశాలలను ఒక సంఘం అధీనంలోఉంచారు.

ఈ సంఘంలో వ్యవసాయశాస్త్రంలో నిపుణత గలవారిని, న్యాయవాగులను, ప్రభుత్వవ్యవసాయ కి శాఖాలలోని ప్రతినిధులను, యజమానులను, రయితులను, కౌలుదార్లను నియమించారు. ప్రభుత్వం వ్యవసాయాభివృద్ధికి కావలశిన పనిముట్లను, భూమిని, యింకా యితర సౌకర్యాలను సమకూర్చింది. ఫలసాయం వచ్చేటంతవరకు కర్షకుల జీవనానికి కావలశిన ధనాన్ని ప్రభుత్వం సహాయంచేశింది. ఇంకా వ్యవసాయానికి కావలశిన యంత్రాలనుకూడా సహాయం చేస్తామని ప్రభుత్వం వాగ్దానంచేశింది. ఫలసాయాన్ని యావత్తు ప్రభుత్వం కొంటుంది. భూఖామందుకు, ఫలసాయాన్ని అమ్మిన ఆదాయంలోనుంచి కొంతిభాగం జీవనానికి కావలశినంతవరకు యిచ్చేవారు. భూమియొక్క బలాన్నిబట్టి, ఫలసాయాన్ని బట్టి, పన్ను నిర్ణయింపబడుతుంది. సమిష్టి వ్యవసాయపద్ధతివల్ల, పూర్వాచారములన్నియు అడుగంటి, నవీనమైనట్టి, శాస్త్రీయపద్ధతులను అమలులోపెట్టారు. ఈ పద్ధతులవల్ల, సహజంగా, పనిచేసే వ్యవసాయ కార్మికులకు కడుపునిండా కమ్మనితిండి, కమ్మని నిద్ర కలిగి, తక్కిన ప్రదేశాల్లోని కష్టజీవులకంటె, యెంతో ఆరోగ్యవంతులుగా కనుపిస్తారు. తక్కిన ప్రదేశాల్లో, భూములను స్వాధీనంచేసుకొని యీ కార్యక్రమాన్ని సాగించటం యింతవరకు మొదలుపెట్టలేదు.

స్పెయిన్ సోషలిస్టు సంఘనిర్మాణంలో వ్యవసాయ సంస్కరణ యెంతవరకు సహాయకారయిందో విచారిద్దాం. వీరు రయితులకు సేద్యం నిమిత్తం కొన్నిభూములను యిచ్చినంతమాత్రమున నే వారికి అధికారం పూర్తిగావచ్చినట్టు భావించరాదు. చివరకు ఒక కంచరిగాడిదో, లేకపోతే ఒక యెద్దో మేతకులేక చూడవలసి వచ్చేదే. అమెరికాపద్ధతుల ననుసరించి, మెట్టసాగును అమలులో పెట్టి, శ్రద్ధపుచ్చుకొని వ్యవసాయం చేయుచున్నను, చాలా భూమి

చవిటి సత్తుగానే యుండిపోవలసివచ్చింది. చవిటి ప్రదేశమును సాగవంతమయిన నేలగా తయారుచేసి, సక్రమమైన సాగులోనికి తెచ్చి ఫలవంతం చేయాలంటే, యంత్రములు, క్రొత్త క్రొత్త వ్యవసాయ సౌకర్యాలు అవసరంగా కావలసివచ్చాయి. ఇందువల్లనే యేకొద్ది యకరాల భూమో, తను అధీనంలోవుండి, ప్రభుత్వాన్ని, ఫ్యాక్టరీలను, యితర పరిశ్రమలను వశంచేసుకొనక పోయినచో, కార్మికకర్షకులకు శాశ్వతమైన సౌఖ్యం గాని, స్వేచ్ఛగాని వుండదు.

మితవాదులు, సోషలిస్టులు, వ్యవసాయ విధానాన్ని గురించిన ముఖ్యసిద్ధాంతాల్లో భేదాభిప్రాయాలను తెలియజేస్తుంటారు. మితవాదులు యెప్పుడూ, చిన్నచిన్న వ్యవసాయ సంస్థలలో ప్రవేశించి అన్యోన్య సహకారంవల్ల సమ్మిళితమయిన తర్వాత, చిన్న భూములనుంచియే యెక్కువగా ఫలితం అనుభవించవచ్చునంటారు. వారు బాహుళ్యమయిన వ్యవసాయపద్ధతి ఒప్పుకోరు ఒప్పుకోలేరు. ఆర్థిక హేతువులవల్లనే కాకుండా, ముఖ్యంగా రాజకీయకారణాలనుబట్టికూడా, సోషలిస్టులు సమిష్టి వ్యవసాయపద్ధతిని అభిలషిస్తారు. రిపబ్లిక్ ప్రభుత్వం చిన్నచిన్న రయితుఖామందుల అభివృద్ధిక ఊతంయిస్తుం దేమోనని భయపడ్డారు ప్రజలు. ఈ పద్ధతికి ప్రోత్సాహం కలుగజేస్తే, వారు స్పెయినులో, ఫాసిస్టు సిద్ధాంతాల మీద సంఘనిర్మాణాన్ని చేయుటకు మనసుపుట్టి, సోషలిస్టు పునర్నిర్మాణం సంగతే యెత్తుకోరనికూడా సందేహించారు. సమిష్టివ్యవసాయ కార్మికులు, అట్లుగాక, పట్టణాలలోని ఫ్యాక్టరీ కార్మికులకును, సోషలిస్టు పారిశ్రామిక కార్మికులకున్ను అండగాయుండి, అన్యోన్య సహకారులుగా వుంటారు. తాత్కాలికంగా తగాదాలు యేమీలేక సఖ్యతపడ్డారు. కొన్ని జిల్లాలలో వ్యవసాయసంస్థలు, సమిష్టి వ్యవసాయమును సాగించుచున్నారు. తక్కినచోట్ల, భూములను ప్రత్యేకంగా చిన్నచిన్న భూఖామందుల వశంచేశారు.

## ప్రభుత్వనిర్వహణం.

నేటి స్పెయినుయొక్క అధికారపంపకమును పూర్తిగా విమర్శించాలనంటే, ప్రభుత్వంయొక్క పరిపాలనా విధానాన్ని గురించి మనం కొంత నేర్చుకొనవలసియుంటుంది. చాలామంది సోషలిస్టులు ప్రభుత్వంలో ప్రవేశించారు. అదిగాక చాలా పట్టణాల్లో మ్యునిసిపల్ మేయర్లు సోషలిష్టులే. (పెద్ద పెద్ద పట్టణములయొక్క మ్యునిసిపల్ అధ్యక్షులను 'మేయర్' అని పిలుతురు.) స్థానిక ధనపరిపాలనలోను, భవనాలు, చట్టాలపరిపాలనలోను సోషలిస్టులే అధికారం సక్రమంగా నిర్వహించుటవల్ల, వారి ఉద్యమం, పలుకుబడి, పేరు ప్రతిష్టలు యెక్కువయ్యాయి, సోషలిస్టులు ప్రభుత్వంలో ప్రవేశించటంవల్ల, ప్రజాసామాన్యానికి చాలా ఉపకారాలు జరిగాయి. జర్మనీ, ఇంగ్లండులయొక్క అనుభవాలను, మనం విశ్వసించేటట్లయితే, స్పెయిన్ ప్రభుత్వంలో సోషలిస్టులకన్న, యింకో ప్రతీఘాతమయిన యేవర్గం ప్రవేశించినా ప్రజాక్షేమానికి కంటకంగా ఉండితీరుతుంది. ఇంకొక ముఖ్యమైన విషయం ప్రప్రథమంలో, ప్రభుత్వశాఖలో యింతకు పూర్వమున్న కొంతమంది అధికార దుర్వహులను తీసివేసి, ప్రజలకు పూర్తియైన విశ్వాసం కలుగజేయలేరు. కాని తరువాత ఆపనిని పూర్తి చేశారు.

---

# స్పెయిన్ దుస్థితి.

——(:౧:)——

## (రెండవ భాగం)

### ఫాసిస్టుల తిరుగుబాటు—దాని అభివృద్ధి

——(౦)——

నిరుటి సంవత్సరం జూలై 18 తారీఖున ఫాసిస్టు నాయకులును, సైన్యాధి పతులును, వేలకొలది సైన్యంతోడనూ, ఫాసిస్టు అనుచరులతోడను, అకస్మాత్తుగా వివిధ ప్రదేశాల్లో తిరుగుబాటును లేవదీసి, రిపబ్లికన్ నాయకులను, ఆయుధ సామగ్రినిరక్షించు అధికారులను హత్య గావించారు. ఇంకా ప్రభుత్వపక్షాన అధికారులను, అనేకమంది కమ్యూనిస్టులను అనార్కిస్టులను చెప్ప నలవికాని క్రూర చర్యలకు గురిచేశారు. మొట్టమొదట మాడ్రిడ్ నగరములోనున్న 'మాంటానా' సైనిక శిబిరములోని సైన్యం తిరుగుబాటుకు మూలాధారం. ఈ సైనిక శిబిరమునకు సమీపంలోయున్న పోస్టాఫీసు అధికార్లను చంపి, ద్రవ్యమును కొల్లగొట్ట నారంభించారు. ఇంతలో ప్రభుత్వ సైన్యం యీ సమాచారం తెలుసుకొని వారిపై పడ్డారు. మూడుగంటల పర్యంతము భయోత్పాతమైన యుద్ధం జరిగిన పిమ్మట ప్రభుత్వ సైనికులు ఫాసిస్టులను అణచగల్గారు. ఇటువంటి తిరుగుబాట్లు మాడ్రిడ్‌లోని రెండు విమానాశ్రయముల సమీపమున జరుగగా, ప్రభుత్వ సైన్యానికి గొప్ప నష్టము సంభవించినను, రెండింటిని తునుమాడారు. వెంటనే స్పెయిన్‌లో జరిగిన తిరుగుబాటును గురించి విపులంగా లండన్ యొక్క స్పెయిన్ రాయబారికి గూడా తెలియజేశారు. ప్రభుత్వం యిటువంటి అపాయ

స్థితిలోనున్నప్పుడు రాయబారులద్వారా నిజపరిస్థితులను తెలియ
చేయటం చాలా అవసరం కనుక, అట్టి ప్రచారం నిర్భీతమైనది.
స్పెయిన్ ప్రభుత్వ సైన్యం కొంత మొరాకోలో ఉన్నది. ఫాసిస్టు
మిలిటరీ నాయకులు స్పెయిన్ దేశానికి మొరాకోనుంచి
సైన్యాన్ని రాకుండా నావికా సైన్యానికి తెలియచేసి ఆపు
చేయించారు. మొరాకోనుంచి సైన్యం వచ్చేటట్టయితే తిరుగు
బాటుకు భంగం కలుగుతుందని ఆలోచించి యీ పనిని చేశారు.
లండనులోని రాయబారికి యీ సంగతులను, సెవిల్లీ, వాలెంషియా.
సారగోసా, నగరాల్లో తిరుగుబాట్లు జరుగుచున్నను, మొత్తం
మీద దేశములో అంతటా తిరుగుబాటుదార్లమీద ప్రభుత్వం
జయంగాంచుచునే యున్నదని ప్రభుత్వం తెలియజేసింది.
స్పెయిన్ ప్రభుత్వం బ్రిటిష్ గవర్నమెంటుకు తిరుగుబాట్లను
అణచి వేయుచున్నామని యెంతగట్టిగా చెప్పినా నమ్మకం లేనం
దువల్లను, స్పెయిన్ పరిస్థితులను గురించి అనేక చోట్లనుంచి
పరస్పర విరుద్ధములయిన వార్తలు వచ్చుచుండుటచేతను, బ్రిటిష్
ప్రజల రక్షణార్థమును, బ్రిటిష్ హక్కుల రక్షణార్థమును, కొంత
సైన్యాన్ని, కొన్ని యుద్ధ నావలను 'ప్లిమత్'అను సముద్రరేవు స్థల
మునకు సిద్ధంగా పంపారు. జిబ్రాల్టర్ (స్పెయినుకు దక్షిణం)
జలసంధివద్ద సరిహద్దులోనున్న బ్రిటిష్ సైన్యం యెక్కువచేయ
బడ్డది. ఈవిధంగా, యెవరి హక్కులు రక్షించుకోడానికి వారు
కట్టుదిట్టాలు చేసుకున్నారు. ప్రభుత్వ మంత్రులు వెంటనే విద్రో
హులకు లొంగనియెడల, ప్రభుత్వ కట్టడములను, ఆఫీసులను,
యితర ఆస్తిపాస్తులను బాంబులచేత సర్వనాశనం చేస్తామని తడవ
తడవకు తిరుగుబాటు నాయకులు భయపెట్టడం మొదలుపెట్టారు.
ఈ మహా సంక్షోభంలో, సాధారణంగా ఎట్టి వ్యాపారంగాని,
బ్యాంకి వ్యవహారాలుగాని, ప్రజా జీవితంగాని సక్రమంగా జరగ

టానికి అవకాశం లేకపోవుటవల్ల, ప్రజలకు చాలా యిబ్బందులు కలిగాయి. స్పెయినులో యావత్తు బ్యాంకులు మూసివేయబడ్డాయి. ఇచ్చి పుచ్చుకోడాలు 48 గంటలవరకు కట్టేశారు. పోలీసు సిబ్బంది, మిలిటరీ దళాలు, బ్యాంకులచుట్టు కాపలా కాస్తున్నాయి. ఫాసిస్టు విద్రోహులయొక్క ఘాతుక కృత్యాలకు తాళజాలక, చిక్కితే ప్రాణాలు తీస్తారనే భయంచేత 7000 మంది ప్రజలు స్పెయినునుంచి పారిపోవుటకు నిశ్చయించుకొని జిబ్రాల్టర్‌కు పరుగెత్తుకొని పోయారు. 'సాన్ సెబాస్టియన్' పట్టణంలో (ఉత్తర స్పెయిను) కిటికీల సందులనుంచి బయటికి పారిపోవు ప్రజలను రివాల్వరులతో ఫాసిస్టు హంతకులు కాల్చడం మొదలుపెట్టారు. ఏప్రక్కన చూచినను కాల్పులవల్ల బయలుదేరే ఆహాకారాలు గుండియలను అదరగొట్టాయి.

జూలై 24 తారీఖున ఫ్రెంచి పార్లమెంటులో స్పెయిన్ ప్రభుత్వమునకు ఆయుధ సామగ్రిని పంపుటయా, లేకపోవుటయా అనే విషయాన్నిగురించి తీవ్రవాదులకును, వారి ప్రతికక్షులకును తీవ్రమయిన చర్చ జరిగింది. తీవ్రవాదులందరును స్పెయినుకు అన్ని విధాల సహాయం చేస్తేనేగాని తమకుకూడా గర్భశత్రువులైన ఫాసిస్టులు నశించరనియు, తమదేశానికిగూడా అపాయం తొలగిపోదనియు తీక్ష్ణంగా పోట్లాడారు. కాని ఫ్రాన్సు, స్పెయినుకు సహాయం చేశినయెడల, ఫాసిస్టు దేశాలన్నియు, ఒక్కుమ్మడి విద్రోహులకు సహాయంచేశి తీరుననియు, అందువల్ల అపాయం యెక్కువ యగుననియు వ్యతిరేకులు వాదించారు. ఏది యెట్లున్నను, సమస్య చాలా చిక్కుగలదగుటచేతను, తొందరపడి నిర్ణయానికి రావడం చాలా అపాయకరమనియు, రాజనీతికి దూరమనియు ఆలోచించి ప్రభుత్వం యేదీ తేల్చలేదు.

విద్రోహనాయకులు నాటిమాటికి మాడ్రిడ్ పట్టణమును చుట్టుముట్టడిస్తామని భయపెట్టటంవల్ల చాలామంది బ్రిటిష్ ప్రజలు వారి ఓడలలోనెక్కి పారిపోయారు. పారిపోయినవారిలో చాలామంది స్త్రీలును, పసిపాపలును గలరు. ఇంకా అనేకమంది, బ్రిటిష్‌రాయబారి కార్యాలయమునకు వెళ్లి అచ్చట తలదాచుకొన్నారు. ఇప్పటికే వారి ఆహారపదార్థములుకూడా వచ్చాయి. స్వప్రాణ రక్షణార్థం, తప్పించుకొనిపోయిన విదేశీయులెల్లరును, స్పెయిన్ దేశము యేరీతిగా సకలబాధలకోర్చి, తమయొక్క స్వాతంత్ర్యమును, శాంతిని రక్షించుకొనుచున్నారో, పొగడుచు, ప్రపంచమునకు చాటారు. అంతేగాకుండా తమయెడల స్పెయిన్ ప్రజలు చూపిన గౌరవానికిగూడా చాలా సంతోషించి, కృతజ్ఞతను వెల్లడించారు. తిరుగుబాటు ఒకచోట గాకుండా దేశమంతటను వ్యాపించినప్పటికిని, ప్రజాప్రభుత్వసైన్యం, వారి అమోఘమయిన పట్టుదల, శిక్షణచేతను, బలముచేతను, మొదటిరోజుల్లో అనేక యుద్ధరంగాల్లో వరుసగా జయించుచునేవచ్చారు. కాని విద్రోహులు, మొరాకోదేశీయులను బాడుగకుతీసుకొనివచ్చి యుద్ధము చేయించటం ఆరంభించగానే, ప్రభుత్వానికి బలంక్షీణింపసాగింది. ఈరీతిగా అనేకవేలమంది బాడుగసైన్యం మొరాకోనుంచి రావటమే గాకుండా, జర్మని, ఇటలీలనుంచి తినుబండారపు సరకులును, మందుగుండు సామానులు, విమానములు మొదలయిన అత్యవసరము యుద్ధసామగ్రి యావత్తు మొట్టమొదట రహస్యంగాను, క్రమక్రమేణ బాహాటంగాను రాసాగాయి. దీనివల్ల విద్రోహులబలం, ధైర్యం నానాటికి అభివృద్ధి అయింది. అప్పటికిని, యిటువంటి క్లిష్టపరిస్థితుల్లోకూడా, అనేకసార్లు ప్రభుత్వం మాడ్రిడుకు ఉత్తరంగా ఉన్న 'గాడరామా' పర్వత పరిసరప్రాంతములయందును, పర్వతములమీదను, ఫాసిస్టుసైన్యాన్ని ఓడించింది. పర్వతములలో

కాపలాయున్న అనేకమంది సైనికులు పారిపోవలసివచ్చింది. మితి లేని జననష్టం, ధననష్టం కలిగింది.

ఈ విధంగా యుద్ధం తీవ్రతతో సరిగ్గా జులైవరకు సాగిన తరువాత విద్రోహులు "సాన్ సెబాస్టియన్" "లావినియా" అను రెండు నగరాలను వశపరుచుకొని అచ్చట కమ్యూనిస్టుల నే కాక, నిరపరాధులైన స్త్రీ, బాల, వృద్ధులను చిత్రవధ చేశారు. "ఎస్టిపోనా", "లావినియా" యుద్ధరంగాలలో కూడా, ప్రభుత్వం పరాజయం పొందుటవలన అచ్చట చేరిక్కిన కమ్యూనిస్టులను విద్రోహులు నరికేశారు. ఈ వార్త బయటపెట్టినది కూడా విద్రోహ సైనికుడే. అవకాశము చిక్కినపుడల్లా విద్రోహులు మాడ్రిడునగరిక బాంబులు ప్రయోగించుచు, ప్రజలలో ఎంత భీతావహం కలిగించినను, ప్రజలు యీషణ్మాత్రమైనను జంకక, అధికోత్సాహంతో శత్రువులను తిరుముచునే యుండిరి. మొత్తం మీద ఇంతకాలంనుంచీ జరిగిన యుద్ధానికి పర్యవసానంగా ప్రభుత్వానికి, కొన్ని ప్రధాన స్థానాలు పోయినప్పటికిన్నీ, మిలిటరీ, తినుబండారపు సామగ్రి రాకపోకల కొరకు అవసరమైన పట్టణాలు ప్రభుత్వం చేతులలోనే యున్నవి. మాడ్రిడ్‌కు ఉత్తరంగా ఉన్న "బర్గోస్" "వాలడోలిడ్", 'సెగోవియా', మరియు దక్షిణ భాగమున 'జిబ్రాల్టర్' నకు పరిసరముగా ఉన్న కొద్ది ప్రదేశమును, పోర్చుగీస్ సరిహద్దు ప్రాంతములోనున్న కొన్ని పట్టణాలును విద్రోహుల చేతుల్లోపడ్డాయి. 'బాలెరిక్' దీవులు ఇంతవరకు ప్రభుత్వంచేతులోనే ఉన్నాయి. పారిశ్రామిక నగరాలు, సముద్రపు రేవులు ప్రభుత్వంక్రిందనే యున్నాయి. శత్రువుల చేతిలో కొన్ని వ్యవసాయ ప్రదేశాలు మాత్రం పట్టుబడ్డాయి.

———

# స్పెయిన్ దుస్థితి.

——( ౦ )——

## తటస్థ విధానం

——(౦)——

స్పెయిన్ అంతర్యుద్ధాన్ని గురించియు, ప్రభుత్వానికి సహాయం చేయుటయా, లేకపోవుటయా అనే విషయాన్ని గురించియు, ఫ్రెంచి క్రింది పార్లమెంటులో (Chamber of Deputies) ఇరుపక్షులవారికిని విపరీతమయిన చర్చ జరిగింది. పర్యవసానమిది; స్పెయిన్ రాజకీయాల్లో దగ్గర సంబంధమున్న దేశాలను, స్పెయిన్ అంతరంగిక వ్యవహారాల్లో ఎట్టి జోక్యము పుచ్చుకోకుండా చెయ్యాలని నిశ్చయించుకొని, అట్టి నిశ్చయమును యితర దేశముల వారికిగూడా తెలియజేసి, దానిని ఆచరణలో పెట్టవలసినదిగా కోరుచు, జవాబుకొరకై నిరీక్షించుచుండిరి. ఫ్రెంచిప్రభుత్వానికి తన సోదర సోషలిస్టు ప్రభుత్వం యెడల గాఢాభిమానం ఉన్నప్పటికని, అంతర్జాతీయ సంక్షోభం రాకుండా తప్పించుటానికై తాను తటస్థంగా ఉండుట సమంజసమని తలచింది. ఆయుధ పరిశ్రమలను ఫ్రాన్సులో సంఘవశం చేయుటవల్ల, విమానములను గాని, ఆయుధసామగ్రిని గాని, తటస్థవిధానాన్ని అనుకరిస్తున్నప్పుడు, స్పెయినుకు యెంతమాత్రం సంపరాదు. ఫ్రాన్సు తటస్థ విధానవిషయమై, తన అభిప్రాయమును, ఇంగ్లాండునకు తెలియజేసినప్పుడు, అక్కడనుంచి అధికారరీత్యా జవాబింకను రాలేదు. కాని అంతర్జాతీయకల్లోలము కలుగకుండుటకై ఫ్రెంచిప్రభుత్వం సూచించిన అభిప్రాయానికి తమ సమ్మతిని బ్రిటిష్ గవర్నమెంటు తెలియచేసింది. తరువాత అధికారరీత్యా

బ్రిటన్, అన్నివిధములా ఫ్రెంచి తటస్థవిధానమును, ఫ్రాన్సు ఇటలీ చేతకూడా ఆమోదింపచేసిన యెడల, తాముకూడా ఒప్పుకొందుమనియు తెలియజేసిరి. కాని ఇటలీ అధికారవర్గంలో మాత్రం యీ విషయాన్నిగురించి మౌనం వహించారు. జవాబు యివ్వనేలేదు. రాయబారివర్గంలోను, మంత్రుల వర్గంలోను. రాజకీయవర్గములలోను, ఫ్రెంచి సలహాకు యివ్వవలసిన ప్రాముఖ్యత, గౌరవం యివ్వలేదు. అసలు యింతకుముందే క్లిష్టపరిస్థితుల్లోయున్న యూరప్ రాజకీయాల్లో, ఫ్రెంచిసలహా మరింత చిక్కులు కలుగచేసితీరునని భయపడ్డారు. బ్రిటన్, బెల్జియం, జర్మనీ, సోవియట్ రష్యాలనుంచి ఫ్రెంచిప్రభుత్వానికి సవ్యమైన జవాబులు వచ్చాయి. సోవియటు రష్యా చక్కని ఒక ఆలోచన కూడా చెప్పింది, పోర్చుగల్ కూడా యీ "తటస్థ విధానము" లో చేరవలయుననియు, "యింతవరకు కొన్ని రాజ్యములు విద్రోహులకు చేయుచున్న సహాయమును వెంటనే విరమించుకొనవలయు" ననియు గట్టిగా చెప్పింది.

అప్పటికే ఇటలీ, జర్మనీలు వారివారి ఆయుధబలాన్నే కాకుండా, సైన్యాన్నికూడా వేలకువేలు పంపడం మొదలుపెట్టారు. ఫ్రెంచిప్రభుత్వం, కొంతమంది ఇటలీవైమానికులు ఫ్రెంచి మొరాక్కోలోదిగారని మూడుస్పష్టమైన ప్రత్యేక నేరములు వారిమీద ఆరోపించింది. మొట్టమొదటిది విమానములు రిజిస్టరు కానివనియు, రెండవది అనుమతిలేనిదే ఫ్రెంచిరాజ్యములో తిరుగుచుండెననియు, మూడవది . యుద్ధసామగ్రిని తీసుకొనిపోవుచుండె ననియును; యుద్ధసామగ్రిని తీసుకొని పోవుచుండగా, దానివిషయమై ప్రశ్నింపగా, బహుచమత్కారముగాను, గర్వంతోను జవాబు చెప్పారు. ఒక రోజుకూడా జర్మను ఓడగాని ఇటాలియను విమానముగాని, ఫాసిస్టులకు సహాయంరాకుండా ఉండలేదేకాదు.

ఏమూలచూచినా ఇటలీ యుద్ధగల విమానాలే. ఇటలీ వైమానికులు, ఇటలీ నావికులు, జర్మనీ నావికులు, రహస్యంగా సహాయంచేసే స్థితి దాటిపోయి, బహిరంగంగా సహాయంచేయ నారంభించారు. దీనికి దాఖలాలు అపరిమితం. ఏ విలేఖరో, యే బ్రిటిష్, బెల్జియం దేశస్థుడో స్పెయినులో ప్రయాణంచేయుచు, యీ బాహాటమైన ఫాసిస్టు ప్రభుత్వాలసహాయం కన్నులారా చూచి ప్రపంచానికి చాటారు. గ్రంథవిస్తరభీతిచే వారుయిచ్చిన వాంగ్మూలములను యిచ్చట వ్రాయుటలేదు. అయినను పాఠకుల నమ్మకమునకై ముందు ముందు ఒకటి రెండు స్టేట్మెంటులను పొందుపరుస్తాను. బాహాటంగా యిప్పుడీ సహాయం మొదలుపెట్టాగో, రష్యాయొక్క కార్మికకర్షకులకు జర్మనీ, ఇటలీలమీద కలిగిన ఆగ్రహానికి మితి లేకపోయింది. దాదాపు 2 లక్షలమంది ట్రేడ్ యూనియన్ సభ్యులు 'రెడ్‌స్క్వేరు'లో ఆగస్టు మూడవతారీఖున నడిరేయిందాకా కాలపు రోజున గుమికూడి సభ జరిపారు. వారి క్రోధానలం పూర్తిగా ఉపన్యాసాల మూలమునను, నినాదముల మూలమునను బయటపెట్టడమే కాక కార్యశూరులుకూడా అయినారు. అక్రమంగా విద్రోహులకు సహాయంచేస్తున్న ఇటలీ, జర్మనీలను గర్హించుచు, మాస్కోరాష్ట్రంలోని ట్రేడ్ యూనియన్ సభ్యులందరును చందాలు వేసుకొని వసూలయిన మొత్తమును (2 కోట్ల 40 లక్షల రూపాయిలు) స్పెయిను ప్రజాప్రభుత్వ రక్షణార్థం పంపించారు.

స్పెయిన్ ప్రభుత్వం అప్పుడప్పుడు ప్రచురించిన కాగితాలను బట్టి, అనేక గౌరవనీయులైనట్టి, తటస్థ స్వభావులయినట్టి విదేశీయులు స్పెయినులో జరుగుచున్న విషమపరిస్థితులను చూచుటకై వచ్చి, న్యాయమేమున్నదో ప్రపంచానికి తెలియజేయుటకై ప్రకటించిన వ్యాసములనుబట్టి, ప్రపంచానికంతటికి ఇటలీ జర్మనీలు యీ రోజువరకు విద్రోహులకు చేయుచున్న సహాయం తేట

తెల్లంగా తెలుస్తూనేయున్నది. స్పెయిన్ ప్రభుత్వం ప్రకటించిన పత్రంలోని సారాంశ మిది —"ఫాసిస్టు మిలిటరీనాయకులకు, మహాయుద్ధం మొదలుపెట్టినప్పటినుంచికూడా, ముఖ్యముగా పోర్చుగీస్ దేశమును, తమకొరకు కావలసిన ఆహారపదార్థము లైనేనేమి, ఆయుధసామగ్రితేనేమి తెప్పించుకొనుటకు పూర్తిగా ఉపయోగించుకొనవలయునని కోరిక. జర్మనీ, ఇటలీలు ఆయుధసహాయము చేయుచున్నట్లు రోజురోజుకు నిదర్శనాలు యెక్కువగుచున్నాయి. ప్రతిదినము, అధమం నాలుగయిదు యుద్ధ విమానములో, ఓడలో, జర్మని, ఇటలీ సైన్యములతోను, సైన్యాధికారులతోను, పత్రికా విలేఖరులకు కనుపించకుండా ఉండేవికావు." ఒకరోజున "లండన్ టైమ్సు" పత్రికా విలేఖరి 21 యుద్ధవిమానములను విద్రోహుల సైనిక శిబిరమయిన "బర్గోస్" పట్టణంలో చూచాడు. "లండన్ న్యూస్ క్రానికల్" పత్రికావిలేఖరి 12 జర్మను విమానములను (తరిమి వెంబడించునవి) సెప్టెంబరు 24 తారీఖున "సెవిల్లీ" పట్టణంలో చూచాడు. 24 ఇటలీ విమానములను "విగో" హార్బరువద్ద స్టీమరునుంచి దింపినట్లుగూడా సాక్ష్యం ఉన్నది. ఇటలీ వైమానికుడైన కెప్టెన్ ఎర్నెస్టో మోనికో అనునతడు ఇటలీ విమానమును నడుపుచుండగా 'టాలవీరా' యుద్ధరంగంవద్ద ఆగస్టు 30-వ తారీఖున ప్రభుత్వసైనికులు దానినికాల్చి క్రిందకు పడగొట్టారు. వైమానికుడుకూడా చచ్చిపోయ్యాడు. అతనివద్ద కొన్ని ముఖ్యమయిన కాగితాలు విద్రోహనాయకుల సంతకములతో దొరికాయి. ఆ యుద్ధరంగంలోనే సార్జంటు 'విన్సెంటూ పాట్రియూర్కా' అను సైనికోద్యోగిని ప్రభుత్వసేనలు పట్టుకున్నాయి. అతడును, అతనితో అనేకమంది ఇటలీ యోధులున్న 'జెనోవా' వద్దనుంచి స్పెయినుకు, ఇటలీ వైమానికునిచేత నడుపబడ్డ విమానంమీద స్పెయినుకు విద్రోహుల సహాయార్థం వచ్చితి

మని అఫిడవిట్టుమీద సంతకంచేశాడు. వెంటనే వారినందరిని అరెస్టు
చేసి ప్రభుత్వంవారు కఠినశిక్షలు విధించారు. వార్తాపత్రికలలో
హెచ్. యఫ్. గ్యారట్ గారిచే వ్రాయబడిన వ్యాసములనుబట్టి,
(London "Daily Mail") వీటినితరువాత సమర్థించిన అఫిడ
విట్లనుబట్టియు, 31 ఆగస్టు తారీఖున స్పెయిన్ హాస్పిటలును ఇటలీ
విమానములచేత బాంబులు వేయబడి నాశనము చేయబడినట్లు ధృవ
మగుచున్నది. ఆ రోజుననే రాత్రిలమండి మానిరిగా విమానాలు
ఇటలీనుంచి వచ్చినవని తేటతెల్లమయింది. జర్మనీ ఓడలయిన
"కామెరన్" "విస్‌బర్గు", విద్రోహులకు తండోపతండములుగా
ఆయుధములను సప్లై చేసినట్లు నిదర్శనాలు పూర్తిగా కనుపించాయి.
పోర్చుగల్ ద్వారా 'లిస్బన్' నుంచి ఆయుధ సామగ్రియు, తిను
బండారపు సామగ్రియు విద్రోహులకు చేరాయి. అచ్చటనుంచి,
విద్రోహులచే పట్టుబడిన 'బెడజాజ్', 'సాలమాంకా' పట్టణాలకు
గూడా రవానాచేశారు. రవానాచేసిన వాటిలో ముఖ్యమయినవి
మోటారుట్రక్కులు, బాంబులు, టాంకులు, విమానములు.
జర్మనీ, ఇటలీలు చేసిన సహాయమును సారక మహాశయులు నమ్మ్ర
టకు యీ ఉదహారణాలు చాలునని నమ్ముచున్నాను. ప్రతి
ఉదహారణ వ్రాయడమంటే, స్థలము చాలకపోవుటయేగాక చదువు
టకు విసుగుగా గూడనుండటం సహజం. అయినను జర్మనీ, ఇటలీలు
విద్రోహులకు చేయుచున్న బలవత్తరమయిన సహాయాన్ని తెలియ
చేయటానికి యిచ్చట రెండు చక్కని అమూల్యమయిన తార్కా
ణాలు వివరిస్తాను. పూర్వం ఫాసిస్టు డిక్టేటరయిన ప్రైమోడి
రవీరా కుమారుడు 'డాన్ అంటోనియో ప్రైమోడెరవీరా,'
యిప్పుడు జరుగుచున్న అంతర్యుద్ధంలో ప్రభుత్వ సేనలచేత పట్టు
బడ్డాడు. అతనిని అరెస్టుచేసిన తర్వాత విచారణ ఏర్పాటు
చేసారు. ఆ విచారణలో జర్మనీ, ఇటలీలకున్ను, స్పెయిన్ ఫాసిస్టు

విద్రోహులకున్నూ చాలాదగ్గర సంబంధం ఉన్నట్లు పూర్తిగా యితడు ఒప్పుకున్నాడు. 'గెఫీరా' యును 'జనరల్ సాన్‌జుర్జో' యును అనేక మార్లు సంభాషించిరనియు, వీరిద్దరును కలిసి జర్మనీ మిలిటరీ అధికారుల వద్దకు వెళ్లి వారితో రహస్యంగా తిరుగుబాటు కుట్రనుగురించి ముచ్చటించిరనియు, ప్రభుత్వంవారు యితనిపై నేరంమోపారు. నిజంగా స్పెయిన్ విద్రోహ నాయకులకును, జర్మనీ అధికారులకును మధ్యవర్తిగా పనిచేసి వ్యవహారం సాగించింది యీ 'గెఫీరా' యే. గెఫీరా, స్పెయినులోను, జర్మనీలోను, వారివారి మధ్య జరిగిన రహస్య సంభాషణయావత్తు పూస గుచ్చినట్లు చెప్పాడు. హిట్లరునుగూడా కలుసుకొని మాట్లాడినట్లు ఒప్పుకున్నాడు. ఇటీవలనే సైన్యంలో చీలికలు కలుగచేశి, విద్రోహుల పక్షం చేరినందుకు యితన్ని ప్రజాప్రభుత్వంవారు ఉరితీశారు. "'న్యూయార్కు టైమ్సు'' పత్రికా విలేఖరి వ్రాసిన వ్యాసమునుబట్టి, జర్మని, విద్రోహులకు ఏరీతిగా సహాయపడుమన్నదీ తెలుస్తున్నది. విలేఖరుడు స్వతహాగా అనేకజర్మన్ విమానాలను చూచాడు. వైమానికులు యూనిఫారమ్‌డ్రెస్సులో లేరుకాని, విలేఖరి చెప్పినప్రకారం, జర్మనీరాజప్రతినిధి అక్కడ జర్మనీయుద్ధ వైమానికులు ఉన్నట్లు ఏకాంతంగా ఒప్పుకున్నాడు. కాని సాధారణంగా ఇటువంటి యదార్థవిషయాలను కూడా జర్మనీ మంత్రులు అబద్ధమని, నిరాధారమని, ఎంతమాత్రం అంగీకరించలేదు.

స్పెయిన్ అంతర్యుద్ధంలో ఏ రాజ్యంవారును జోక్యం కలుగచేసుకొనగూడదనే ఫ్రెంచివారి సూచనపై నెలరోజులకు పైగా మంత్రాలోచనలు, రాయబారాలు జరిగినమీదట, యేదో వొక రకంగా 16 రాజ్యాలు సరేనంటే సరేననుకొని ఒక యగ్రిమెంటుకూడా ఏర్పరచుకొన్నాయి. మొదటినుంచి కూడా కలవర

పెట్టుచున్న ఒక పెద్ద చిక్కు సమస్య యిది. స్పెయిన్ యుద్ధం, రెండు కక్షుల మధ్య కేవలం అధికారంకొరకు జరిగే అంతర్యుద్ధం కాదు. రాజకుటుంబాల మధ్య జరిగే పోరాటముకూడా కాదు. ఇక యెటువంటి యుద్ధం యిది అని అడగవచ్చు. ఈ మహాసంఘర్షణ అతితీక్షణమయిన వర్గకలహం (Class war). ఇది స్పెయిను వర్గ కలహమేకాదు. అంతర్జాతీయ వర్గకలహంయొక్క నిజస్వరూపమే స్పెయినులో ప్రత్యక్షంగా కనుపిస్తున్నది. ఈవర్గ కలహంలో చాలా ముఖ్యమయిన అనేక రాజకీయ సిద్ధాంతాలు చిక్కుకొని ఉన్నాయి. కనుకనే స్పెయినువర్గ కలహం క్రమంగా ఐరోపా ఖండాన్ని, ప్రపంచాన్నికూడా ఆవరించి, చెప్ప నలవికాని విపత్తునకు, సంక్షోభానికిని కారణభూత మవునని నేడు ప్రపంచ రాజకీయ వేత్తలు భయపడుచున్నారు. దాని స్వరూపం, దానివల్ల కలుగు అపారమయిన జననాశనం వ్రాయ నలవికాగు సరికదా, ఊహించుకొనుటకు గూడా అసాధ్యం. ఫ్రెంచి ప్రభుత్వం వారి తటస్థ విధాన సూచనలను పంపించగానే, ఇటలీ జర్మనీలకు విద్రోహుల యెడలనున్న బహిరంగ సానుభూతి, పూర్తిగా వారివారి కుయుక్తి సమాధానాలవల్ల వెల్లడి అయింది. జర్మనీ గవర్నమెంటు, సోవియటు గవర్నమెంటు స్పెయినుకు సహాయం చేయునని పూచీకత్తు యిచ్చినచో, విద్రోహులకు తాముకూడా సహాయం చెయ్యనని తెలిపింది. తక్షణమే రష్యాకూడా మనస్ఫూర్తిగా, దాపరికం లేక ఫ్రెంచి సూచనలను అంగీకరించింది. ఇటలీ నిరాకరించుటవల్ల ఒడంబడిక ఆలస్యం జరగడానికి కారణమయింది. ఇటలీ పెట్టిన పేచీ యిది తటస్థ విధానంవల్ల స్పెయినులో యిరు కక్షులవారికి జరుగుచున్న అన్ని విధములైన సహాయములను అరికట్టవలసి ఉంటుందని కృత్రిమ స్వభావంలో మాట్లాడారు. అల్లా అంతా ఒప్పుకుంటే తాముకూడా ఒడంబడికలో చేరుతామని

తెలియచేశారు. దీని అర్థం ఏమయి ఉంటుంది? సోవియటు ట్రేడ్ యూనియన్ వారు స్పెయిను ప్రజలకు పంపించిన ధనము నకును, ఫ్రెంచి దేశమునుంచి స్పెయినుప్రభుత్వ పక్షమున యుద్ధం చేయుచున్న వలంటీరుల రాకకును ఆటంక పరిచిందన్నమాట. బ్రిటిష్ ప్రభుత్వంలో స్నేహంగా ఉండడం చాలా అవసరమని నుక్తెరిగి, అందులకై కావలసిన ప్రయత్నాలు చేయుచుండుటవల్ల ఇంగ్లండుచేతకూడా సమర్థించబడ్డ సంధిసూచనలను తిరస్కరించి, తన దేశానికి యిక్కట్లు తెచ్చి పెట్టుదామని నిశ్చయించుకోలేదు. స్పెయినుతో సంబంధమున్న పెద్దదేశాలన్నీ కూడా యీ తాటస్థ్య విధానానికి ఆమోదం తెలియబర్చాయి. వెంటనే అన్ని దేశాల ప్రతినిధులు కలసి ఒక సంఘాన్ని 'లార్డ్ ప్లిమత్' అధ్యక్షతక్రింద ఎన్నుకున్నారు. ఈ సంఘం అప్పుడప్పుడు కలుసుకొని, స్పెయిను యుద్ధానికి సంబంధించిన చిక్కు సమస్యలను, చర్చించారు. ఇటలీ, జర్మని, పోర్చుగల్ దేశాల తాటస్థ్యధిక్కారమును, సైని కులను ఆయుధ పరికరాలను, విమానాలను, ఓడలను విద్రోహు లకు పంపడం గూర్చియు తగాదాలు పడ్డారు.

## ఫ్రెంచి కార్మికుల అసమ్మతి.

స్పెయిన్ అంతరంగిక కలహమును గురించియు, తటస్థ విధాన సూత్రమును గురించియు, ఫ్రెంచి కార్మికులు చాలా కలవరపడసాగారు. స్పెయిను రాజకీయములలో జర్మనీ, ఇటలీలు జోక్యం కలుగచేసుకొనడం ఫ్రెంచి కార్మికుల ఆగ్రహానికి కారణమయింది. అనేక పర్యాయాలు వారి పత్రిక అయిన "లిపాప్యులేర్" ద్వారా వారి నిరసనభావాన్ని తెలియచేశారు. జర్మనీ, ఇటలీల జోక్యమును వారు సహించలేక తక్షణమే, స్పెయిన్ గవర్నమెంటుకు అన్నివిధములయిన సహాయంచేశ

తీరుదుమనియు, ఫాసిస్టు దారుణ కృత్యాలను కండ్లార ప్రత్యక్షంగా చూస్తూ సహించి ఊరుకోజాలమనియు ప్రస్ఫుటంగా చాటారు.

ఇక స్పెయినుకు వద్దాం. ఫాసిస్టు విద్రోహులతో పోరాడేది స్పెయిన్ ప్రజాసామాన్యమే కాకుండా వారి సహాయార్థం, ఇంగ్లండు, సోవియట్ రష్యా, ఫ్రాంసు, ఐర్లాండు, మొదలయిన దేశాలనుంచి వ్యక్తిగతంగాను, సంఘముల ద్వారాను, స్వార్థ త్యాగులు, ప్రజారాజ్య వాదులు, అనేక వేల మంది స్పెయినుకు వచ్చారు. వారు అనేక యిడుములకులోనై, చలికి, మంచుకు, ఆకలి బాధలకు ఓర్చుకొని, తుదకు బంధు మిత్రులమీదను, భార్యా పుత్రుల మీదను ఆశను విడనాడి స్పెయిను రక్షణార్థం పోరాడారు. వీరిని సన్మానించి ఉత్సాహ పరచవలశిన బాధ్యతను స్పెయిన్ ప్రధాన మంత్రి గుర్తెరిగి, వారి శరీరం గగుర్పొడిచేటట్టుగా, యీ క్రింది వాక్యాలలో అతడు, యుద్ధానికి పూర్వం ప్రోత్సాహ పరచాడు. "మనం పూనుకున్న కార్యం మహోత్కృష్టమయినది. వ్యక్తిగౌరవం, పేరు ప్రతిష్టలనేగాక, చివరకు గ్రంథాలను, మనుష్యులను సహితంమంటపాలు గావింప బూనుకున్న ఫాసిస్టు ఘోర పెను భూతమును మనం నాశనంగావింప వలశి యున్నది. కాబట్టి కార్యశూరులు కండు! పొండు! జయము మనకే సిద్ధించుగాక". మేఘ గర్జనల బోలు యీ పలుకులువిన్న తోడనే సైనిక పళములు వారి వారి నియమిత యుద్ధరంగములకు బారులుతీరి జయనినాదములతో పరుగెత్తుకొని పోయ్యారు.

కొంత భయంకర యుద్ధమయిన తర్వాత, దక్షిణ స్పెయినులోనున్న 'బెడజాజ్' పట్టణం విద్రోహుల వశమయింది. విద్రోహసైన్యములు ఆరితేరిన సైన్యాధికారులచేత నడిపింపబడినను, నిపుణతగల్గిన వైమానికులు యుద్ధంలో పాల్గొనినను,

బాంబులు మొదలయిన మారణాస్త్రములు గలిగియున్నను, ప్రభుత్వసేనలు అతిసాహసంతో శత్రుసేనల నెదుర్కొని తమ బలమును ప్రదర్శించాయి. జయము యిప్పటికా యింకా కాసేప టికా అన్నప్పుడు, శత్రుసేనలు విద్రోహుల సహాయానికివచ్చి రిపబ్లికనులను ఓడించాయి. 'బెడజాజ్' పట్టుపడిన వెంటనే, అచ్చట పిల్లలు మొదలు, ముసలులవరకు, పాసిస్టు హంతకులు చెప్పరాని దురాగతాలుగావించి, యెన్ని చిత్రవధలుచేశారో యిచ్చట వ్రాయనలవికాదు. పాఠకసోదరులే ఊహించుకో గల్గు తారు. ముఖ్యంగా కమ్యూనిస్టులను కాళ్లుచేతులు నరికి, భగ్గుభగ్గున మండేమంటలో పడేశారు. ఆడువారిని, పసిపాపలను అగ్నిహోత్రం పాలు చేశారు. 'బెడజాజ్' పడగానే, ఇరన్, సాన్ సెబాస్టి యన్ పట్టణాల్లో యుద్ధం భీకరరూపం తాల్చింది. ఇరుపక్షాల వారును సైన్యాన్ని, విమానాలను, మందుగుండుసామానును సిద్ధంగా ఉంచుకొన్నారు. ఏయే యుద్ధరంగాలలో, యెంతెంత సైన్యం అవసరమో, యెటువంటి సాంకేతిక ప్రదేశాల్లో, సైన్యాన్ని కాపలా ఉంచితే, విజయం త్వరలో తప్పక సాధ్యమవుతుందో ఆలోచించి సైన్యాన్ని ఏర్పాటుచేశారు. ఈ యుద్ధరంగంలో ముఖ్యమయిన విశేషం, కార్మిక కర్షకులు, స్త్రీలు పాల్గొనడమే. చివరకు పట్టణ ములు రెండును విద్రోహులచేతుల్లోకి పోయేదాకా వదలకుండా హోరాహోరిగా పోట్లాడారు. రిపబ్లికు ప్రజాస్వామ్యానికి అధ్యక్షు డైన డాన్ మాన్యూల్ అజానా, స్పెయిన్ ప్రజాసామాన్యానికిని, సైనికదళాలకును క్రిందివిధంగాఉత్సాహపూరితమయిన మాటలతో బ్రాడ్‌కాస్టు ఉపన్యాసంచేశారు· "స్పెయిన్ దేశీయులారా, ఈ భయావహమయిన సమయమందు స్పెయిన్ ప్రభుత్వంయొక్క అనుమతితోను, నా అధికార పరిస్థితులనుబట్టి, నేను యింతకాలము నుంచి వహించిన మౌనమును వదలివేశి, మీకు ఉత్సాహమును

ఉద్రేకమును పుట్టించి కార్యోన్ముఖులను చేయుటకుగాను కొన్ని వాక్యములను చెప్ప నిశ్చయించుకొంటిని. మీరు యింతకాలము నుండి అసమానమయిన త్యాగశీలతతోను, అకుంఠిత పరాక్రమం తోను దేశమును శత్రుహంతకులనుంచి రక్షించినందు లకై మీకు నేను ధన్యవాదము లర్పవలసియున్నది. ఏ పవిత్రమయినట్టి, సర్వజనాదరణీయమయినట్టి ప్రజాప్రభుత్వాన్ని, నామరూపాదులు లేకుండా చేయుటకై శత్రుహంతకులు ప్రతిజ్ఞ పూనిరో, అట్టి శత్రువర్గమును మొదలంట నేలమట్టంచేసి, దేశంలో శాంతి, సౌఖ్యములు, పునః స్థాపించుటకై మీరు ప్రతిజ్ఞ చేసి అందు నిమిత్తం ధన ప్రాణమానములను ధారపోయుచున్న మీకు జయం సత్యం. ఆత్మ గౌరవం విడనాడి, స్వదేశంయొక్క ప్రతిష్ఠ, శాంతి, నాగరికతలు రూపుమాప నిశ్చయించికొని, తోడి దేశీయులనే కనికరమెంత మాత్రంలేక, హృదయమును పగులగొట్టగలిగిన క్రూరకార్యముల నాచరించు దేశద్రోహులకు గూడా నేను బుద్ధి చెప్పుచున్నాను.”

“శాసన సమ్మతమయిన మన రిపబ్లికు ప్రభుత్వమును ఫాసిస్టు దోపిడిగాండ్రు అనుపమానమైన క్రూరచర్యలతో ముట్టడించు కాలములో, నేను నొప్పి గలిగించేమాట పల్లెత్తుమాటయైనను మిమ్ములను అనను. రిపబ్లికు ప్రభుత్వమునకే సంపూర్ణ మయిన జయం ప్రాప్తించగలదు. రిపబ్లికుపతాకం అంతకంతకుపై కెగురును గాని, క్రిందికెన్నడును దిగదు. ప్రజలుచూపుచున్న త్యాగ పరాక్రమాదులనుబట్టి స్పెయిన్ రిపబ్లికునకు నూతన స్వాతం త్ర్యోదయం కలుగుతుంది. దానిని అణచటానికి ప్రపంచ మంతటికైనను సాధ్యంకాదు. పోరాటాన్ని లేవదీయాలని ప్రజలను కవించిన ఫాసిస్టులు, మిలిటరీ అధికారులు, నిజంగా ప్రజలకుగల శక్తిని యీ మన్మాత్రంకూడా తెలుసుకోకుండా వారిని లోబరచు కోడానికి ప్రయత్నం చేస్తున్నారు. మనంమాత్రం యెటువంటి

వారికికూడా బానిసలు కాజాలము. నూరు సంవత్సరములకు పూర్వమే, స్పెయిన్ దేశం ఉత్తమమైన తనస్వాతంత్ర్య మహా గ్రంథం వ్రాసుకున్నది. ఈ గోజానకూడా అటువంటి, పరిస్థితుల్లోనే, అప్పటి పద్ధతులవల్లనే, స్పెయిన్ తన స్వాతంత్ర్యం కొరకు మహాత్యాగంతో పోరాడుచున్నది. ఇతరదేశీయుల యొక్క ఎట్టి అక్రమమయిన సౌఖ్యములను సహింపక, స్వేచ్ఛ, స్వాతంత్రములు కలిగిన రిపబ్లికు ప్రభుత్వమే స్పెయిన్ ప్రజలకు యిప్పటికి, యెప్పటికి కావలసినది—"నేనే బలవంతుడను! నాకెవరు అడ్డురాగల"రని మదాంధకారములవల్ల కన్నులు గప్పిన నెపోలియన్ మాదిరిగా నేడు నెపోలియన్ వేసినయెత్తులు, మరియు మాయలు ప్రదర్శిస్తున్నవారు, నెపోలియన్ మాదిరిగానే విస్మృయులగుచున్నారు. అనగా స్పెయిన్ ప్రజలు అధికారంలో బలహీనులైనప్పటికి, వారిహృదయాన్ని వారి స్వాతంత్ర్యశక్తిని మట్టుకు అణచుటకెవ్వరూ శక్తులుగారు. వినాశకరమైనట్టియు, ప్రతీఘాతమైనట్టి, యీ ఫాసిస్టు–మిలిటరీ తిరుగుబాటు, అధికారవర్గంలో చీలికలు గలిగించి,కొన్ని చీలికల సహాయంతో కుట్రలుపన్ని దేశాన్ని లోబరచుకొనుకొన్న మాట ఒట్టిది. అది యెన్నటికిని జరుగదు: జరుగనీయము. ఎందువల్లనన, మునుపటివలె రాజకుటుంబములలో నుంచి, రాజులవద్దనుంచి పొందినసహాయం యిప్పుడు విద్రోహులు పొందలేరు. అప్పుడు ప్రజలయొక్క యోగక్షేమం, ప్రజలయొక్క బ్రతుకు, వారిచేతుల్లో లేదు. అనగా వారి నిజమయిన ప్రతినిధులు, అధికారంలో లేరు. ఇప్పుడో అట్లుకాదు. ప్రజలే రాజ్యాధికారాన్ని పూర్తిగా నిర్వహిస్తున్నారు."

ప్రభుత్వసేనలకు తనయొక్క విశ్వాసాన్ని, ప్రేమనుచూపిన తర్వాత 'అజానా' తన గంభీరోపన్యాసాన్ని ముగించి తన కార్యక్రమానికి వెళ్లిపొయ్యాడు. వివిధసైనిక దళాలు తమతమ నూతన

ఆయుధాలను ధరించి జయజయ ధ్వానములతోను, విప్లవనినాదాల
తోను, యుద్ధరంగాలలోకి ప్రయాణమయ్యారు.

'ఇరాన్' చుట్టుప్రదేశ మంతటను భీకరమైన యుద్ధం
సాగుతూంది. ఇరాన్ చాలాముఖ్యమైన ప్రదేశాల్లో ఒకటి.
ఫ్రాన్సునుంచి యిచ్చటికి చాలాముఖ్యమైన ఒక రైల్వేమార్గం
కలదు. అందువల్ల 'ఇరాన్' ఓడిపోవడం గవర్నమెంటుకు పెద్ద
నష్టమన్నమాట. ఫీల్డు గన్సు, (Field Guns) టాంకులు, డైన
మైట్లును యిచ్చవచ్చినట్లు విచ్చలవిడిగా రెండుపక్షాల వారుకూడా
ఉపయోగించారు. వీటిధాటికి తట్టుకోలేక ఇరాన్లోనియెత్తయిన
భవనాలు కూలిపడ్డాయి. విసుగు, విరామంలేకుండా విద్రోహులు
'జెనరల్ మోలా' నాయకత్వం క్రింద ప్రభుత్వసేనలను ముట్టడివేశి,
బాంబులకు గురిచేస్తున్నప్పటికీ, వారంరోజులనుంచి కార్మికసైనిక
దళం, మార్క్సిస్టు దళం, భయపడి పారిపోకుండా యెదుటపడి
విపరీతమైన ధైర్యంతో పోట్లాడారు. సముద్రంమీదుగుండా
'ఇరాన్' పట్టణాన్ని బాంబుల వర్షంచేత ధ్వంసంచేతామని విద్రో
హులు ఆలోచించారు. ఆ ప్రయత్నాలకు ఆటంకం కలుగచేయ
టానికై ప్రభుత్వ ఓడలుకొన్ని ఉత్తరసముద్ర తీరానికిపోయి శత్రు
వుల ఓడలనుఢీకొన్నాయి. ఈ వార్తలు వినడంతోటే, ఇరాన్
లోని ప్రభుత్వ సైనికులకు ఉత్సాహం యెక్కువయి, శత్రువులను
ధ్వంసంచేయుటకై అన్ని ఏర్పాట్లు చేసుకుని యుద్ధంచేశారు. కాని
శత్రువులయొక్క బలగంయావత్తు ఒక్కటయి చుట్టుముట్టుట
చేత, సెప్టెంబరు నాల్గవ తారీఖున ఇరాన్లో చాలాభాగం వశం
చేసుకోగల్గారు. ఈ విజయంవల్ల విద్రోహులకు ఉత్తరస్పెయి
నులో బలం యెక్కువయింది. తర్వాత దీనిని తమముఖ్యమైన ఒక
సైనిక శిబిరముగా తయారు చేసుకున్నారు. ప్రజలకు పరాజయం
కలుగుటతోడనే, భయభ్రాంతులై చెల్లాచెదరయి పోయ్యారు.

కాని సైనిక దళాలుమాత్రం యింకను శత్రువులను ప్రతిఘటించు
చునే యున్నవి. "బిహోబిగ్యూ" పట్టణాన్ని, చుట్టుప్రక్కల
నున్న యితర చిన్నపట్టణాలను విద్రోహులు పట్టుకున్నారు.

ఇరాన్ పట్టణాన్ని వశపర్చుకొనడం తోడనే, 'అజానా'
అధ్యక్షుడు, అతని మంత్రివర్గం రాజీనామా యిచ్చారు. వెంటనే
అతివాద సోషలిష్టు నాయకశిఖామణియైన కామ్రేడ్
కాబెల్లెరో, అతని సహచరులును కలసి మంత్రి వర్గంలోకి
వచ్చారు. అతివాదినాయకులు అధికారంలోకి రాగానే, యుద్ధం
మరింత తీవ్రతగా సాగుతుందని ప్రజలందరు ఆశించారు. ఈ
ఆశించటం కూడా సహజమే, ఈ మంత్రివర్గంక్రింద అటో యిటో
తేలిందాకా యుద్ధం సాగిస్తారనియు, ప్రజల ఉత్సాహ ధైర్యాలు
వెయ్యి యిబ్బళ్లు అధికమవుతాయని యూరప్ యావత్తు అను
కొన్నది. 'సాన్ సెబాస్టియన్' పట్టణంలో (ఉత్తర స్పెయిన్)
భయానకమైన వీధి యుద్ధం జరిగిన తర్వాత ఆపట్టణం విద్రోహుల
చేత పట్టుబడింది. ఈ యుద్ధంలో విద్రోహులకు జెనరల్ మోలా
నాయకత్వం వహించి అతిచాకచక్యంతో నడిపాడు. పట్టణం
లోని సామాన్య ప్రజలు యావత్తుకూడా, కాల్పుల బాధలకు,
ఉరులకు తాళజాలక, ఇదివరకు తక్కిన పట్టణాలలో మాదిరి
గానే విడిచిపెట్టి వెళ్లిపోయారు. టూలవీరా యుద్ధరంగంలో
ప్రభుత్వం యెంత కట్టుదిట్టంచేసి, నిపుణులైన సైనికులను, వైమాని
కులను పంపించినా, విద్రోహులయొక్క విమానములముందు,
ఆయుధాలముందు నిలువలేక పోయారు. ఇది గొప్ప యుద్ధాల్లో
ఒకటి. ఈ యుద్ధంలో ప్రభుత్వం పరాజయం పొందింది. ఈ
లోపల స్పెయిను 'ప్రత్యేక యుద్ధ సంఘం' ప్రభుత్వం వారికోరిక
పైన స్థాపించబడ్డది. 30 రోజుల వరకు ప్రజలు వీధుల్లో తిరుగ
రాదనియు, సాధ్యమయినంతవరకు శత్రువులనుంచి తప్పించు

కొనవలసినదని, 'మార్షల్' లా మాదిరిగా ఒక చట్టం ప్రకటింప బడింది.

విద్రోహులకును, ప్రభుత్వ సైనికులకును కొన్ని వారాల వరకు అతి తీక్షణమయిన యుద్ధం జరిగింది. ఇరుపార్టీల వారు కూడా వెనుతీయక మహా పౌరుషంతో చివరవరకు తేలిందాకా పోట్లాడుదామనే పట్టుదల పట్టారు. తమవికూడా డెమాక్రాటిక్ ప్రభుత్వాలంటూ ప్రగల్భాలుకొట్టు యితర యూరప్ దేశాలు విద్రోహులు చేయుచున్న ఘోరాలకు జవాబు చెప్పలేక పోవడం చాలా శోచనీయమైన విషయం. తటస్థ్యం, తటస్థ్యం! అని వృథావాగ్వి వాదాలు చేయడంలో అర్థమేమిటి? విద్రోహులను కూడా, ఫ్రాంసు, ఇంగ్లండు మొదలయిన దేశాలు, సక్రమముగా, సశాస్త్రీయంగా ఏర్పడిన స్పెయిన్ ప్రజా ప్రభుత్వంతోపాటు జతచేశారన్నమాట. ఫ్రాంసు, ఇంగ్లండు దేశాలు తటస్థ విధానం అంటూ వృథాకాలయాపన చేస్తుంటే, స్పెయినులో ఆబాల గోపాలం యావత్తు క్రమక్రమంగా బాంబులు, గ్యాసుల వాత పడుతున్నారు. ఈ విధంగా ఉన్నది తటస్థ విధానంకొరకు చేసే వ్యర్థ ప్రయత్నాలు. ఇటలీ జర్మనీలు తమ పనిని నిర్విఘ్నంగా నెరవేర్చుకుంటున్నాయి.

జనసామాన్యం యుద్ధంవల్ల పడే బాధలను తప్పించడానికై, ఇతరదేశీయుల కొరకు వారివారి రాయబారులు (బ్రిటన్, ఫ్రెంచి, అర్జెంటైన్, యింకా యితరులు) మోటార్లలోను, లారీలలోను, డాక్టర్లు, నర్సులసహాయంతో స్పెయినుకువచ్చి వారికి కావలసిన సహాయంచేశారు. వేలకొలది పౌనులు ఇంగ్లండులో బాధితప్రజల సహాయార్థం చందాలు వేసుకుని స్పెయినుకు పంపించారు. స్పెయిన్ యెడల సానుభూతిని చూపించుటకై అనేకసభలు అన్ని

దేశాలతోపాటు మనదేశంలోగూడా జరిగాయి. ఇట్టివిపరీత సాను భూతికి, కారణం స్పెయిను ప్రజలు, వారి స్వతంత్రతకొరకు చూపు చున్న త్యాగదీక్షయే.

## మాడ్రిడ్ పై దాడి

'సాన్ సెబాస్టియన్' పతనం అయిన తరువాత, విద్రో హులు, తాముగెల్చిన పట్టణాలను రక్షించుకొనుటకు, సేనలను, ఆయుధాలను, ఉత్తీర్ణులైన సైన్యాధికారులను నియమించారు. ఇక వారి దృష్టినిశూవత్తు మాడ్రిడ్ మీదికి మళ్లించారు. ఎక్కడెక్కడి మరఫిరంగులు విమానాలు, బాంబులు, టాంకులు మొదలయిన నవీన మారణాస్త్రాలనన్నిటిని మాడ్రిడ్ ముట్టడికి తయారు పెట్టుకు న్నారు. మాడ్రిడ్ మాత్రం నిద్రపోతుందా? ఈ మాత్రానికే మాడ్రిడ్ వీరులు లొంగుతారా? మాడ్రిడ్ పైకి దాడి ప్రారంభం కాక పూర్వమే 'మెక్సికో' నుంచి, రష్యానుంచి స్పెయినుకు ఆయుధసామగ్రి రావడం ప్రారంభించింది. మాడ్రిడ్ చుట్టును అభేద్యమైన కోటగోడలవలె సైన్యమును ఆయత్తంచేసి కాపలాఉంచారు. ఇంకా అనేకవిధములయిన నవీన పద్ధతుల మీద భూగర్భంలో కందకములను త్రవ్వి, టాంకులతోను, మర ఫిరంగులతోను (Machine guns) నింపేశారు. ప్రభుత్వం, ప్రజలందరికి నిండా ఉత్సాహంపురిగొల్పింది. ప్రభుత్వపక్షాన పోరాడుచున్న విదేశసైనికులుగూడా స్పెయిన్ ప్రజలతోపాటు ప్రాణాలొడ్డడానికి సిద్ధులయినారు. కాని ప్రభుత్వం ఆయుధా గారాన్ని రక్షించడానికి మాత్రం తగినంత బందోబస్తు చేయలేక పోయింది. అందుచేత శత్రువులయొక్క బాంబులకు గురికావ డానికి అవకాశం కలిగింది. పాప్యులర్ ఫ్రాంటు ప్రభుత్వ సైనికులు వీధుల్లో పోరాడడానికి గొప్పప్రసిద్ధి. అందు

వల్ల విద్రోహులు మాడ్రిడ్‌లో ప్రవేశించటమే తటస్థిస్తే, ప్రభుత్వసైన్యం చేతుల్లో మంచి అరువైన దెబ్బతింటారని వాడుక పుట్టింది. మాడ్రిడ్‌లో యేయూాలల్లో గొప్ప గొప్ప మేడలు ఉన్నవో, అవన్నియు ఖాళీచేయించి వాటిలో సైనికులను ఉంచి, వారికి కావలశిన ఆహారపదార్థములు, మందుసామాను ప్రభుత్వాధి కారులు నిలువచేశారు.

మాడ్రిడ్ విద్రోహులతో ఢీకొనడానికి తయారవుతు, రానున్న మహా విపత్తును ఎదురాడడానికి సిద్ధపడుతుంటే, విద్రో హులు, మాడ్రిడ్‌కు దక్షిణంగా సమీపంలో యున్న 'టొలిడో' నగరాన్ని ముట్టడించి, దానిలో ప్రవేశించారు. 'టొలిడో' యొక్క ముట్టడివల్ల మాడ్రిడ్ చాలా నష్టపడ్డది. ఏలనన మాడ్రి డ్‌నకు వెళ్లుగోడ్డును, 'టాగస్' కనుమలను, 'టొలిడో' నగరం కలుపుతూ, మాడ్రిడ్‌నకు గుండెకాయవంటి ప్రధాన రక్షణ స్థానం ఆక్రమించుకున్నది. విద్రోహులు గెల్చిన 'అల్కాజార్' కోటను రక్షించుటకై నియమింపబడిన సైనికులను యుద్ధరంగం లోక్ పంపుటకై వేరొక సైనిక దళాన్ని కోటదగ్గరకు ఫ్రాంకో పంపాడు. ఫ్రాంకో వెంటనే మాడ్రిడ్‌మీాదికి నూకుటకు సేన లను ఆయత్తం చేశాడు. రానున్న మహాప్రమాదాన్ని తెలుసుకొని, ప్రతికార్మిక, కర్షకుడు, యువకుడు, స్త్రీ, యావన్మంది తమ సర్వ స్వాన్ని వెనుకముందు చూడక త్యాగం చెయ్యడానికి నడుము కట్టుకున్నారు. వారు ప్రధానంగా ప్రేమించినది ధనం, బంధు వులు, మిత్రులును గాదు; భార్యాపుత్రులును గాదు; అంతకంటెను, అన్నిటికంటెను అతీతమయిన స్వాతంత్ర్యాన్ని, ప్రజాప్రభుత్వాన్ని వారు ప్రేమించింది. దానిమీాదనే వారి సమస్త సుఖాలు, సమస్త ఐశ్వర్యాలు ఆధారపడి ఉన్నాయి.

అన్ని యుద్ధరంగాల్లో కాబ్రేమేస్ కాశెల్లెశో, యితర సైన్యాధికారుల సహకారంతో ఉద్రేకమయిన ఉపన్యాసాలవల్ల వారి స్వాతంత్ర్య దీక్షను లక్షలరెట్లు యినుమడింప చేశారు. ప్రభుత్వ సైన్యానికి సరియైన మిలిటరీ శిక్షణమాత్రం లేకపోవటం తటస్థించింది. దానికి కారణాలు లేకపోలేదు. యుద్ధం బయలు దేరక పూర్వం మామూలుగా ప్రభుత్వంక్రిందనున్న సైన్యానికి క్రమమయిన శిక్షణ ఉండేదే. కాని ఫ్రాంకో 'మూరు' లను, జర్మనీ, ఇటలీ పటాలములను తెప్పించి యుద్ధం చేయించటం యెప్పుడు ఆరంభించాడో, ప్రభుత్వంగూడా ప్రజాసామాన్యాన్ని యుద్ధంలోకి దింపాలసొచ్చింది. యుద్ధారంభంలో వారికి క్రమ శిక్షణనిచ్చి, నిపుణులైన సైనికులుగా తయారుచేసే వ్యవధి దొరకిందికాదు. ప్రతి క్షణం ప్రాణసంకటమే. ప్రతి నిముషం ఒక యుగమే. ఇప్పుడిప్పుడు రష్యా, ఫ్రెంచి, ఇంగ్లండు సైనికోద్యోగులను నియమించి లక్షల ప్రజలకు ప్రతి నిత్యా, క్రమమైన శిక్షణ, నవీన మారణాస్త్రముల ప్రయోగమును నేర్పించుచు శత్రువులకన్న మిన్నగా తయారు చేయిస్తున్నారు. ప్రభుత్వబలానికి యింకొక లోపంగూడాఉంది. చాలినన్ని నవీన మైన ఆయుధసామగ్రులు లేవు. విద్రోహులు, శిక్షణపొంది తయారైయున్న విదేశసైనికదళాలమీద ఆధారపడియున్నారు. అదీ కాక, ముఖ్యమయిన జర్మనీ, ఇటలీ యుద్ధవిమానాల సహాయం వారికి పూర్తిగాఉంది. ప్రభుత్వసైనికులు అందరును ఉత్సాహవంతులును, ధైర్యవంతులును, స్వార్థత్యాగులను మాట నిస్సంశయం. వీరందరుకూడా చాలాముట్టుకు 'ఒవైడో' నుంచి 'సెవిల్లీ' వరకుగల యుద్ధరంగాల్లోను, 'టొలిడో' మొదలు 'బార్సిలోనా' వరకుగల యుద్ధరంగాల్లోను ఫ్రాంకోవంటి నిపుణతగల సేనానాయకుడు లేకుండానే చెదరి చెదరి పోరాడడం

మొదలు పెట్టారు. మాడ్రిడ్ రక్షణార్థం విరుగబడివచ్చుచున్న సైన్యసమూహాలు అనుభవంద్వారానే, యింతకు పూర్వంకంటె, యెక్కువ ధైర్యపరాక్రమాలతో పోట్లాడి అసమానమయిన స్వాతంత్ర్య వీరు లనిపించుకున్నారు.

పోర్చుగల్ దేశం తటస్థవిధానంలో చేరడానికి మొదట నుంచికూడా ఒప్పుకోలేదు. తనఫాసిస్టు గురువులయిన హిట్లర్, ముస్సోలినీలు నడిచిన అడుగుజాడలలోనే నడుద్దామని నిశ్చయించుకొన్నది. కాసేపు విధానం అంగీకరిస్తానని, కాసేపు అంగీకరించనని ఫేచీలుపెట్టి యెటూ తేల్చకుండా కాలయాపనచేశింది. దీనికి తోడుగా, ఇటలీ జర్మనీలు, తాము అంగీకరించిన తటస్థ విధానాన్ని అనుసరించకుండా విద్రోహులకు ఆయుధాలను సేనలను సరఫరా చేయుచూ, తాటస్థ్య విధానాన్ని భగ్నంచేశారు. ఇందులో ఆశ్చర్యపడవలశిన దేమీ లేదు. ఈరకంగా ఆచరిస్తారని అందరూ అనుకున్నదే. అనుమానిస్తూనే యగ్రిమెంటుమీద సంతకాలు చేసుకున్నారు. హిట్లరు ముస్సోలినీలు యెంత మాత్రం గౌరవం నిలుపుకుంటారో చూతామని చేసిన పనికాని, వారియందు పూర్తి విశ్వాసముండి చేసిందికాదు. ఎట్టకేలకు పోర్చుగల్ చేత కూడా ముక్కుకు తాడుపోసి లాగినట్లు, తటస్థ విధాన సంఘంవారు, తటస్థ విధానాన్ని నామమాత్రంగా ఒప్పించారు. కాని మొదటినుంచీ కూడా విధాన సూత్రాలను ఆచరించటానికి నిరాకరించి పెడసరంగా జవాబులిచ్చింది. తటస్థ సంఘంవారు, పోర్చుగల్, ఇటలీ, జర్మనీల యెడల జరుపవలశిన కార్యక్రమాన్ని ఆలోచిస్తుండగానే, విధ్వంసకరమైన జర్మనీ, ఇటలీమారణయంత్రాలు స్పెయిను పసికూనల మీదను, స్త్రీల మీదను, శోభాయమానమగు ఆరామాలు, భవనాలు, చిత్రశాలలు, నాటకశాలలు మొదలయిన వాటిమీదను అగ్నికణాలను కురిపిస్తున్నాయి.

వేనకు వేలు ప్రజలను భస్మీపటలము చేయుచున్నాయి. నిస్సంశయంగా యే మాత్రంకూడా యీ తటస్థ సంధిలో న్యాయం లేదు. ఇదంతా ఇంపీరియలిస్టు దేశాలయిన ఇంగ్లాండు, ఫ్రాన్సు, ఇటలీ, జర్మనీ, పన్నినమాయ, మోసంకాని వేరేమీ కాదు. ఈ రీతిగానే అబిస్సీనియాను ధ్వంసంచేశారు కండ్లారా చూస్తూ. ప్రజాతంత్ర వాదులమంటూ, స్వాతంత్ర ప్రియులమంటూ, బలహీనుల రక్షణార్థం కంకణంకట్టుకున్నామని వీరాలాపాలు పల్కు బ్రిటిష్ యింపీరియలిజం చూస్తూ చూస్తూ అబిస్సీనియాను ఇటలీ పొట్టన పెట్టింది. ఇంగ్లాండు స్వలాభాలకు ముప్పంకలుగు తుందనే స్వలాభాపేక్షతో చేశిన పనే యిది. పిచ్చివాడై, తెలివి తక్కువవాడై, ఇంగ్లండు ఫ్రాన్సులను పూర్తిగా నమ్మినందుకు, అబిస్సీనియా రాజును నట్టేట్లో దించాయి యీ రెండు దేశాలు. ఇక చిన్న రాజ్యముల గతి వాటిదే. ఇంపీరియలిస్టు దేశాలు వాటిని రక్షిస్తవన్నమాట కలలోని వార్త. వీటిమీద ఆధారపడియుండడం ఆత్మహత్యగావించుకున్నట్లే. అబిస్సీనియా ప్రజలు నేడు ఇటలీ దుర్మార్గుల వల్ల అనుభవించుచున్న బాధలు తలుచుకుంటే శరీరం కంపమెత్తుతుంది. వేలకువేలను చిత్రవధ చేస్తున్నారు. వారి దేశంలోనే వారికి నిలువ నీడ దొరకుట లేదు. వెంటబడి తరుముచు నల్ల పురుగు లేకుండా చెయ్యాలని తలచుకొన్నారు ఇటలీ అధికారులు. ఆహాహా! ఏమి పశుబలం! నల్లవారి దేశంలో నల్లవారికే తావీయక కుక్కలను తరిమినట్లు తరుముచు, నల్లులను నలిచినట్లు నలుచుటయా? ఏమి! ఆహా యీ తెల్ల సామ్రాజ్యాధికారుల క్రూరనిరంకుశ విధానం!

ఏమో ఎవరు చెప్పగలరు? స్పెయినునుకూడా ముసోలినీ హిట్లరుల పొట్టపెట్టుకొందురేమో! పాపం, ప్రజలు ముందుముందు చెట్టి బాధలుపడి గుర్మరణం పాలుగావలశి వచ్చునో! అక్టోబరు 7 వ

తారీఖున అనగా మాడ్రిడ్ ముట్టడి ఆరంభించిన ఆరుగోజులకు, సోవియటురష్యా, తటస్థవిధాన సంఘమునకు, ఇటలీజర్మనీలు చేయు చున్న అక్రమచర్యలను, తటస్థవిధానభగ్నాన్ని గురించి, తమనిరస నభావాన్ని ఘాటైనభాషతో సూచించింది. ఇటలీ జర్మనీల మీదను, మోసమునకు తెలపడ్డ ఇంగ్లాండుమీదను రష్యా ఆగ్రహాంయింతింతని చెప్పటానికి వీలులేదు. ఇటలీ, జర్మనీలను చురుకుగా మందలించి ముందైనా విధానాన్ని భగ్నంచెయ్యకుండా ఉంచేటట్టు చేస్తానని వాగ్దానం యివ్వనియెడల, సోవియటు రష్యా సంఘంనుంచి విరమించుకుంటుననియు, నామమాత్రావశిష్ట మయిన సంఘమందు సభ్యరాలుగా నుండుటగూడ దేశగౌరవానికి లోపమనియు, రష్యా తటస్థసంఘానికి తెలియజేశింది. తాము ఇటలీ జర్మనీలమీదవేశిన నేరములను సమర్థించుకోటానికై తార్కాణంగా, యెచ్చరించుటపై రెండు దేశాలు తాటస్థ్యమును ధిక్కరించినవో, స్పెయిన్ విదేశాంగమంత్రి జెనీవాలో చెప్పిన ఉపహాగాలలోనుంచితీసి, తటస్థసంఘానికి వ్రాశింది సోవియటు రష్యా. లండన్‌లో విచారణసంఘంయొగుట సాక్ష్యమునుబట్టియు, ప్రపంచ విఖ్యాతిగాంచిన అనేకమంది పత్రికావిలేఖరుల వాంగ్మూలములను బట్టియు, ఇటలీ, జర్మనీ, పోర్చుగల్ దేశాలు విద్రోహులకు నిండా సహాయంచేస్తున్నవని సోవియటు రష్యా తెలియబరచింది. రష్యా యింకొక్క అచరణయోగ్యమైన సలహాకూడా యిచ్చింది. నిష్పక్షపాతులుగల ఒక సంఘాన్ని స్పెయిన్-పోర్చుగల్ సరిహద్దులకు విచారణనిమిత్తం పంపవలయుననియు, దానివల్ల యే దేశములు విద్రోహులకు సహాయంచేయుచున్నవో తెలుసుకొనవచ్చుననియు చెప్పెను. ఈ సలహాను అనుసరించినయెడల తటస్థ విధానాన్ని ధిక్కరించుటకు పోర్చుగల్ దేశానికి అవకాశం ఉండదనియు, అథవా యే దేశమయినా ధిక్కరించినయెడల దానిపై

కఠినచర్య తీసుకొని తీరవలయుననికూడా తన దృఢాభిప్రాయాన్ని తెలిపింది. సోవియట్ సూచించిన అభిప్రాయాలలో దేనినైనా వెంటనే అమలులో పెట్టకపోయినయెడల తటస్థవిధానం కాగితంమీది మాటయేగాని ఆచరణశూన్యమవుననియు, త్వరలో ప్రమాదస్థితి సంభవించుననియు హెచ్చరించింది.

బెల్జియం సోషలిస్టుపార్టీ సాధారణ సంఘంకూడా తటస్థ విధానాన్ని కఠినంగా దూషిస్తూ, అటువంటి విధానాన్ని అమలులో పెట్టిన దేశాలు, స్పెయిను ప్రజాప్రభుత్వం నాశనం కావటానికి సిద్ధంగా ఉన్నప్పుడు, తాటస్థ్యమునుగురించి యెంతమాత్రం మాట్లాడవీలులేదనియు, తక్షణం స్పెయినుకు సహాయపడవలసిన దనియు, లేనియెడల ప్రజాప్రభుత్వమాత్రం యెడల తీరని అపచారం, అన్యాయం, మోసంచేసిన వారగుదురనియు ఖండలించింది. ఇప్పటికయినా మించిపోయింది యేమీ లేదనియు, ఐరోపాయుద్ధం మరల వచ్చుననే భయమున్నా, వెనువెంటనే స్పెయిన్ ప్రభుత్వానికి ఆయుధాలు, సేనలు పంపి ప్రజాస్వామ్యాన్ని చిరస్థాయిగా చేయమని చాలా తొందరపెట్టింది. తమ యీ గాఢాభిప్రాయాన్ని తెలియజేయుటకు, స్టాలిన్, (సోవియటు రష్యా) బ్లమ్, (ఫ్రాన్సు) బాల్డ్విన్, (ఇంగ్లండు) వాన్ జీలాండ్, (బెల్జియం) లకు టెలిగ్రాములు పంపింది. సోవియటు పత్రికలును, కార్మిక కర్షకులును, ఇటలీ జర్మనీలయెడల తమ నిరసనభావాన్ని వెలిబుచ్చుచు, సోవియటుప్రభుత్వం తక్షణం స్పెయిన్ రక్షణార్థం ఆయుధాలను, మనుష్యులను పంపించి తీరవలయునని ప్రభుత్వాన్ని ఒత్తిడి కలుగచేశారు.

మాడ్రిడ్ సమీపంలోనున్న 'సాంటాక్రజ్ డెల్ రటామార్' అను చిన్ననగరం పట్టుబడింది విద్రోహులచేత. ఈ

నగరం 'మార్క్విడా' నుంచి మాడ్రిడ్‌కు పోవు రోడ్డుకు ప్రక్కగా ఉంటుంది. సాంటాక్రజ్ నుంచి మాడ్రిడునకు వ్యాపార సంబంధమయిన రాకపోకలకు చాలా ప్రసిద్ధి చెందింది. ఇచ్చటనుంచియే యెక్కువగా మాడ్రిడునకు తినుబండారపు సామగ్రి వెళ్లుతుంటుంది. ఈ పట్టణం విద్రోహులవశం కావడంతోటే, రోడ్డుకు దూరంగా ఉన్న మరొక ముఖ్యపట్టణమయిన 'నావల్ కార్నెరో' మీదికి విద్రోహులను దారితీసింది. 'నావల్ కార్నెరో' పతనంవల్ల మాడ్రిడ్ రక్షణాలో ఒక పెద్దబురుజు విరిగిపోయి నంతయింది. మాడ్రిడ్‌లో పరిస్థితులు బహుతీవ్రరూపం తాల్చాయి. శరీరపుష్టి కలిగిన ప్రతిపౌరుడును తనంతటతానే ముందుకువచ్చి స్వాతంత్ర రక్షణకొరకు సైన్యంలో చేరాడు. రిపబ్లికన్ పతాకమునకు తన సర్వస్వం ధారపోస్తానని ప్రతిజ్ఞ తీసుకొన్నాడు. ప్రజలకు రాత్రిళ్లు భయంయెక్కువై నిద్రపోలేక పోయారు. పసిపిల్లలకు నిద్రలుపుచ్చి కండ్లు చిల్లులుపడేటట్లు తల్లులు తెల్లవార్లు మేలుకొని కూర్చోడం సంభవించింది. తెల్లవార్లు, ప్రొద్దుకూకులు హోరున విమానములు, బాంబులమోతవల్ల, ప్రజల హాహాకారాలు, అలజడి, అశాంతి, యెక్కువయింది. శత్రువిమానాలు, పసిపాపలమీద, స్త్రీలమీద బాంబుల వర్షం కురిపించి, వేలకొలది పిన్నపాపలను ముక్కలుముక్కలు చేశాయి. ఈ మాంసపు ముక్కలను తల్లులు చేతుల్లోకి తీసుకొని వీధులవెంట వెక్కి వెక్కి యేడ్చుకుంటూ పోతుండే సమయంలో మరికొన్ని విమానాలు యీ తల్లులమీద కూడా అగ్నివర్షం కురిపించి, భస్మీభూతం చేశాయి. ఈ దుఃఖకరమయిన దృశ్యాన్ని పత్రికా విలేఖరులుచూచేసరికి వారి గుండెలు నీరై పోయాయి. వారి హృదయాలు బ్రద్దలయి పోయాయంటే ఒక్కమాటలో తెలిపోతుంది. వందలకొలది మహోన్నతమయిన భవనాలు, బాంబులు, డైనమెట్ల దెబ్బలకు తునాతును

కలైపోయి, కోట్లపౌనులు నష్టపరచాయి. విశేషించి, కార్మికుల బీదగృహాలు కూలిపోయాయి. వేలమంది కార్మికులు నిస్సహాయులై ఆకలిబాధకు తాళలేక చచ్చిపోయారు. చావగా మిగిలిన స్త్రీలు, పసిపాపలు, కుంటిగ్రుడ్డివారయిన కార్మికసోదరుల తండ్రులు,తల్లులు, పొట్టలుపట్టుకొని, "అన్నమో, అన్నమో" నని అడుక్కొనటం మొదలుపెట్టారు. చివరకు తలదాచుకోడానికగూడా చెట్టుచెట్టుకు, గుట్టగుట్టకు, యింటింటికి పరుగెత్తారు.

"మమ్మల్ని ఊపిరిఆడకుండా నొక్కేస్తున్నారు. ఏలనన, జర్మనీ, ఇటలీలు యిప్పటికిని విద్రోహులకు ఆయుధ సామగ్రిని, సైన్యములను పంపిస్తూనే ఉన్నాయి. ఫ్రాంసు, ఇంగ్లండుమాత్రం మాకు న్యాయంగా చేయవలసిన సహాయం చేయకపోగా, మాకు అన్నివిధాలా విఘాతాలే కల్పిస్తున్నాయి. మేము నిస్సంశయంగా శత్రువుల టాంకులు, విమానాలను, కిర్రలు, కత్తులతోను, కరారులతోను పోట్లాడుచున్నాము," అని 'ఎడింబర్గు'లో సమావేశమయిన కార్మిక మహాసభకు స్పెయిన్నుంచి ప్రతినిధిగావచ్చిన 'సినార్ డి ఆస్యూయా' అనునతడు ఉద్రేకంగా సభలో మాట్లాడాడు. తిరిగి తిరిగి యెన్నిమార్లు సోవియట్ రష్యా తటస్థవిధాన సంఘమునకు హెచ్చరించినను, సంఘం రష్యావారి హెచ్చరికలను లెక్కచెయ్యకపోగా, జర్మనీ, ఇటలీ, పోర్చుగల్ దేశాలు రష్యా యెడల మోపిన అపనిందలకు యెక్కువ ప్రాధాన్యం యిచ్చింది. పోర్చుగల్ రేవులను తటస్థవిధాన సంఘంవారు తనిఖీ చేయించవలశినదని రష్యాకోరగా, కోరినంతమాత్రాననే తటస్థవిధానమును జర్మనీ, ఇటలీ, పోర్చుగల్ దేశాలు, నిజంగా ధిక్కరించినట్లు రుజువు కానేరదని లార్డ్ ప్లిమత్తు, రష్యా సభ్యుడికి జవాబు వ్రాసెను. ఈ సంగతి యావత్తు నిష్పక్షపాత బుద్ధితో విచారించుటకు సభను యేర్పాటుచెయ్యమని సోవియటుకోరగా, ఆ కోరికను

కూడా ష్లిమత్ నిరాకరించాడు. ఫాసిస్టులయెడల పక్షపాత బుద్ధితో వ్యవహరిస్తున్న 'ష్లిమత్' నిరంకుశచర్య, రష్యా ప్రజలను క్రోధావేశులను చేయించటంలో ఆశ్చర్యమేమీ లేదు. తక్షణమే స్పెయినుకు మిలిటరీ సహాయం చెయ్యమని ప్రభుత్వాన్ని ప్రజలు కోరారు. తటస్థవిధానాన్ని న్యాయంగా అన్నిదేశాలు అనుసరించకపోయినందున, సోవియట్ రష్యాలో అనేక పట్టణాలలో కార్మికకర్షకులును, యువకులును, సభలు ఏర్పాటుచేసి వారి నిశ్చితాభిప్రాయాన్ని దాపరికంలేక వెలిబుచ్చారు. ఈ రీతిగానే సోవియట్ పత్రికలుకూడా తక్షణం సహాయం చెయ్యాలని ఆందోళన చేశాయి. బ్రిటిష్ కార్మికసంఘాలుకూడా తటస్థవిధానం యొక్క మోసకృత్యం ఊహించి సభలద్వారా, పత్రికలద్వారా, అర్జీలద్వారాకూడా ప్రభుత్వంతో తమ తీవ్రమయిన నిరసన భావాన్ని ప్రస్ఫుటంగా ప్రకటించారు.

మాడ్రిడ్ చుట్టును, యుద్ధం చెలరేగుతూంది. ప్రజలు భయకంపితులైనారు. భూమ్యాకాశాలు బ్రద్దలవుతాయేమో అన్నట్లుగా బాంబుల మోతలు అతిభయంకరంగా వున్నాయి. విద్రోహులు ముఖ్యపట్టణం సమీపించుటచేతను, శత్రువులకు పూర్తి అపజయాన్ని కలిగించుటకు యుద్ధం తీవ్రంగా జరుపవలసియున్నది. కాబట్టి, స్పెయిన్ ప్రభుత్వం, కాబల్లెరోను సర్వసేనాధిపతిగా నియమించింది. యుద్ధకమిటీ ఒకదానిని స్థాపనచేసి, సైన్యాన్ని, మందుగుండుసామానును, యావత్తు యుద్ధసామగ్రిని ఆ కమిటీ అధీనంచేసింది. మిలిటరీ నాయకత్వానికి, సైనికదళాలకు సఖ్యత, ఐకమత్యత కుదరటానికై ముఖ్యంగా యీ కమిటీని సృష్టించారు. శరీరపటుత్వంకలిగిన ప్రతివ్యక్తిని యుద్ధం చెయ్యవలసినదిగా ప్రభుత్వం ఆజ్ఞాపించింది. కామ్రేడ్ కాబల్లెరోను సర్వసేనాధిపతిగా నియమించడంవల్ల, ప్రజలలో ఉత్సాహం,

వీరత్వం, యుద్ధాసక్తి, వెయ్యి యిబ్బళ్లు అధికమయినాయి. మాడ్రిడ్ విధిలేక, రాబోవు మహావిపత్తునకు ఓర్పుతోను, సహనంతోను, తయారయి ఎదురుగా నిలిచింది. మాడ్రిడ్ రక్షణకు చివర వరకూ వంటరిగాయున 'నావల్ కార్నిరో' యొక్క పతనాన్ని, ప్రభుత్వం ఒప్పుకొన్నది. నావల్ కార్నిరోయొక్క ఓటమి, మాడ్రిడ్‌ను ఒక్కమారు విద్యుచ్ఛక్తి మాదిరిగా విభ్రమం కలిగించి, దానితోపాటుగా ఆవేశాన్నికూడా పురికొల్పింది. ప్రభుత్వం ప్రజలకుచేసిన ప్రకటనలో, మాడ్రిడ్‌యొక్క భవిష్యత్తు ప్రజల చేతిలోనే నున్నదనియు, ప్రపంచమంతటికిని ఆదర్శనీయులనిపించుకొనుటకు మాడ్రిడ్ ప్రజలకుతగిన అవకాశము నేడు కలిగిన దనియు ఎలుగెత్తి చాటించారు. తుపాకుల ధ్వనులు, బాంబుల ప్రేలుళ్లు సమీపానికి వస్తున్నకొలది, స్త్రీ పురుషులు, కార్మిక కర్షక కీర్తనలతోను, యుద్ధగీతములతోను ఆగుచుచు, వీధుల గుండా ఊరేగుతూ, ఉత్సవములలో ఎట్లుండాలతోను. యుద్ధ నినాదములు, గీతములతోను, ప్రజలకు ఉద్రేకం, వీరావేశం జనించేటట్లుగా "శత్రువులు గెలువలేరు-ప్రజలంతా యుద్ధరంగానికి రండు" అను కేకలతోను, సైన్యం వీధులగుండా ఊరేగుచు యుద్ధరంగానికి వెడలిపోయారు. నూతనంగా మరల ఏర్పాటు చేయబడ్డ మంత్రులందరు సమావేశమయి అహోరాత్రాలు, నిద్రాహారాలు లేకుండా భావికార్యక్రమాన్ని గురించి ఆలోచించి దేశప్రజలకు యీ విధంగా సందేశంయిచ్చారు: "స్పెయిన్ దేశీయులారా, రిపబ్లికును రక్షింపుడు. ప్రతి వ్యక్తియును సైన్యంలోచేరి, జయమునకు సహాయపడుడు. శత్రువు మాడ్రిడ్ ద్వారంవద్దకు వచ్చాడు." 'గెడాఫి', 'వల్లికాస్', 'అలాకాల' మొదలయిన మాడ్రిడ్‌నకు పరిసరంగానున్న పట్టణాలన్ని విద్రోహులు ముట్టడించి, మాడ్రిడ్ పొలిమేరలలోనికి ప్రవే

శించారు. ప్రభుత్వం హడావుడిగా నిర్మించినప్పటికని, గత్యా మార్గాలుమాత్రం నవీనపద్ధతులమీద నే కట్టుదిట్టంచేశారు. ప్రభుత్వానికి సంబంధించిన రికార్డులు, యితరసామానులు, మాడ్రిడ్ లో యుంచినయెడల, శత్రువులవల్ల అపాయం సంభవిస్తుం దని తలచి, రికార్డుల తోపాటుగా, మంత్రులుకూడా మాడ్రిడ్ నకు సమీపంలో తూర్పుగా సముద్రప్రాంతముననున్న 'వాలెంషియా' నగరానికి బయలుదేరిపోయారు. వారు వెళ్లునప్పుడు, మాడ్రిడ్ రక్షణానిమిత్తం, ఒక మిలిటరీ గవర్నరును, కొంత సేనను తోడ్పాటుగా నియమించి వెళ్లిపోయారు.

---

# స్పెయిన్ దుస్థితి.

—(౦)—

## సోవియట్ రష్యా ఆగ్రహం.

తటస్థ విధాన నాటకంపట్ల, బ్రిటన్, ఫ్రాంసుచేయు కుతంత్రములను రష్యా యింతకాలమునుంచి సహించుకొని, పైకి పొంగి పొగలివచ్చుచున్న ఆగ్రహాన్ని అణచుకొని, జర్మనీ, ఇటలీల ధిక్కారణమునకు మండిపడుతూ వచ్చింది. చివరకు, యీ విధానం యెందుకూ పనికిరాని కాగితం ముక్కయనియు, దీనివల్ల స్పెయినుకు న్యాయము జరుగకపోగా క్రూరమైన అన్యాయమే జరుగుచున్నదనియు, యీ పరిస్థితులలో చట్టసమ్మతము గా ఎన్నుకొనబడియున్న స్పెయిన్ ప్రజాతంత్ర రాజ్యానికి, విదేశాలనుంచి ఆయుధ సామగ్రి యావత్తు నిరాక్షేపణ గా కొనుక్కొనుటకు పూర్తి అధికారం చేకూర్చక తప్పదనియు, రష్యా యెలుగెత్తి చాటించింది. తటస్థ విధానం, ఫ్రాంసు, ఇంగ్లండుల మాయోపాయాలవల్ల సృష్టించబడ్డ ఒక బ్రహ్మాండమైన కపటవ్యూహమునియు, వారి మోసకృత్యం చివరకు వారినే నాశనంచేయు ననియు తెలియజేసి దీనివల్ల యెన్నెన్ని దుష్కృత్యాలు విద్రోహులచేత ఆచరించబడుచున్నవో చాటింది. సోవియట్ రష్యాయే, తటస్థ విధానాన్ని ధిక్కరిస్తున్నదని, పోర్చుగల్ అలిగి, స్పెయినుతో రాజకీయ సంబంధాన్ని కూడా వదలుకుంది. కొద్దిరోజులు జరిగిన తర్వాత, మాడ్రిడ్‌లోయున్న జర్మనీ, ఇటలీల రాయబారులు 24 గంటల లోపుగా పట్టణాన్ని వదలివెళ్లవలశిన దని స్పెయిన్ ప్రభుత్వం ఆజ్ఞాపించింది. ఇటలీ జర్మనీలతో స్పెయిన్ రాజకీయ సంబంధాన్ని

వదలుకొన్న తర్వాత, ఈ రెండు దేశాలకు విద్రోహులకు సహాయం
చేయుటకు పూర్తిగా సందు దొరకింది.

రెండున్నర సంవత్సరములు మాడ్రిడ్‌లో ఇరుపక్షాలకు విప
రీతమయిన రక్తపాతంతో యుద్ధం తీవ్రంగా జరిగింది. రెండు
పక్షాలవారికీ పట్టుదల, ఉత్సాహం అధికమయింది. ముస్సోలినీ హిట్లర్లు
ప్రభుత్వానికి ఆయుధాలు, మందుగుండుసామాను చాలకపోయి
నను, జర్మనీ ఇటలీలు విద్రోహులకు అనవరతం సహాయం చేయు
చుండటంవల్ల, రష్యా, మెక్సికో దేశాలు స్పెయినుకు సహాయం
చేయుట తమ విధ్యుక్త ధర్మమనియెంచి పూర్తిగా సహాయపడ్డాయి.
విమానాలు, బాంబులు, తుపాకులు, షెల్లులు మొదలయిన ఆయుధ
సామగ్రియు, వేలకొలది వ్యక్తిగతముగా సైనికులును గవర్న్
మెంటు పక్షాన వచ్చిచేరారు. విదేశములనుంచి అనేక సైనిక
దళాలు, స్పెయిన్ ప్రభుత్వమునకు సహాయంగా వచ్చి యుద్ధం
చేశాయి. బ్రిటన్‌నుంచి, సుప్రసిద్ధ కమ్యూనిస్టు రచయితయు,
యువకుడును అగు కామ్రేడ్ 'రాల్ఫ్ ఫాక్స్' అను వీరశిఖామణి,
ఒక దళనాయకుడై, స్పెయిను యుద్ధరంగంలో ప్రభుత్వపక్షాన
హోరాహోరిగా పోరాడి యిటీవలనే చనిపోయాడు. ఇంగ్లాండు
నుంచి 'సక్లత్ వాలా రెజిమెంటు' అను ఒక దళాన్ని, సుప్రసిద్ధ
కమ్యూనిస్టు నాయకుడును, భారతీయుడును అయిన "కా. సక్లత్
వాలా" జ్ఞాపకార్థం యేర్పాటుచేసి, స్పెయిన్ ప్రభుత్వానికి
సహాయంగా పంపారు. 'ఆటోక్రా బాస్క్వేరు'లోను, 'కాస్టెడిలి
యన్' అను ప్రదేశంలోను విద్రోహులు ప్రయోగించిన బాంబులు,
విషవాయువులు, షెల్లులవల్ల లెక్కించలేని ద్రవ్యనష్టం కలిగింది.
'కోర్టెస్ స్క్వేరు'లో భవనాలకు శత్రువులు నిప్పంటించారు.
'సాన్ కార్లస్' అను రాష్ట్రవైద్యశాలలను, 'సావాయ్ హోటలు'ను
కూడా అగ్నిహోత్రం పాలుచేశారు. గవర్నమెంటు 100,000 మంది

సైన్యంతో అత్యంతోత్సాహం వెల్లి విరియుచుండగా, మాడ్రిడ్‌ను రక్షిస్తూనే యున్నారు. ఫ్రెంచి రాయబారి కార్యాలయం సమీపానికి మంటలు వ్యాపించాయి. ఓడిపోతామని ప్రభుత్వానికి తెలిసినప్పటికి, ధైర్య సాహసాలతో రష్యా మెక్సికోలనుంచి వచ్చి పడుచున్న సహాయంవల్ల ద్విగుణీకృతోత్సాహంతో ప్రజలు పోట్లాడారు. కొన్నిరోజులకు ప్రభుత్వ బలమే అధికమయి, ఫ్రాంకోను ఉద్రేకాత లూగించింది.

## ఫ్రాంకో బెదరింపు.

రిపబ్లిక్ సైన్యంతో పోరాడి, జయించుటకు సందేహించి, ఫ్రాంకో యిత్యాగులు, బ్రిటన్, ఫ్రాంసు, యింకా యితర దేశాల యొక్క ఓడలను స్పెయిను తూర్పు సముద్రతీరాలకు వ్యాపార సంబంధంతో వచ్చినను, అనుమానం తగిలినయెడల ముట్టడిస్తామని భయపెట్టారు. బార్సిలోనాకు విదేశాలనుంచి స్పెయిన్ సహాయార్థం యుద్ధసామగ్రి వచ్చుచున్నదనియు, దానిని ఆపుచేయుటకు గాను, అనుమానంతోచిన ప్రతి ఓడనుకూడా ముట్టడించెదమని ప్రకటించారు. బ్రిటన్, ఫ్రాంసుదేశాలు ఫ్రాంకో హెచ్చరికలకు కోపగించుకొని భయపడ్డాయికూడాను. ఫ్రాంకో యీ విధంగా భయపెట్టడానికి కారణం యిది. స్పెయిన్ తూర్పుప్రాంతముల యందుగల సముద్రపు రేవులను తను స్వాధీనంచేసుకొని, ఓడలమీది నుంచియే స్పెయినును ముట్టడింప దలచుకొన్న, పన్నినపన్నాగం యిది. జర్మనీ, ఇటలీలు "ఫ్రాంకో గవర్నమెంటును" అంగీకరించాయి. ఇటలీ తన యంగీకారాన్ని తెలుపుతూ, స్పెయిన్‌లో చాలాభాగం ఫ్రాంకో ఆధీనంలో నున్నదనియు, పరిస్థితులను బట్టి విచారిస్తే, యితర స్థలాల్లో, బాధ్యతగల స్పెయిన్ ప్రభుత్వాధికారం చెలాయించు ప్రతినిధి లేడనియు, కాబట్టి త్వరలో, ఆ ప్రదే

శంకూడా ఫ్రాంకో అధికారంగ్రహించుటకు తప్పక వచ్చునని యు, ఈ సందర్భంలో, ఇటలీ ప్రభుత్వం "ఫ్రాంకో ప్రభుత్వం" తప్ప యితర అధికారాన్ని యెంతమాత్రం అంగీకరించదనియు తెలియ చేసింది. అంగీకారసూచనగా, ఇటలీ, జర్మనీలు ఫ్రాంకో ముఖ్య స్థానమయిన 'బర్గోస్' పట్టణానికి, రాయబారులనుకూడా పంపుచూ, ఫ్రాంకో సేనానికి, యితర ఇటాలియన్, స్పెయిన్ ఫాసిస్టులను, వారి యుద్ధ సైన్యానికిని, జయపరంపరలకును, అభినందించుచు సందేశాలు పంపాయి.

యుద్ధం మరింత తీవ్రత చెందుచున్నకాలమున, మాడ్రిడ్ లో ఆహారవస్తు సమస్య ప్రభుత్వానికే కాక, సైనికులనుకూడా చాలా చిక్కుపెట్ట సాగింది. ప్రజలు తిండిలేక మాడిపోవలసివచ్చింది. చివరకు యుద్ధరంగంలోని సైనికులకుగూడా తిండి చాలక పోయింది. ఈ విపత్తునుంచి ప్రజలను తప్పించుటకును, సైనికులకు కడుపునిండా బలమైన ఆహారమును సంపాయించి యిచ్చుటకును, ప్రభుత్వం ప్రజలను (యుద్ధం చెయ్యనివారిని) మాడ్రిడ్ నుంచి మోటార్లలోను, రైళ్లలోను, యితర స్థలాలకు తీసుకొని దిగవిడిచే ఏర్పాట్లు జరూరుగా సాగించింది. దీనివల్ల సైనికులకు తమ బంధుమిత్రాదుల యెడల, ఆందోళనా చాలావరకు తగ్గి, అధికోత్సాహంతో యుద్ధంచేశారు. ప్రజలు మాడ్రిడ్ లోనుంచి బయటికి వెళ్లునప్పుడు, వారు, స్నేహితులును, బంధువులయిన సైనికులను తలచుకొని బహుదుఃఖించారు. మళ్లీ వారిని చూస్తామనే ఆశ వారికి పూర్తిగా అంతరించింది. యుద్ధం తీవ్రంగాసాగి క్రూర కృత్యాలు ఎక్కువయిన తర్వాత అమెరికా ప్రభుత్వం టెలిఫోను ద్వారా మాడ్రిడ్ లోని తమ రాయబారిని మాడ్రిడ్ వదలి వాలెన్షియాకు చేరవలసినదని తెలియచేసింది.

మాడ్రిడ్‌లో యెక్కడ చూచినా చిత్రవధలే, యెచ్చట
వినినను ఏడుపులు, పెడబొబ్బలే. ఏ మారుమూల తిలకించినా
స్త్రీలు, పసికూనలతో, వెక్కి వెక్కి యేడ్చువారు, కండ్లుపోయి,
కాళ్లుపోయి, ముక్కలైపోయి, చేతులుపోయి పరుగెత్తుటయే.
ఆకాశమునకు అంటుకొను మంటలు, పొగలు, నడుమ నడుమ ఝుణా ఝుణా
గునరు బాంబుప్రేలుతలు, డైనమైట్ల ధ్వనులు, తుపాకుల కాల్పులు,
విమానాలు హోరుహోరుగ చప్పుళ్లు చేయుట, ఇరుకక్షల యుద్ధ
విమానాలు ఒకటి వెంట నొకటి తరుముకొని వెళ్లుట — ఈ రకంగా
మాడ్రిడ్‌లోను చుట్టుప్రక్కల ప్రదేశం భీభత్సభయానకంగా
ఉన్నాయి. ప్రజలను భయకంపితులను చేయుటానికై, కాళ్లు,
ముక్కులు, చేతులు తెగిన శవాల్ని ఒకదానిని విద్రోహ సేనానాయ
కుడు ఒక విమానంనుంచి పట్టణం మధ్యలో పడవేశాడు. దాని
వెంటనే వేలకొలది స్త్రీలను, పసిబాలురను చిత్రవధ చేసి, యిండ్ల
లోనికి జొరబడి, విద్రోహులుచే పట్టుబడ్డ ప్రదేశాల్లో, కార్మిక
కర్షకులను గుంపులుగుంపులుగా కాల్చి చంపడం మొదలుపెట్టారు.
ప్రపంచమంతా యీఫాసిస్టు దురాగతాలను విని ఆగ్రహం చెందింది.
ఫాసిస్టు హంతకులు ఆచరించిన దుష్కృత్యాలను ఒకటివెంట ఒకటి
వ్రాసిన యీ గ్రంథంకూడా చాలదేమో నని అనుమానం వేస్తుంది.
స్పెయిన్ ఒకవేళ ఫాసిస్టుల చేతుల్లోనే పడితే, యింకెంతగా వారి
కృత్యాలు యిప్పటికన్నను, మునుపటికన్నను మితిమీరుతవో
పాఠకమహాశయులే వూహించుకొందురుగాక. మాడ్రిడ్ విశ్వ
విద్యాలయ ప్రాంతానికి వచ్చినతర్వాతి విద్రోహులకును, ప్రభు
త్వానికిని పోరాటం అత్యంత భయంకరరూపం తాల్చింది. ఇరు
పక్షాలు జయం మాకబ్బింపంటే, మాకబ్బిందని ఆసుర్దాలో
పత్రికల్లో ప్రకటించుకున్నారు. విషవాయుప్రయోగం విరివిగా
జరిగింది. ప్రభుత్వసేనలు, విషవాయుప్రయోగంవల్ల కలిగే బాధల

నుంచి విముక్తులు కావటానికి సాధనాలను ఉపయోగించు కుంటు న్నారు. స్పెయిన్ యుద్ధం త్వరలో ముగియుటకు గాను, బ్రిటిష్, ఫ్రెంచి ప్రభుత్వాలు, మధ్యవర్తులు సోక్యం పుచ్చుకొని గౌరవ ప్రదమైన సంధి రెండుపార్టీలవారికిని ఏర్పాటు చేయుగ్గామని అభి ప్రాయాలు సూచించాయి. విశ్వవిద్యాలయ ప్రాంతమందు మూడు మాసాలకుపైగా యుద్ధం ప్రచండంగా జరిగినను, యే పర్యవ సానం తేలలేదు. పై చెప్పిన సంధిసూచన లేవనగా. నిష్పక్ష పాతబుద్ధితో మధ్యవర్తిత్వం వహించి, న్యాయంగా యుద్ధసమస్యను పరిష్కారం చేయుట. రెండవది యుద్ధవిరామం (Armistice) ఏర్పాటుచేసి ప్రకటించుట. మూడవది ప్రజలనుంచి రెండు పక్షాలవారిలో ఏ పక్షంవారు తమకు అనుకూలురో ఓట్లనుతీసుకొని నిర్ణయంచేయుట. సోవియటు రష్యా యీ మూడు సూత్రములకును తత్క్షణమే తన అంగీకారం తెలియచేసింది. తక్కిన దేశాలుకూడా దీనికి అంగీకరించేటట్లయితే, అమెరికా సంయుక్త రాష్ట్రాలును, యితర దక్షిణ అమెరికా రిపబ్లికులును కలసి మధ్యవర్తిత్వం వహిం తురని ఏర్పాటు గావింపబడ్డది. ప్రథమంలో జర్మనీ, ఇటలీ, పోర్చుగల్ దేశాలు యీ సూచనలను ఆలోచించుటకు కొంత వ్యవధి కావలసినదని కోరినమీదట ఆ కోరిక అంగీకరింపబడ్డది. మొదట రెండు దేశాలు, తమకు విద్రోహులతో నున్న దీర్ఘసంబంధంవల్లను, వారికి ఉత్తరోత్తరా రాబోవు లాభాలవల్లను అంత తృప్తికరంగా జవాబు యివ్వలేదు. ఈ జవాబులో ఉపయోగించిన భాషనుపట్టి చూస్తేకూడా, విద్రోహులయెడల వీరికుండే గాఢాభిమానం ప్రకటితమయింది. పోర్చుగల్ యీ సూచనను అసలే అంగీకరించ లేదు.

ఇక రెండోపద్ధతి. స్పెయినుకు యితర దేశాలనుంచి విద్రో హులకుగాని, ప్రభుత్వానికగాని సహాయం రాకుండా అడ్డుపెట్టా

లని "అంతర్జాతీయ నావిక కాపలా", (International Naval Patrol) అనునొక పద్ధతిని తటస్థవిధాన సంఘం ఆచరణలోనికి తీసుకొనివచ్చింది. కొన్ని కొన్ని సరిహద్దులను తటస్థవిధాన సంఘం నిర్ణయించి, ఇంగ్లండు, రష్యా, ఫ్రాంసు, ఇటలీ, బెల్జియం దేశాలకు ఒక్కొక్క దానికి కొంత 'స్థలపరిమితి' ని నిర్ణయించి, వాటిలో పై దేశాలవారిని కాపలా చేయవలసినపని నియమించింది. విద్రోహులకుగాని, ప్రజాప్రభుత్వానికిగాని, యితర దేశాలు సహాయం బహిరంగంగాని, పరోక్షంగాగాని చేయుచున్నట్టు తెలిసిన యెడల, వెంటనే పైదేశాలు, తటస్థవిధాన సంఘమునకు తెలుపవలయునని కోరారు. ఈ నిర్ణయానికి వచ్చేటప్పటికి షుమారు రెండుమాసాలు పట్టింది. ఎవరయినా సహాయపడ్డట్టు తెలిసిన యెడల, వారిని అరెస్టుచేసి ఓడలను వశపర్చుకొనడానికి యీ కాపలాదారులకు హక్కు కలుగచేయలేదు. అట్టి హక్కును కలుగచేయనంతవరకు యెన్ని నూతన విధానాలు అమలులోనికి వస్తేనేమి? ఎన్ని సిద్ధాంతాలను గురించి గంభీరంగా ఉపన్యాసాలిస్తే నేమిప్రయోజనం? నీతికి నిలవబడితే ఒక్క న్యాయసూత్రం చాలు అనుసరించటానికి. ఈ పద్ధతి అమల్లోకి వచ్చినతర్వాతకూడా మొరాకోలోగాని, స్పెయినులోగాని ఇటలీసైన్యం మొత్తం 120,000 వున్నది. జర్మనీసైన్యం అంతలేకపోయినా, మొత్తం మీద విద్రోహులకు ప్రబలమైన అండగానే ఉంది. బ్రిటిష్‌పార్లమెంటులోను, యితరచోట్లను, ప్రభుత్వాన్ని, ఇటలీసైన్యమును, జర్మనీసైన్యమును స్పెయినునుంచి వెడలగొట్టే ఏర్పాట్లు చేస్తున్నారా అని కార్మికసభ్యులును, లిబరల్, కమ్యూనిస్టుసభ్యులును ప్రశ్నలు వేసినప్పుడు, 'ప్రయత్నాలు జరుగుచున్నా' యని, ఎప్పటి మోస్తరుగానే గోడమీదపిల్లి వాటంగా జవాబిచ్చారు ప్రభుత్వపక్షం వారు.

# స్పెయిన్ దుస్థితి.

——(o)——

## "విదేశ స్వచ్ఛంద సైనికులు" (వాలంటీర్లు)

జర్మనీ, ఇటలీ, ఐర్లాండులనుంచి పూర్తిగా విద్రోహులకు సహాయం చేయుటకును, ఫ్రాంసు, ఇంగ్లాండు, సోవియెటురష్యాల నుంచి స్పెయిన్ ప్రభుత్వానికి తోడ్పడుటకును, అనేకవేలమంది 'వాలంటీర్లు' స్పెయినులో దిగారు. బ్రిటన్, ఫ్రాంసుదేశాలు యీ విధంగా యిరుకక్షులవారి సహాయంకొరకు స్పెయినుకువెళ్లుతున్న వాలంటీర్ల చర్యలను ఆలోచించి, దీనివల్ల గొప్ప ప్రమాదమైన పరిస్థితులు సంభవిస్తాయని ముందుగా కనుక్కున్నారు. తమదేశాల్లో వాలంటీర్లను స్పెయినుకు పోకుండా కట్టుదిట్టం చెయ్యవలశినదని, ఇతర ప్రభుత్వాలలో, ఇంగ్లండు, ఫ్రాంసుదేశాలు తెలియపరచాయి. ఇంగ్లండు ఫ్రాంసులకు, ఇటలీ, జర్మనీలనుంచి సమాధానం వచ్చేలోగా స్పెయిన్‌లోదిగే వాలంటీర్ల ప్రవాహం అధికమై, ఆపుటకు కష్టమయింది. జర్మని, ఇటలీలనుంచి ఒకవైపునా, రష్యానుంచి ఒకవంపా, అనేలవేలమంది సైనికులు దుస్థితిలో మునిగియున్న స్పెయినుకు తండోపతండాలుగా పంపబడ్డారు. విద్రోహసైన్యంలో, స్వదేశీయులకంటే, యెన్నో రెట్లెక్కువగా విదేశసైనికులు మాడ్రిడ్‌ముట్టడిలో పాల్గొన్నారు. ముట్టడింపబడుచున్న మాడ్రిడ్‌లో రష్యన్ వైమానికులును, యిన్నిశాస్త్రాలలోను ఆరితేరిన నిపుణులును, సైనికులును, సైన్యాధికారులును, అనేకవేలమంది స్పెయిన్‌ప్రజలతోపాటు తాముకూడా పట్టణాన్ని అహోరాత్రం ఎడతెగక రక్షణచేయుచునే యుండిరి.

ఫ్రాంసు, ఇంగ్లండులకు యీ పరిస్థితులు చూచేటప్పటికి, చాలా ఆందోళన కలిగింది. స్పెయిన్ ప్రభుత్వం జర్మనీ ఓడలను 'పట్టుకొన్న' దనే నెపంమీద, జర్మనీ నావికులు స్పెయిన్ వ్యాపారపు టోడలను వశపరచుకొన్నారు. దీని విషయమై అనేక దేశాలు, అనేకమంది వ్యక్తులు, వివిధాభిప్రాయాలు సూచించినా, స్పెయిన్ జర్మనీ నావలను పట్టుకొనడంలో పూర్తి న్యాయమున్నది. ఏలనన అవి విద్రోహులకు యుద్ధ సామగ్రిని తీసుకొనిపోవడం తటస్థించిందని సాక్ష్యంవల్ల తేలింది. జర్మనీ యొక్క యీ దుడుకు చర్యలవల్ల ప్రపంచ శాంతికి భంగం వాటిల్లింది. ఇటలీ జర్మనీలు ఎన్ని ధర్మపన్నాలు చెప్పుతూ, స్పెయిన్ విషయాల్లో తాము జోక్యం పుచ్చుకోమని వ్యర్థ ప్రలాపాలు ప్రేలినా, వారు బహిరంగా విద్రోహులకు చేయుచున్న సహాయాన్ని బట్టి విచారిస్తే ఫ్రాంకోయెడల విశ్వాసంవల్లగాని, అంతకన్న యెక్కువ సహజమయిన తమస్వలాభాలవల్ల గాని తమ యావచ్ఛక్తిని వినియోగించి, తాము నాశనమైనాసరే, స్పెయినులో సోషలిష్టు ప్రభుత్వాన్ని స్థాపించనీయకుండా చేతామనే ప్రతిజ్ఞ పూనారు. జర్మనీ, ఇటలీలు యీ కలహ కారణమయిన విధానాన్ని ఇంగ్లండు, ఫ్రాంసుల వద్దనుంచి ఖండితంగా, "నీవు ఆగవలశినది; ఇక మేము ఊరుకోము" అను జవాబు వచ్చేటంతవరకు సాగిస్తారేమో నని అనుమానంగా వుంది. అట్టి ఖండితమయిన జవాబువచ్చే సూచనలు యింతవరకు గోచరించడం లేదు. జర్మనీ, ఇటలీ, పోర్చుగల్ దేశాలు, యెంత తొందరపడి విద్రోహులకు సహాయంచేస్తూ, బ్రిటిష్, ఫ్రెంచి ఓడలను అనేక పర్యాయాలు కాల్చినాకూడా, చివర రెండు దేశాలు యింత తాలిమి వహించటానికి కారణంలేకపోలేదు. ఫ్రెంచి డెమాక్రాటిక్ పక్షంవారు స్పెయిన్‌లో జరుగుచున్న ఫాసిస్టు అత్యా

చాలాలకు జవాబు చెప్పలేక మౌనముద్ర వహించారు. వారు ధైర్యంతో నిలవబడి, ప్రభుత్వంతో పోట్లాడి, స్పెయిన్ దేశానికి సహాయంచెయ్యమని ఒత్తిడికూడా చెయ్యలేరు. ఇంగ్లాండులో అధికసంఖ్యాకులు స్పెయిన్ వ్యవహారాల్లో విదేశీయులు జోక్యం పుచ్చుకునే పరిస్థితులు దాటి పోయినవని అభిప్రాయ పడ్డారు. కార్మిక నాయకులు పార్లమెంటులోగాని, బయట జరిగిన సభల్లోగాని యెంత నోరుపెట్టుకొని అరచినా ప్రభుత్వంలో వారికి బలమైనస్థానం, పలుకుబడి లేకపోవుటవల్ల, వారి మాట అంతగా సాగింపబడలేదు. ఇంతకూ ఫ్రాంసు, ఇంగ్లండులు రెండు కూడా ఒకదాని కొకదానికి ముడివేసుకొని, యూరపు యుద్ధమునకు భయపడి, తటస్థ విధానంతోటే స్పెయిను ప్రభుత్వాన్ని సంతోష పరుద్దామనుకొని, దానిని నట్టేట్లోదింపాయి. ప్రజాస్వామ్యసూత్రాలనే మంటపాలు చేశారు. ఏప్రభుత్వంలో నయినా ప్రజాసామాన్యంయొక్క యోగక్షేమంకోరే కార్మిక నాయకులు బలవత్తరమయిన స్థానం ఆక్రమించే యెడల, వారు యిచ్చే సలహాలు, వారు అమలులోపెట్టే విధానాలు, కార్య రూపం తాల్చి, 9 మాసాలనుంచి అవిచ్ఛిన్నంగా సాగుతున్న నాజీ, ఫాసిస్టు దండయాత్రలను ఎప్పుడో అరికట్టేవారు.

ఇటీవలనే మెడిటరేనియన్ మహాసముద్రంలో ఇంగ్లండు, ఇటలీలకుగల హక్కులను ఒప్పుకొని, వాటిని కాపాడుకోటానికై రెండుదేశాలమధ్య ఒక సంధినికూడా ఏర్పరచుకున్నారు. కేవలం యీసంధి కాగితాలమీదనే ఉంచకుండా, దానిని రెండుదేశాలు కూడా గౌరవంగా అనువర్తించాలనికూడా నిశ్చయించుకున్నారు. అదికాకుండా స్పెయినుయొక్క సంపూర్ణమైన దేశాధికారాన్ని గౌరవిస్తాననికూడా ఇటలీ ఒప్పుకొన్నది. కాని యీసంధి జరు

గుట్టుగా ఉండగానే, వేలమంది ఇటలీ, జర్మనీవాలంటీర్లు 'కాడిజ్'
రేవువద్ద దిగి స్పెయిన్‌లోకి ప్రయాణమయ్యారు. తటస్థవిధానంలో
తాను సభ్యత్వం వహించి, ప్రతిసూత్రాన్ని తక్కిన దేశాలతో
పాటుగా ఆమోదించి, స్పెయిన్ యుద్ధాన్ని అంతమొందించుటకు
యితరులతో ప్రయత్నం చేయ నిశ్చయింపక, ఇటలీ సైనికులనే గాక,
నూతనంగా తమ బానిసలుగా చేసుకున్న అబిస్సీనియా సోదరులను
సహితం బలవంతంగా విద్రోహులకు సహాయం పంపుతూ అన్నిటి
కిని తెగించి, ఫ్రాంకో సేనానికి జయం చేకూర్చవలయునని ముస్సో
లినీ స్థిరమైన అభిప్రాయం కలిగియున్నాడు. నిస్సంశయంగా
యీ అభిప్రాయమే జర్మనీకి కూడాను. ఈ పరిస్థితుల్లో నిష్పక్ష
పాతియైనవాడుగాని, స్వాతంత్ర్యప్రియుడైనవాడుగాని, యెవ్వ
డును తటస్థవిధాన సంఘంనుంచి సోవియట్ రష్యా విరమించుకొని
స్పెయినుకు సహాయం చేయతలచుకొన్నదంటే, ఆశ్చర్యపడ
కూడదు. ముమ్మాటికిని, రష్యా స్పెయినుకు అన్నివిధాలా సహాయం
చెయ్యవలసినదే. ఫాసిజం, ఇంపీరియలిజాలను ఇతర నిజమైన
ప్రజాప్రభుత్వాల బలవత్తరమయిన సహాయంతో కూకటివేళ్లతో
సర్వనాశనం చెయ్యాలసిందే. ఆనాడే కష్టజీవులకు, స్వాతంత్ర్యో
పాసకులకు సుదినం. సోవియట్టు రష్యా యీ యుద్ధంలో
ప్రధానపాత్రవహిస్తే, యితర యూరపియన్ దేశాలు రంగస్థలం
లోకి జొరబడకతప్పదు. సోవియట్టును అవకాశం చిక్కినప్పుడు
కబళిద్దామని కాచుకొన్న ఇంపీరియలిస్టు ఫాసిస్టుదేశాలు, రాబోవు
యూరపియన్ యుద్ధంలో అవకాశం చిక్కిందికదా అని, అగ్ని
హోత్రంలో పడు మిడుతలమాదిరి మలమలమాడకపోరు. ఇంకో
ప్రపంచ మహాసంగ్రామం మనకు చెప్పకుండానే మనపై విరుచు
కుని పడకమానదు. ఇంతకు ముఖ్యమయిన విషయం : సెంట్రల్
యూరప్‌లోని ముఖ్యదేశాలయిన ఇటలీ జర్మనీలు కౌగితం మీద

అగ్రిమెంటుకు సంతకాలు పెట్టడమే కాని, వాలంటీర్లను స్పెయినుకు పోకుండా ఆచరణరూపంగా మాత్రం చెయ్యవు.

బ్రిటిష్, ఫ్రెంచి ప్రభుత్వాలు సూచించిన ప్రకారం, ఇటలీ, జర్మనీ, పోర్చుగల్ దేశాలు అంతర్జాతీయ నావికా కాపలా పద్ధతికి విధిలేక ఒడంబడినా, కొలది కాలంలోనే యీ పద్ధతి విచ్ఛిన్నమయింది. విద్రోహులకు యెడతెరిపి లేకుండా, పూర్వం కంటె ఎక్కువ బలగం జర్మనీ ఇటలీలనుంచి రవానా అవుతూనే వుంది. ఇటీవల స్పెయిన్ మంత్రివర్గం మారిన తర్వాత, యుద్ధ తీవ్రత మరింత హెచ్చి, ప్రజా సామాన్యంలోను, సైనిక శాఖ లోను గెలుపునందు పట్టుదల వెయ్యి యిబ్బళ్లు అధికమయింది. ''డూచ్‌లాండ్'' అను జర్మన్ యుద్ధనౌక 'బేలరిక్' ద్వీపము లలో నొకటి యగు ''ఇవిజా'' సముద్రతీరాన మకాం వేసింది. పైగా 'ఇవిజా' ఫాసిస్టుల ఆధీనంలో వున్నది. మామూలు ప్రకా రంగా స్పెయిన్ ప్రభుత్వ విమానాలు, స్వదేశ రక్షణార్థమై, అపాయాలనుంచి తప్పించుకొనుటకు ఆ ప్రదేశ మంతటను పరీక్ష చేసుకొనుటకు చట్ట సమ్మతంగా అధికారం కలిగియున్నాయి. అదీగాక, యీ ఇవిజా ద్వీపకల్పం ఫ్రెంచి ప్రభుత్వం తనిఖీక్రింద నున్నది. ఈ పరిస్థితుల్లో, విద్రోహులకు అండగాయుండి పూర్తి సహాయం యిచ్చుటకు తప్ప వేరు ఉద్దేశంలో జర్మను నౌక అచ్చట దిగియుండలేదు. కాపలా చట్ట ప్రకారం నిర్ణయం చేసేయెడల, యీనావ అచ్చట వుండుటకే అధికారంలేదు. జర్మన్ ప్రభుత్వం చట్టాన్నే ఉల్లంఘించినప్పుడు, జర్మను నౌకను స్పెయిన్ ప్రభుత్వ సైనికులు కాల్చడం న్యాయ సమ్మతమే. తమకు జరిగిన 'అన్యా యానికి' ప్రతిక్రియగా, జర్మనీ ప్రభుత్వం, స్పెయిన్ తూర్పు సము ద్రతీర (Mediterranean Coast) పట్టణమయిన ''అల్మీరియా''ను ధ్వంసంచేసి, ప్రజలను చిత్రవధ చేసింది. అల్మీరియాలో విద్రో

హులు చేసిన చిత్రవధలు, ఇంతకుముందు బెడజాజ్, ఇరన్ మాడ్రిడ్, టొలిడో, గ్వార్నికా, మాలగా మొదలయిన పట్టణాల్లో ఫాసిస్టులు జరిపిన చిత్రవధలను మించిపోయినవి. కాపలా పద్ధతి అమలులోకి వచ్చినప్పటినుంచి, ఇటలీ జర్మనీలు ఏదో విధంగా ప్రభుత్వాన్ని రెచ్చగొట్ట సాగాయి. ఈ క్రింద ఒక ఉదాహరణ యిస్తాను. 'కార్టజీనా'లో ప్రభుత్వ నౌకాదళం యొక్క మెళుకువలు, రాకపోకలన్నిటిని కనిపెట్టుచూ, చిత్రపటములను తీయుచూ, సాంకేతికంగా విద్రోహులకు అచ్చటి వార్తలను తెలియజేయుచూ ఫాసిస్టులు తరుచుగా నావలను సముద్రంలో ముంచుతూ వచ్చారు. ఫాసిస్టు దురాగతాలకు ప్రభుత్వ నౌకాదళ యొక్కటియే గురికాలేదు. తటస్థ దేశాలుకూడా యీ బాధల ననుభవించాయి. 'అల్మీరియా' మీద బాంబులు ప్రయోగించి నాశనం గావించమని హిట్లరు ఆజ్ఞయిచ్చుట కేవలం ప్రతిక్రియ కానేకాదు. పర్యవసానం ప్రతిక్రియకంటె యెక్కువ దారుణంగా పరిణమించింది. సవ్యంగా యుద్ధనియమాలను పాటించి పోరాడి జయించలేనప్పుడు, ప్రజలకు, సైనికులకు తారతమ్యం యెంచకుండా, సర్వనాశనం చేయుట 'టోటలిటేరియన్' యుద్ధపద్ధతిలో ప్రధానసూత్రం. కాని ఆల్మీరియాను బాంబులకు గురిచేయుటకుగల కారణాలు వేరే ఉన్నాయి. అల్మీరియాపైన అగ్నిహోత్రం కురిపించడంచేత, ప్రజాయత్త ప్రభుత్వాలను రెచ్చగొట్టవచ్చుననియు, తత్ఫలితంగా అవి ఫాసిస్టు ప్రభుత్వాల ధాకకు ఆగ లేకలొంగిపోయి, యిదివరకునుండి స్పెయినునుంచి "విదేశ స్వచ్ఛంద సైనికులు వారి దేశాలకు తిరిగిపోవలె" ననెడి షరతును అవి ఉపసంహరించుకొంటా యనిన్నీ, నానాటికి బలహీనులగుచున్న విద్రోహులకు యుద్ధసామగ్రిని, సైనికులను చేర్చుటకు అవకాశం కలిగిద్దామనీ, జర్మనీ ఇటలీలు అభిప్రాయపడ్డాయి. అల్మీ

రియా నాశనమును, బ్రిటన్‌లో అనేక పత్రికలు ఖండించగా, ప్రభుత్వం వాటిని త్రొక్కిపట్టుటకు ప్రబలప్రయత్నాలు చేశాయి. అబ్సీనియా విషయంలో బ్రిటిష్ ప్రభుత్వం జర్మనీని బహిరంగంగానే సమర్థించింది. నానాజాతి సమితిలో న్యూజిలాండ్ దేశపు ప్రతినిధి స్పెయిన్ ప్రభుత్వానికి అనుకూలంగా మాట్లాడుటకు ఉపక్రమించగా బ్రిటిష్ విదేశాంగమంత్రి అతనిని నివారించాడు. ఫ్రాన్సుకూడా బ్రిటిష్ నాయకత్వానికి గొర్రెమాదిరిగా అనుసరించడంవల్ల, స్పెయిన్ యెడల సానుభూతిగలిగిన రష్యా నానాజాతి సమితిలో ఒంటరిదైపోయింది.

జర్మన్ ప్రభుత్వం యెదుర్కొనవలసియున్న అంతరంగిక పరిస్థితులను కప్పిపుచ్చి, ప్రజలకు మత్తుమంగుచల్లి, మాయచేయు ఉద్దేశంతో, స్పెయినులో కొంత జయంసపాదించి, ఆ వార్తను ప్రజలచెవిని వేయాలని హిట్లర్ ఆతుర్దాపడుతున్నాడు. జర్మనీ స్పెయినులో గావించుచున్న అత్యాచారాలకు, ఇంగ్లండు, సెంట్రల్ యూరప్‌లోని కలహ కారణమయిన విధానానికి చేయూత యిచ్చుచున్నదను శుభవార్తకంటె జర్మనీకి యింకా యెక్కువేమి కావలయును? జర్మనీని యింతపట్టుదలతో సమర్థించడానికి ప్రత్యేక కారణాలేవియా యని పాఠకులకు సందేహం కలుగవచ్చును. ముఖ్యంగా మూడు కారణాలున్నాయి. స్పెయిన్ యుద్ధంలో ఫాసిస్టుల గెలుపుకంటె, రిపబ్లిక్ ప్రభుత్వం గెలుపు బ్రిటిష్ సామ్రాజ్యానికి అరిష్టదాయకం. రెండవది: ఇటలీనుంచి జర్మనీని విడదీయుటకును, సోవియటు-ఫ్రెంచి ఒడంబడికను భగ్నంచేసి, సోవియటు రష్యాను వేరుచేయుట.

గడచిన నెలలో "లీప్‌జిగ్" అను జర్మనీ నౌకపై సోవియట్ రష్యా మద్దత్తుతో స్పెయిన్ ప్రభుత్వం బాంబులు ప్రయో

గించినదనే నెపం పెట్టుకొని, దానికి ప్రతిక్రియగా జర్మనీ, బ్రిటిష్ ఫ్రెంచి, ఇటలీ ప్రభుత్వాలను వారి అసమ్మతి తెలుపుటకు వారి వారి నౌకాదళాలను మెడిటరేనియన్ సముద్రతీరాన ప్రదర్శించాలని గట్టిగా పట్టుపట్టింది. ఇటలీమాత్రం దీనికి మనఃపూర్వకంగా అంగీకరించింది. బ్రిటిష్ ఫ్రెంచి ప్రభుత్వాలు సమ్మతించలేదు. అందుమీద జర్మనీ ఇటలీలు ఆగ్రహపడి కాపలా విధానంనుంచి రాజీనామా యిచ్చివేసా, మెడిటరేనియన్ సముద్రంలో తమకుగల సర్వహక్కులను నౌకాదళాలు మొదలయినవాటని గక్షించుకొనుటకై యెట్టితీవ్రచర్యకైన గడంగుగుమనియు, కొలగికాలంలో స్పెయిన్ అంతర్యుద్ధమందు విపరీతమగునట్టి, సంక్షోభకరమయినట్టి పరిస్థితులు ఏర్పడబోవుననియు హెచ్చరించాయి. జర్మనీ నడవడియందుగాని, దాని ఆశయాలయందుగాని, బ్రిటిష్‌ప్రభుత్వానికి సానుభూతియున్నప్పటికి, బయటి ప్రపంచానికి కొంతవెరచి, తన పేరు ప్రతిష్ఠలకు భంగం వాటిల్లువని ఆలోచించి, కాపలావిధానం నుంచి విరమించుకున్నందుకు జర్మనీయెడల తన అసమ్మతిని వెలిబుచ్చింది. కాపలావిధానంనుంచి రాజీనామా యిచ్చినా, తటస్థవిధాన సంఘంలోమాత్రం సభ్యులుగా యున్నామనియు, తటస్థవిధానమును కార్యరూపంగా ఆచరిస్తామనియు జర్మనీ ఇటలీలు చెప్పతూనే వచ్చాయి. కాని వారి పైబూటకపు కబుర్లకును, ఆచరణకును యెటువంటి పరస్పర విరుద్ధమున్నదో యీక్రింది ఉదహారణ వల్ల స్పష్టమవుతుంది. స్పెయినుకు ఉత్తరదిశలో నున్న 'బిల్బోవా' పట్టణరక్షణ నిమిత్తం ప్రభుత్వసైనికులు చూపిన ప్రచండ విప్లవశక్తి, అకుంఠితమైన మిలిటరీ చాకచక్యత, జర్మనీ ఇటలీల విమానబలంముంగు పనికిరాక, వాటికి లొంగి పోవలసి వచ్చింది. ఘోరసంఘర్షణ జరిగిన తర్వాత ప్రభుత్వమునకు అపజయం కల్గింది. ఫ్రాంకోకు జయం సిద్ధించినందులకును, తమకు అత్యవ

సరమగు పట్టణాన్ని పట్టుకొనగలిగినంగులకును, ఫ్రాంకోను అభి నందించాయి. ఇదెట్టి తటస్థవిధానమో పాఠకులు గమనించాలె.

కాపలావిధానం అమలులోకి వచ్చినప్పటినుంచి, పోర్చుగల్-స్పెయిన్ సరిహద్దులను కాపలాకాయుటకై నియమించబడ్డ బ్రిటిష్ ప్రభుత్వానికి కావలశిన సహాయాన్ని పోర్చుగల్ యిస్తూ వచ్చింది. కాని జర్మనీ ఇటలీలు రాజీనామా యిచ్చినప్పటినుంచీ అట్టి సహాయాన్ని ఉపసంహరించుకున్నది. జర్మనీ ఇటలీల రాజీనామాలవల్ల కలిగిన ఖాళీలను తాము ఆక్రమించుకొని, తటస్థ విధానాన్ని నిష్పక్షపాతబుద్ధితో అనుచరిస్తామని ఫ్రెంచిబ్రిటిష్ ప్రభుత్వాలు తెలుపగా, ఇటలీ జర్మనీలు అంగీకరించలేదు. బ్రిటిష్ ఫ్రెంచిదేశాలు స్పెయిను ప్రభుత్వానికి సహాయం చేయుచున్నవని నిర్హేతుకమయిన అనుమానం జర్మనీ ఇటలీలలో యిదివరకే నాటుకొని యుండడంచేత, కాపలావిధానం పూర్తిగా వీరి యాజమాన్యం క్రిందకు వచ్చినయెడల స్పెయిను ప్రభుత్వానికి నిరాటంకంగా సహాయ మొనర్చుదు రనియు భయపడి, వారి సూచన లంగీకరించలేదు. కాపలావిధానం బ్రిటిష్ ఫ్రెంచి దేశాల చేతుల్లోకి వచ్చినతర్వాత విద్రోహులకు పరాయిసహాయం కొంతవరకు తగ్గవచ్చునేమోగాని, స్పెయిన్ ప్రభుత్వానికిమాత్రం ఉపకారం యిసుమంతకూడా కలుగదు. కాబట్టి జర్మనీ ఇటలీల అనుమానాలు, నిర్హేతుకమైనవి; నిరాధార మయినవి.

---

# స్పెయిన్ దుస్థితి.

——(D)——

## మొరాకోలో జర్మనీ పన్నుగడ.

వర్తమాన కాలంలో యూరప్ ఒకటేగాక ప్రపంచం యావత్తుకూడా స్పెయిన్ యుద్ధమునుగురించి బహు తీవ్ర బుద్ధితో ఆలోచిస్తున్నది. అందులో ముఖ్యంగా యిరు కక్షుల వారికి బయటనుంచి సహాయం రావడంచేత, సమస్య మరింత క్లిష్ట రూపం తాల్చింది. జనసామాన్యం అనుకొనే రీతిగా, జనరల్ ఫ్రాంకో నాయకత్వం క్రింద, విద్రోహులకు అంత అనుకూలంగా జయం లభించటంలేదు. ప్రస్తుతం వాలెంషియాలో తమ కేంద్రప్రభుత్వ స్థానాన్ని స్థాపించుకొన్న స్పెయిన్ ప్రభుత్వం మొదట్లో మాదిరిగా బలహీనంగా కాక, అధికమయిన శౌర్య పరాక్రమాలతో ముందంజవేశి, చాలా ముఖ్యమయిన పట్టణాలను ఆక్రమించుకొని, మాడ్రిడ్‌ను శత్రువులచేతుల్లో పడనీయకుండుట యేగాక, అన్ని వైపులనుంచి తరిమివేయుచున్నది. ఫ్రాంకో సేనాని సైనికులకోసం తంటాలు పడుతున్నాడు. అతడు గెలవ తలచుకుంటే, ఇటలీ జర్మనీల సహాయం పూర్తిగా ఉంటేనేగాని అలవికాదు. విదేశాలనుంచి మందు గుండు సామాను పంపించినంత సులభంగా, సైన్యాన్ని పంపడం సాధ్యంకాదు. దానివల్ల చాలా చిక్కులు సంభవిస్తాయి. ఫ్రాంసు, ఇంగ్లండు దేశాలు, స్పెయిన్ దేశానికి, విదేశాలనుంచి సహాయం పంపవద్దని సూచించిన అభిప్రాయానికి రోమ్‌నుంచి బెర్లిన్‌నుంచికూడా కొన్ని మినహాయింపులతో సమాధానాలు వచ్చాయి. ఆ మినహాయింపు లేవంటే, స్పెయినుకు సైన్యాన్ని, మందు గుండు సామాగ్రి నేకాక, గుండుసూది దగ్గరనుంచి, ధనం మొదలయిన యెట్టి

ఆయుధ సహాయంకూడా, యే దేశమూ (ముఖ్యంగా రష్యా అని వారి అభిప్రాయం) చెయ్యి వీలులేదని జవాబులు వచ్చాయి. జర్మనీ, స్పెయిను రాజకీయాల్లో యెక్కువగా స్వాతంత్ర్యం కలిగించుకొని, విద్రోహులకు సహాయంచెయ్యడం పేరుప్రతిష్ఠల కొరకని పారక మహాశయులు అభిప్రాయ పడుదురని నేననుకోను. స్పెయినులో తన పలుకుబడిని, యెక్కువ చేసుకుని లాభాలను పొందాలనే అభిప్రాయమే ముఖ్యకారణం. యూరపియన్ పత్రికల్లో అనేక పర్యాయాలు జర్మనీ కండ్లు, స్పెయిన్ మొరాకో మీద పడ్డాయని, అచ్చట బలమయిన స్థానం సంపాయించుకొని తన్మూలాన స్పెయినులో అధికారం చలాయించటానికి అభిప్రాయం ఉన్నట్లు స్పష్టమైన భాషతో వ్యాసాలు ప్రచురింపబడ్డాయి. అనేక పర్యాయాలు ప్రకటించబడ్డ రిపోర్టులను బట్టి, జర్మనీ, స్పెయిన్-మొరాకోలో ఆర్థిక, రాజకీయ, మిలిటరీ పలుకుబడిని స్థాపించుకోవాలని నిండా జర్మనీ అభిప్రాయ పడ్డట్లు తెలుస్తుంది. పారిస్‌లో యీ విషయమై తీవ్రమయిన ఆందోళన జరిగింది. అదే సమయంలో బెర్లిన్‌లోని అధికారులును, విద్రోహ నాయకుడైన ఫ్రాంకోకూడా, స్పెయిన్-మొరాకో మీదికి దండెత్తి తన అధికారాన్ని పెంపొందింప తలచుకున్నట్లుగా ఫ్రాన్సుమీద నిందలు మోపారు. ఈ విషయమై కూడా తీవ్రమయిన గందరగోళం జరిగింది యూరప్ యావత్తు కూడా. నిజంగా స్పెయిన్ - మొరాకోలో జర్మనీకి చాలా బలవత్తరమయిన లాభాలున్నాయి. ఈ లాభాలను సంపాయించుదామనే, జర్మనీ, ఫ్రాంకో సేనానిచేత మొరాకోలో మిలిటరీ శిబిరాలు కట్టించి జర్మనీ సేనలతో వాట్లను నింపివేయుటకు బలవంతం చేశాడు. ఈ చర్యవల్ల, బ్రిటిష్, ఫ్రెంచి రాజకీయ వేత్తలకు కోపం కలిగింది. వెంటనే జర్మనీ సేనలను, మొరాకోలో

నిలువవుంచి, విద్రోహులకు సహాయంచేయ వీలులేదని ఫ్రాంకోను గట్టిగా మందలించాయి. ఈ విధంగా సైన్యాలను నిలువ వుంచటంవల్ల, కొంతకాలం అయిన తర్వాత వారి అధికారం అచ్చటనే నిలచిపోయి, మొరాకో, జర్మనీయొక్క వలస రాజ్యంగా మారుతుందనీ, ఫ్రెంచి దేశంయొక్కయు, దాని వలస రాజ్యాలయొక్క శాంతిభద్రతలకు మోసం వాటిల్లుతుందని హెచ్చరించాయి. మొరాకో సమస్య చాలా తీవ్రమయిన సమస్య. మొట్టమొదటి విషయం దానియొక్క సముద్రరేవులు పర్వతములకు యెగురుగా ఉండడంచేత, చాలా లాభాలున్నాయి. మొరాకోయందలి 'క్యూటా' నగరంలోనున్న పురాతనపు కోటను, జిబ్రాల్టర్ జలసంధిలోనుంచి శత్రువు లెవరయినా మొరాకోను ముట్టడించ వచ్చినయెడల, కోటమీది జర్మను నావికా దళములు, యెట్టి శత్రువుచేతనైనను ముట్టడింపబడ జాలవు. క్యూటా నగరంలో వైమానిక నావికాదళములకు బలమయిన ఆశ్రయములను నిర్మించినయెడల, మెడిటరేనియన్ సముద్రంలోకి, బ్రిటిష్ నావలను రానీయకుండా బంధుచేసి ఇండియాకును, తూర్పు ఆసియాకును వచ్చు మార్గాన్ని అరికట్టగలరు. ఈ వైమానిక నావికాదళములే బ్రిటిష్ నావికాదళంయొక్క నడవడిని కనిపెట్టి, దానిని వెన్నంటి, తూర్పు ఆసియాను మరొక సముద్ర మార్గమయిన 'అట్లాంటిక్' గుండా 'కేప్ ఆఫ్ గుడ్ హోప్' ను చుట్టి వచ్చుటకు ప్రయత్నంచేసినను, మొరాకోవంటి ప్రాముఖ్య మయిన ప్రదేశమందు, జర్మనీ సైన్యాలు ఇంగ్లండును నిరోధించ గలవు. జర్మనీ, మొరాకోను ఒక వేళ ఆక్రమణ చేసుకున్న యెడల, ఉత్తర ఆఫ్రికానుంచి, ఫ్రాంసును విడదీయడానికి అవకాశం కలుగుతుంది. అంటే, ఉత్తర ఆఫ్రికాలో ఉన్న ఫ్రెంచి ఆయుధసామాగ్రికాని, సైన్యంగాని, ఆఫ్రికా సైనిక

దళాలుగాని, ఆఫ్రికా ఖండంలోనే చిక్కబడి, యుద్ధ సమయంలో ఫ్రెంచి దేశానికి సహాయకారి కాజాలక, చాలా యిబ్బంది పరుస్తాయి. ఇక మొరాకోలో దొరికే లాభా లేవంటే, ఇనుప గనులు అపారంగా ఉన్నాయి. స్పెయిన్‌లో, అంతర్యుద్ధం ప్రారంభం అయినప్పటినుంచికూడా, అచ్చటి యినుప ముతక లోహం యావత్తు జర్మనీకి, ఆయుధాలకొరకు ఫ్రాంకో చెల్లించ వలశిన ఋణ పరిష్కారంనిమిత్తం యెగుమతి అయ్యాయి.

మొరాకోవిషయమై హిట్లరువేస్తున్న యెత్తులు, ఫ్రాన్సును ఆగ్రహపరిచాయి. దీనివల్ల బ్రిటిష్ రాజకీయ వేత్తలుకూడా కలవరం చెందారంటే, సామ్రాజ్య వాదసూత్రాల ప్రకారం అట్టి కలవరపాటు సహజమే. మొరాకో తనకురాకపోయినే అనే చింతయేకాని, స్పెయిన్ స్వాతంత్ర్యానికి నష్టంకలుగుతున్నదే అను అభిమానం సున్న. ఈ విషయమై ఫ్రెంచిపత్రికలు ఆగ్రహావేశం మీద, ఉన్నదానిని ఉన్నట్లువ్రాయక పదియిబ్బళ్లు అతిశయోక్తిగా వ్రాశాయి. కాని నిజంగా అనుకొన్నన్ని జర్మనీసైనికదళాలు, ఆయుధసామగ్రి, మొరాకోలో ఉంచారా అనే సందేహం ఉదయిస్తుంది. మొరాకోలో చాలామంది వైమానికులు, విమానాలు ఉన్నాయికాని, సైనికులు అంత యెక్కువమంది లేరు. ఇంతమాత్రంచేతనే మొరాకో హిట్లరు గుప్పిటనుంచి తప్పించుకొనగలదని తలచుట కేవలం వెర్రి. హిట్లరుచేతిలో కీలుబొమ్మయిన ఫ్రాంకో, మాడ్రిడ్‌నే పట్టుకొని, స్పెయిన్‌దేశాన్ని యావత్తు కూడా తనవశం చేసుకున్నట్టయితే, అప్పుడు మొరాకోదేశమును, దాని చుట్టుప్రక్కలనున్న యితరస్పెయిన్ స్థలాలును నిస్సంశయంగా, జర్మనీరాజ్యాంగ పద్ధతిలోనికివచ్చి తీరుతాయి. హిట్లరు 'ఖ్యాటా' కొరకును, 'రిఫ్' గనులకొరకే పోట్లాడడంలేదు. స్పెయిన్‌యావత్తు తన అధికారంలోనికి తీసుకుని రాగలందులకు

విశ్వప్రయత్నాలు చేశాడు. అనగా దారిలో మొరాక్కో కూడా కలిసి ఉన్నదన్నమాట. స్పెయిన్ యందు మొరాక్కోలో కన్న యెక్కువ విలువగలిగిన ఇనుము, గారి, పెట్రోలియం గను లున్నాయి. వీటివల్ల, ముడివస్తువులకోసం తపిస్తున్న జర్మనీకో రక్కసిద్ధిస్తుంది.

## ఫ్రాంకో అసహాయస్థితి

స్పెయినులో విద్రోహులు అప్పుడే ఓడిపోవడం మొదలు పెట్టారు. ఫ్రాంకో, యితరవిద్రోహ నాయకులు, స్పెయిన్ ప్రజా ప్రభుత్వంతో, యెట్టి నిశ్చితమైన అభిప్రాయం లేకుండా, ముసోలినీ, హిట్లరులమీద ఆధారపడి యుద్ధంచేస్తున్నారు. స్పెయిన్ సులభంగా లొంగేది కాదు. దేశంలో మధ్యప్రాంతం యావత్తు, యెత్తయినకొండల వరుసలతో నిండి, శత్రువులకు అభేద్యమయి ఉన్నది. చదునైన మైదానాలు, తూర్పుదిక్కున మాత్రమునే ఉన్నాయి. ఆ ప్రదేశంలో నివశించు ప్రజలు, మొట్టమొదట్లోనే తిరుగుబాటుదార్లను తప్పించుకొని, వారినితిరిగి ఓడగొట్టారు. తక్కినప్రదేశాల్లో, నెపోలియన్ ఎరుగొన్నట్లు, విద్రోహులు "గొరిల్లా" యుద్ధప్రవీణులను ఎరుగొన్నారు. స్పెయిన్ మీదికి యుద్ధానికివెళ్లిన ప్రతి దండయాత్రికుడు కూడా, అచ్చటనున్న బీదకర్షకులను బలవత్తరమైన శత్రువులుగా పరిగణించేవాడు. కారణం :- కర్షకునికి ఆయుధం చేతిలో నున్న యెడల, ధైర్యంతో తెగించి, శత్రువులమీదపడి, తెగనరికే సాహసం కలుగుతుంది.

యుద్ధం ప్రారంభమైనప్పుడు కర్షకులకు ఆయుధాలు లేనే లేవు. కాని క్రిందటి అక్టోబరు చెరిసగాన, మెక్సికోనుంచి, రష్యానుంచి ఆయుధాలు దిగుమతి అయినప్పుడు కర్షకులకుగూడా

ప్రభుత్వం ఆయుధాలను సప్లయిచేశింది. విశేషించి, నూతనంగా బార్సిలోనా, వాలెంషియా మొదలయిన పట్టణాల్లో స్థాపించబడ్డ ఆయుధ ఫ్యాక్టరీలు, విరామంలేకుండా లక్షలటన్నుల మందు సామాను తయారుచేశాయి. ఇదంతా ఫ్రాంకోకు తెలియకపోలేదు. ఒకవేళ మాడ్రిడ్ ఫ్రాంకోచేతిలో పడ్డప్పటికీ, అంతర్యుద్ధం అంతటితో ముగింపునకు రాదు. నిష్పక్షపాతంగా ఉభయపక్షాల గాలా బలాలను లెక్కవేశిచూడగా, యింకా రెండుసంవత్సరాలకుగాని, ఇటలీ, జర్మనీల సహాయంతోనయినను, ఫ్రాంకో స్పెయినును వశ పరచుకోలేడని తేలింది.

ఇప్పటికయినను ఫ్రాంకో త్వరలో నిశ్చితాభిప్రాయానికి రాకుండా, యితర ఫాసిస్టు నాయకులుచేసిన ప్రతిజ్ఞలు ఆసాంతం వరకు నెరవేర్చకుండా ఉన్నట్టయితే, త్వరలోనే అతని సైన్యం యావత్తు చెల్లాచెదరయిపోతుంది. అంతర్యుద్ధం అత్యంత సుల భంగా, యెవ్వరి రాయబారం లేకుండానే ముగియగలగు. యుద్ధ ప్రారంభంలో మూడువంతులకు, రెండువంతులు వైమానికసైన్యం గవర్నమెంటు పక్షాన్నే ఉంది. కాని విదేశాలనుంచి వైమానికు లును, విమానాలును, విద్రోహులకు సహాయంరావడంవల్ల, వైమా నికదళంలో యిటీవల వరకు ప్రభుత్వం వెనుకపడే ఉండవలసి వచ్చింది. స్పెయిన్ నావికదళంలో చాలామంది అధికారులు తిరుగుబాటులో చేరినవారే. కాని అధికసంఖ్యాకులైన నావిక సైనికులంతా, అధికారులమీద తిరుగబడి, ప్రభుత్వంతో చేతులు కలిపి విద్రోహులతో హోరాహోరిగా పోట్లాడుతున్నారు. నావి కాధికారులు లేనికారణమున, ప్రభుత్వం కొంతవరకు నష్టపడ్డా, ప్రభుత్వపు యుద్ధఓడలు పశ్చిమ మెడిటరేనియన్ సముద్రంలో పూర్తిగా పై చేయిసంపాయించుకొని, ఫ్రాంకోను మొరాకో నుంచి తన సహాయార్థం సైన్యాన్ని ప్రభుత్వంమీదికి పంపనీయ

కుండా ఆపుచేయగలిగాయి. తర్వాత ఫ్రాంకో, ఇటలీ జర్మనీల బలంచేత ప్రభుత్వానావికాదళాన్ని ఓడించి, మొరాకో సైన్యాన్ని తెచ్చుకున్నాడు. కాని యీ నెల రోజులలోపల ప్రభుత్వానికి ఊపిరి త్రిప్పుకోడానికి పూర్తి అవకాశం కలిగింది. తూర్పు రాష్ట్రాలలో ప్రభుత్వబలం యెక్కువచేసుకొని, శత్రువులను ఢీకొనడానికి తయారుచేసుకోవడం ఆరంభించారు యీ నెల రోజుల్లో. కాని తర్వాత తర్వాత, విదేశసహాయంవల్ల విద్రోహులు క్రమంగా కొన్నిపట్టణాలు పట్టుకొన్నారు. ప్రభుత్వానికి శిక్షణగల్గిన సైన్యం చాలాతక్కువనియు, యుద్ధసామగ్రి సరిపోవుట లేదనియు, ప్రథమంలో చాలామంది ప్రజలు ఆయుధాలను ఉపయోగించటం నేర్చుకొని యుద్ధరంగంలోకి ప్రవేశించుట లేదనియు తెలుసుకొన్నాం. కాని తర్వాత ఏయే లోపాలున్నవో అవన్నియు తృప్తికరంగానే సవరింపబడ్డాయి. ఎన్ని లోపాలున్నను, ప్రజాసామాన్యం, కార్మికకర్షకులు విశేషమైన విప్లవశక్తి గలవారగుటచేతను, తాము పోరాడేడి మహత్తరమైన ఆశయం కొరకని తమకు తెలియుటవల్లను, అధికోత్సాహంతో పోరాడి శత్రువిద్రోహులను రణరంగంలో గెల్చుచునేయున్నారు. ప్రభుత్వానికి మెక్సికో రష్యాలనుంచి ఆయుధసహాయం వచ్చుచుండుట వల్ల, క్రమంగా విద్రోహులబలం తగ్గిపోవటం ప్రారంభించింది. ఫ్రాంకోను విడిచిపోయిన సైన్యంలో చాలామంది ప్రభుత్వపక్షం చేరారు. విద్రోహుల పక్షమే ఉండి, ఇటలీసైనికులు చాలామంది విద్రోహనాయకులమీదనే కుట్రలు పన్నుతు, తిరుగుబాటుకు సిద్ధపడుతున్నారు. ఈ రహస్యం ఫ్రాంకోకు తెలిశి 20 మంది ముఖ్యులయిన ఇటలీ సైనికులను కాల్చిచంపించాడు. సైన్యంలో కలకలం బయలుదేరేటప్పటికి, ఫ్రాంకోకు గాబరాయెత్తింది. పైగా చలికాలం. మూరులు చలిలో యుద్ధం చెయ్యలేరు. ఫ్రాంకో

ఇటువంటి పరిస్థితుల్లో, ఇతర మిలిటరీ కమాండర్లు యేవిధంగా ఆచరిస్తారో ఆపనే ప్రారంభించాడు. తాను ఆక్రమించుకొన్న ప్రాంతాలను క్రూరమైన నిరంకుశవిధానంచేత, తన ఆధీనం చేసుకో తలచాడు. దీనివల్ల ప్రభుత్వంలోకూడా పట్టుదల యెక్కువై, అధికసంఖ్యాకులైన ప్రజలు సేనలోనికి చేర్చుకొని యుద్ధానికి తయారుచేశింది. ఇతరదేశాలనుంచికూడా ఆరితేరిన అనేక యుద్ధభటులు ప్రభుత్వసహాయానికి రావడంచేత ప్రభుత్వ సేనలకు మరింత బలంకలిగిండి. ఫ్రాంకో తన ప్రాంతంలో ఏర్పాటు చేసుకొన్న రాకపోకల సదుపాయాలకు అపాయం కలిగింది. జర్మని ప్రభుత్వంకూడా విద్రోహులకు సహాయంచేయుటవల్ల, యూరప్‌లో తనయొక్క పరిస్థితులు విషమరూపం తాలుస్తా యని తెలివి కలిగ గ్రహించుకొని, సహాయాన్ని చాలావరకు తగ్గించటం ఆరంభించింది. ఇటలీ, యుద్ధం ఆసాంతంవరకు యెంత ధనప్రాణ నష్టానికైనా తయారయి, విద్రోహులకు సహాయపడుతుండని ప్రపంచంలో రాజకీయవేత్తలు సామాన్యంగా అభిప్రాయపడ్డారుగాని జర్మనీమాత్రం ఫ్రాంకోకు పూర్తిగా సహాయపడుటకు అంతగా ఆసర్దా చెందలేదని తెలుస్తుంది. 'గాడలరజా' యుద్ధరంగంలో విద్రోహులు దెబ్బతిన్నప్పటినుంచి, జర్మని మిలిటరీ అధికారులు, విద్రోహులపట్ల అంతఅనుకూలభావంతో లేరని తోస్తుంది. అనవసరంగా యుద్ధంలో చిక్కుకొని, జర్మని అంతరంగిక పరిస్థితులను మరింత సంక్షోభస్థితిలోనికి తీసుకుని రావటానికి అసలేయిష్టంలేదు. యుద్ధప్రారంభంలో జర్మనీ పడ్డఅభిప్రాయానికి యిప్పటికని, ఆశ్చర్యకరమైన మార్పు కనుపిస్తున్నది. ఇటీవలి 'బిల్బావా' యుద్ధంకూడా అతిక్రూరచర్యలతో ముగియటంవల్లను, యుద్ధం సంవత్సరాలకొలది సాగే సూచనలు కనుపించడంచేతను, అటువంటి రక్తపాతమైన యుద్ధంలో పాల్గొని, లక్షలకొలది తమ సైనికులను కోల్పోవుటకు

జర్మనీ ఇష్టపడదు. మొదట్లో స్పెయిన్ ప్రభుత్వం ఫ్రాంకోకు యింత కష్టం కలిగించకుండానే లొంగుతుందని అభిప్రాయపడి హిట్లరు 10,000 నుంచి 20,000 వరకు సైన్యాన్ని సహాయం పంపాడు. కాని యిప్పుడు ఫ్రాంకోబలం నశించి ప్రభుత్వబలం అధికమయింది. ఫ్రాంకో మాడ్రిడు పట్టుకోనే ఆశలు అంతరించడమే కాక, ఫ్రాంకో యిదివరకు పట్టుకున్న ప్రదేశాలను చాలా వరకు ప్రభుత్వమే తిరిగి ఆక్రమించుకుంటున్నది. అదీగాక జర్మనీ సైన్యాధికారులు, ఫ్రాంకో సైన్యంలోని జర్మనీ సైనికోద్యోగులను తిరిగి జర్మనీకి పిలిపించాలని కూడా సలహాయిచ్చారు. ఇకముందు యెట్టి సహాయం చేయుటవల్ల లాభం యెంతమాత్రం లేదనియు, పైగా నష్టం మాత్రం తప్పక సంభవించుననియు హిట్లరుకు చెప్పారు. విద్రోహులలోనే చీలికలు, కలతలు కలగడంవల్ల జర్మనీకి అసలే సంతృప్తికరంగా లేదు. అన్నిటికన్న ముఖ్యమైన విషయం ఇటలీ జర్మనిల సలహాలను ఎంతమాత్రం అనుసరించకుండా, ఫ్రాంకో స్వతంత్రించి యుద్ధాన్ని నడిపిస్తున్నాడు. ఫ్రాంకో మిలిటరీ వ్యవహారాలన్ని కూడా, మరియొక అధికారునికి వదలివేశి, తను కేవలం పరిపాలనా, పద్ధతులకొరకే కాలాన్ని వినియోగించ వలశినదని ఇటలీ, జర్మనీలు మరీ మరీ నొక్కి చెప్పినప్పటికని, ఫ్రాంకో యీ సలహాను బొత్తిగా నిరాకరించాడు. ఫ్రాంకో, సైన్యాధికారిగాయుండి, యుద్ధాన్ని నడిపిస్తున్నంతవరకు జయం కల్గదని జర్మనీ అభిప్రాయం. ఇన్ని మాటలెందుకు? ఫ్రాంకో, జర్మనీ, ఇటలీ ఆజ్ఞలను ఎంతమాత్రం అంగీకరించడు. అందువల్ల తన పలుకుబడి తగ్గుతుందని అతని భయం. మాడ్రిడ్ పట్టణమే శత్రువుల వశం అవుతుందని భయపడ్డ స్పెయిన్ దేశస్థులు, తలవని తలంపుగా ఫ్రాంకో సైన్యం పలాయనం కావడం, అతను పట్టుకున్న పట్టణాలను తిరిగి గవర్న

మెంటు స్వాధీనం చేసుకోవడం, చూచి ఆశ్చర్యచకితులై పరమానంద భరితులైనారు. ఇంకొక ఫాసిస్టు రాజ్యాన్ని, ఫ్రాంకో నాయకత్వం క్రింద యూరప్‌లో సృష్టించుదామని కొండంత ఆశపెట్టుకొన్న ముస్సోలినీ హిట్లరులు, ప్రభుత్వ శక్తిని చూచి, ముక్కుమీద వేలు వేసుకోవలశి వచ్చింది. జనరల్ ఫ్రాంకో నిర్విణ్ణుడైనాడు. వాయువేగంతో మాడ్రిడ్ ద్వారాల వరకు త్రోసుకొని వచ్చిన 12,000 మూరు సైనికులు చెల్లాచెదరై 1000 మందిలోకి తయారయినారు. మిగిలిన వారిలో చాలా మంది చనిపోయారు. కొంతమంది ప్రభుత్వ పక్షాన చేరారు. ఇంకా అనేకమందికి గాయాలు తగిలి, యుద్ధం చేయలేనిస్థితిలో ఉన్నారు. గత్యంతరంలేక వెంటనే 50,000 మంది సైనికులను పంపవలశినదనియూ, లేనియెడల మాడ్రిడ్‌ను పట్టుకొనుట దుర్లభమనియూ, ఫ్రాంకో, హిట్లరుకు అతిదీనంగాను, వినయపూర్వకంగాను మనవిచేసుకున్నాడు.

ఇటీవలనే రోములో జర్మనీ సర్వసేనాధిపతియయిన జనరల్ గోరింగునకును, ముస్సోలినీకిని జరిగిన రహస్య సంభాషణ ముఖ్యంగా స్పెయిన్ యుద్ధాన్నిగూర్చియే తప్పక అయి ఉంటుంది. జర్మనీ, ఇటలీలకున్ను, ఫ్రాంకోకునుగల మైత్రినిబట్టియూ, తమకు స్పెయిన్‌లో రాబోవుచున్న లాభాలను గురించియూ, యికముందు పరిస్థితుల్లో, యేవిధంగా సహాయంచేయాలో నిశ్చయించుకున్నారు. ఇటువంటి సంభాషణలవల్ల, కుట్రలవల్ల, యూరప్‌లోనే గాక ప్రపంచమంతటా యెట్టిసంక్షోభం కలుగునో, ప్రజాసామాన్యం యెన్నికడగండ్లపాలగునో అనే భయం కలుగక మానదు. ఈ భయం నానాటికి యెక్కువగుతూంది. నిజానికి, హిట్లరు, గోరింగులిద్దరూ, ఫ్రాంకో యుద్ధపరిస్థితులయెడల తృప్తి చెందలేదు. మాడ్రిడ్ పట్టుకోడంమాట అసలే విడిచిపెట్టారు.

ఒకవేళ జర్మనీ సహాయంవల్ల పట్టుకొన్నప్పటికిని, అనంతరం జర్మన్ సైన్యం స్పెయిన్‌లో కొంతకాలంపాటు నిలవయుండి, ఫ్రాంకో ప్రభుత్వానికిగల అన్ని అడ్డంకులను తీసివేశి, రాజ్యాన్ని సుస్థిరంగా చేసేటప్పటికి చాలాకాలంపట్టును కనుక, అంతవరకు నిలువయుంచుటకు జర్మన్ అంతరంగిక పరిస్థితులు ఒప్పుకోవు.

జర్మనీ అంతరంగిక పరిస్థితులయొక్క క్లిష్టత్వమును గురించి బయట ప్రపంచము తెలుసుకొన్నదానికంటె, యదార్థంగా యెన్నో రెట్లు అధికంగా చిక్కులో ఉన్నాయి. తన సైనికోద్యోగులు స్పెయిన్ యుద్ధంలో పాల్గొనగూడదనిన్నీ, ఫ్రాంకోకు సహాయం చేయవద్దని యెంతగా సలహాయిచ్చినా, హిట్లరుకన్ను స్పెయిన్ లోని గనులమీద పడుటవల్ల, అతడు విద్రోహులకు సహాయంచేశి, తద్వారా, స్పెయినును ఫ్రాంకో అధీనంచెయ్యాలని నిశ్చయించు కున్నాడు. ఇప్పుడు చాలావరకు బ్రిటిష్ యాజమాన్యంలో ఉన్న స్పెయిన్ ఇనుము, బొగ్గు, రాగి గనులను తనవశం చేసుకుందామని నిశ్చయించుకున్నాడు. ఫ్రాంకో, మొరాకోనుంచి, స్పెయిన్ నుంచి, బొగ్గు, యినుమును త్రవ్వించి, తాను జర్మనీకి యివ్వవల శిన బాకీ తీర్మానం నిమిత్తం రవాణా చేస్తున్నాడని యిదివరకే చెప్పాను. ఫ్రాంసు ఇంగ్లాండులు, జర్మనీ నోక్యాన్ని మొదట్లో గాని, యిప్పుడుగాని అటకాయించిన యెడల, హిట్లరు తప్పక వెనక్కు తగ్గేవాడు. ఎందువల్లననగా, జర్మనీ అంతరంగిక పరి స్థితులే గాక, ఇంగ్లండు ఫ్రాంసులలో యీ సమయంలో మన స్పర్థలు పెంచుకొని, యుద్ధంలోకి దిగినయెడల, జర్మనీ ఆర్థిక రాజకీయస్థితి తారుమారై ఉండేది. ముస్సోలినీ ఉపన్యాసాలు, కేవలం బెదరింపులేకాక, జయప్రదంగా కార్యరూపాన పెట్టే సమర్థతకలవాడు. ఇందులకు అబిస్సీనియా తార్కాణం. హిట్లరుకు డాంబికం యెక్కువ.

# స్పెయిన్ దుస్థితి.

——(o)——

## స్పెయిన్ ప్రజలకు సహాయం.

సారక మహాశయులకు, స్పెయిన్ యుద్ధంలో విద్రోహులొనరించిన దుష్కృత్యాలను తెలియజేయుటకును, వాటిని యెదుర్కొనుటకు మహాత్యాగాలు చేసి యుద్ధభూమిలో హతులగుచున్న స్పెయిన్ ప్రజలకు సహాయం చేయవలసినదని స్పెయిన్ యువకులు కొలదికాలంక్రిందనే ప్రపంచానికి తెలియజేసిన విన్నపమును యింగులో పొందుబరచుచున్నాను. ఇదేగాక ప్రపంచ విఖ్యాతి పురుషులైనట్టి ఫాసిస్టు, ఇంపీరియలిస్టు యుద్ధాలను (సామ్రాజ్యవాద యుద్ధాలు) అంతమొందించుటకై ఏర్పాటు చేశిన "ప్రపంచ ఫాసిస్టు, యుద్ధ ప్రతికూల సమితి"కి అధ్యక్షులైన రోమేన్‌రోలాండును, ఇటీవలనే ఇండియాలో కూడా స్థాపించబడ్డ దానిశాఖకు అధ్యక్షుడయిన డాక్టరు రవీంద్రనాథ టాగూరును, స్పెయిన్ బాధిత ప్రజల సహాయార్థం యిచ్చిన విజ్ఞప్తిని యిక్కడ ఉదహరిస్తున్నాను. వీటిని చదివిన ప్రతివ్యక్తి గుండెలు అవిసిపోయి, కండ్లవెంట అశ్రువులు బొటబొట రాలక మానవు.

## స్పెయిన్ యువకుల మొర.

"నేడు స్పెయిన్ యువకులు, యువతీమణులు మాదేశంలోని యువతీ యువకుల భవిష్యత్తుకొరకేగాక, మానవ ప్రపంచంయొక్క సౌఖ్యంకొరకు పోరాడుచున్నారు. స్పెయినులో, క్రూరమైన స్వాభిలాషచే ప్రేరేపింపబడి, కొందరు

పై స్వాధికారులు, ఫాసిస్టు నుండగీండ్రు కుట్రచేసి, ప్రజాబాహుళ్యంచే చట్ట సమ్మతంగా ఎన్నుకొనబడ్డ ప్రజాస్వామ్యంమీద తిరుగబడ్డారు. ఇప్పుడు ముఖ్యమైన బలవత్తర సమస్య యిది అభివృద్ధియా, లేక వికృత స్వరూపం తాల్చిన ప్రతిఘాతమా? శాంతియు, విజ్ఞానమా, లేక అనాగరికత, మృత్యువా మనము కోరేది? స్పెయిన్ ప్రజాసామాన్యమును, అందును ముఖ్యంగా, యువకులు జయభేరీ మ్రోగించి, ఆయుధపాణులై, యుద్ధరంగంలో నిలచి, శౌర్య పరాక్రమాదులతో శత్రువులను ఢీకొనుచున్నారు. వారి చేతుల్లో వున్నది, ప్రపంచంయొక్క భావిదశ. ....... విదేశ ఫాసిస్టురాజ్యాలవారు మాదేశంలోని విద్రోహుల తిరుగుబాటును జయప్రదంగా నెరవేర్చడానికై చేసే ప్రయత్నాలు అందరికీ తెలుసును. ఇది బహిరంగమైన విషయమే. నేడు స్పెయిన్ ప్రభుత్వసేనలు, స్పెయిన్ డిమాక్రాటిక్ రిపబ్లిక్ నే గాక ప్రపంచంయొక్క శాంతి, నాగరికతలను గూడా రక్షించటానికై పోరాడుచున్న విషయం అందరెరిగినదే.

"స్పెయిన్ యువకులకు కుడిభుజమై, కష్టకాలమునందు వారి అండనిలచి ఫాసిస్టు గుర్రంతాలనుంచి రక్షించేటట్టుగా మాడవలశినది. స్పెయిన్ ప్రజలు నిష్కపటమయిన కాథొలిక్కు మతగురువులయొక్క మత సిద్ధాంతాలను, సాంప్రదాయాలను గౌరవిస్తారు. కాని మతగురువులు తమ గౌరవం దక్కించుకొనలేక, మత సిద్ధాంత ప్రచారాన్ని మంటిపాలుచేసి, అవినీతిపరులై ప్రభుత్వంయొక్క విశ్వాసాన్ని కోల్పోయి, 'ఆధ్యాత్మిక మత ప్రచారాన్ని, అగౌరవపరచి, తమ కిచ్చిన అధికారాన్ని, మత స్వేచ్ఛను, దుర్వినియోగం చేశారు. ఫాసిస్టు కుట్రదారులలో చేరి నోటికి రానన్ని అమానుష కృత్యాలొనరించుచున్నారు. కాబట్టి ప్రపంచ యువకులారా, స్పెయిన్ ప్రజల మొర యాలకించి

వారికి పూర్తిగా తోడ్పడి, ఫాసిస్టుల దాడినుంచి మిత్రులను రక్షించుకొనుడు.''

గోమేజ్ డిలాండు యిల్లా వ్రాశాడు —

''... .. ..సనాతన ప్రపంచంలో సగానికి పైగా అధికారం వహించి, పాశ్చాత్య నాగరికతకు ముఖ్య కేంద్రాలలో ఒకటియైన మాడ్రిడ్ నగరం, నేడు ఫాసిస్టు గురహంకారులవల్ల ఆఫ్రికన్ మూరులు, విదేశ సైనిక దళాలవల్ల భస్మీపటలం కాబడుచున్నది. స్పెయిన్ ''జాతీయ స్వాతంత్ర్యం'' కొరకు పోరాడుచున్నామని సిగ్గు, లజ్జలేక చెప్పుకొను ఫాసిస్టు నాయకులు నేడు స్పెయిన్ యొక్క అపారమయిన ఆస్తులను దోపిడిచేసి, నాగరికతను కాళ్ళక్రింద మట్టగిస్తున్నారు.

''వేలకు మంది స్త్రీలు, పసిపాపలు చిత్రవధచేయబడుచున్నారు. సజీవులుగానున్న వారిని సహితం భగ్గు భగ్గున మండుచున్న అగ్నిలో త్రోయుచున్నారు.... ........వందలకొలది సంవత్సరాలనుంచి దాచివుంచబడ్డ చిత్తరువులను, శోభాయమానమైన చిత్రశాలలను నేలమట్టం చేయుచున్నారు. ఏ మాడ్రిడ్ నగరము యీ నాటిన దుర్భర బాధల ననుభవిస్తున్నదో, అట్టి మహాపట్టణము, యూరప్‌మీద అరేబియా దేశం దండెత్తి వచ్చినప్పుడు, యూరప్‌ను రక్షించింది. విశ్వాస ఘాతుకులైన ముసోలినీ, హిట్లరులు, స్పెయిన్ దేశాన్ని, ఇటలీ, జర్మనీల ఆయుధబలంచేత నాశనం చేస్తున్న ఫ్రాంకో ''గవర్నమెంటును'' సక్రమమైనదేనని ఒప్పుకోడానికి సాహసించారు. పేరు ప్రతిష్ఠలు కలిగిన ఐరోపాలోని దేశాలు నాగరికతకు తల్లులవంటి వయ్యీను, తోడేళ్లవలె, తోటి దేశమయిన స్పెయినును కూడా వాటి పొట్టన పెట్టుకొనజూచుచున్నాయి.

"మానవులారా! నిగ్రోషా, అమెరికా ఖండవాసులారా! ఈ మానవి మీకే! లేలెండు; స్పెయినుకు సహాయంచేయ నడుము కట్టుడు. మాకు సహాయం చేయండి. ఇంతేయేల? మీరు మీ కొరకే సహాయంచేసుకోండి. ఏలనన, మీరు, మేము అందరమూ యిప్పుడు శత్రువులచేతుల్లో నాశనం కావడానికి సిద్ధంగా ఉన్నాము. అమాయకులైన స్త్రీలను, పసిపాపలను, అమూల్యము లయిన సంపదలను నాశనం కానీయకుడు. మీరు మానంవహించి ఊరకున్నయెడల, రేపు మీ పసిబిడ్డలు, మీ భార్యలు, మీ ప్రియ మయిన సర్వస్వముతో మీరును రూపుమాసి పోవుదురు. త్వర పడుడు. ఫాసిస్టు దౌర్జన్యముల నరికట్టుడు. కార్యశూరులుకండు. ఏ విధమయిన జాతి, మతభేదములు పాటించక, ఏకోన్ముఖంగా ఒకే మాటమీద నడచి, స్పెయిన్ బాధితులకు సహాయం చేయ వెంటనే త్వరపడుడు!"

కవిసార్వభౌముడైన రవీంద్రనాథ టాగూరు యీ క్రింది విధంగా వ్రాశాడు:—

"స్పెయినులో ప్రపంచ నాగరికత నేలమట్టం గావింపబడు చున్నది. స్పెయిన్ ప్రజాప్రభుత్వానికి విరుద్ధంగా ఫ్రాంకో కత్తి కట్టినాడు. విద్రోహులకు అనుకూలంగా అంతర్జాతీయ ఫాసిస్టు శక్తులన్నీ కలిసి, మనుష్యులను, ధనాన్ని పంపుచున్నాయి. మూరుసైన్యాలు, విదేశవిద్రోహ సైనికపశాలు సస్యశ్యామలమైన స్పెయిన్ భూములను భస్మీపటలం గావించుచు, భీకర హత్యా కాండములతోను, ఆకలిమంటలచే నెలరేగు ఆహాకారములతోను, ఎడబాటులతోను, స్పెయినుదేశాన్ని తాండవింప చేస్తున్నారు.

"విజ్ఞానమునకును, కళలకును మకుటమైన స్పెయిన్ భస్మీ పటలము గావింపబడుచున్నది. అమూల్యమయిన కళా చిత్రములు

విద్రోహుల బాంబులవర్షముచే నేలమట్టం గావింపబడుచున్నవి. చివరకు వైద్యాలయాలు, శరణాలయాలుకూడా ఘాతుకకృత్యాల నుండి తప్పించుకొనలేక పోవుచున్నాయి. స్త్రీలు, పసిపాపలు సైతము హత్య గావింపబడుచున్నారు. వేలకువేలు కార్మికకర్షకులు, యువకులు నిరాధారులుగా చేయబడుచున్నారు.

"అంతర్జాతీయ ఫాసిజంయొక్క యీ ఘాతుక ప్రవాహమును అరికట్టవలయును. స్పెయిన్ ప్రజలు పొందుచున్న ఈ విషమ పరీక్షాసమయంలో, ప్రతిమానవ హృదయమునకు నేను మొరపెట్టుచున్నాను.

"స్పెయిన్‌లోని సమ్మిళిత సంఘట్టన ప్రభుత్వానికి, Popular Front Government) అండగా నిలువుడు! స్పెయిన్ ప్రజాప్రభుత్వానికి సహాయం చేయుడు!! విద్రోహానికి "కబడ్దార్, జాగ్రత" అని కోట్లకొలది ఐక్యకంఠాలతో ఎలుగెత్తి అరవండి!!! లక్షలాదిగా నడుములుబిగించి, ప్రజాస్వామికమును, నాగరకతను, విజ్ఞానమును రక్షించుటకు రండు!!!"

చైనా సోవియట్ ప్రభుత్వాధ్యక్షుడైన "మా-శె-టంగ్," చైనా కమ్యూనిస్టు పార్టీ తరపునను, కమ్యూనిస్టు సైనికదళాల తరపునను, యీ క్రింది సందేశాన్ని స్పెయిన్ ప్రజాసామాన్యానికి పంపాడు —

సోదరులారా,

స్పెయిన్ రిపబ్లిక్ ప్రభుత్వం ఫాసిస్టు హంతకులతో చేయుచున్న ఘోరయుద్ధాన్ని, చైనా కమ్యూనిస్టు పార్టీ, కమ్యూనిస్టు సైన్యం, సోవియట్ ప్రభుత్వంకూడా అతిపవిత్రమైనదిగా పరిగణిస్తున్నాయి. ఈ మహాయుద్ధం ఒక్క స్పెయిన్ ప్రజాస్వామ్యం కొరకును, నాగరికతా విజ్ఞానముల కొరకే గాక, యావత్ప్రపంచ

శాంతి సౌఖ్యాలకొరకు గూడా పోరాడుబడుతున్నది. దూర ప్రాచ్య దేశంలో (Far East) చైనా స్వాతంత్ర్యాన్ని ధ్వంసం చేసి, చైనాను స్వాధీనం చేసుకోడానికై యుద్ధం చేయుచున్న ఫాసిస్టు జపానుకు, జర్మనీ ఇటలీలు సహాయం చేయుటవల్లను, మిమ్మను కూడా రూపుమాపుటకై విశ్వ ప్రయత్నాలు చేయుచున్న పై రెండు దేశాలతో మీరు పోరాడవలసి వచ్చుటచేతను, స్పెయిన్, ప్రపంచ శాంతికొరకే తన సర్వస్వం త్యాగం చేయుచున్నదని చెప్పవలసియున్నది. జపాన్ ఫాసిస్టులు తమ యావత్తు బలాన్ని చైనామీద ప్రయోగించుచున్నారు. మామంచూరియా రాష్ట్రాలను ఆక్రమించుకున్న తర్వాత, వీరు ఉత్తర చైనాలోనికి ప్రవేశించారు. జర్మనీ ఇటలీలనుంచి సహాయం రానియెడల వీరికి యింత యుద్ధపిపాస, యింత ఆయుధ బలగం నేడు కలిగేదే కాదు.

శత్రు నిర్మూలనకై సమ్మిళిత సంఘట్టనలో ప్రవేశించిన స్పెయిన్‌లోని వివిధ రాజకీయ కక్షులయెడల చైనా కమ్యూనిస్టు పార్టీ తన సంపూర్ణ సానుభూతిని వెల్లడిస్తున్నది. ఈ విధంగానే చైనాలోని వివిధ రాజకీయ కక్షులు ఐక్యమై జపాన్ ఫాసిజాన్ని మట్టగించవలెనని మేము ఉద్బోధిస్తున్నాము. మా కార్యక్రమం అతితీవ్రంగాను పట్టుదలతోను సాగుతున్నది. ఈ ప్రయత్నంలో మేము సఫలం చెందినయెడల, జపాన్ సామ్రాజ్యం విధ్వంసం అయిందన్న మాటే. దీనివల్ల స్పెయిన్ ప్రజలకు విపరీతమైన ఆనందం, అండ కలుగగలదని మా పూర్తి నమ్మకం.

చైనా జాతీయపోరాటాన్ని, స్పెయిన్ పోరాటాన్నుంచి, యెంత మాత్రం విడతీయ వీలులేదని మా నిశ్చితాభిప్రాయం. మాడ్రిడ్ రక్షణార్థం మీరు ప్రకటించిన అకుంఠితత్యాగ పరాక్రమాలు, చైనా కమ్యూనిస్టు పార్టీని, చైనా సోవియటు ప్రభు

తాన్ని, కమ్యూనిస్టు సైన్యాన్ని ఉత్సాహపూరితులను చేశాయి. మీ జయపరంపరలను, శౌర్య పరాక్రమాలను, యితర యుద్ధ విషయాలను మా సోవియట్ పత్రికల్లో ప్రతిదినం ప్రకటిస్తునే యున్నాం. మా రేడియోలద్వారా మీ యుద్ధ పరిస్థితులను అనుక్షణం తెలుసుకుంటూనే యున్నాం. వివిధ రాజకీయ కక్షుల సమ్మేళనమీదనే మీ అంత్య విజయం యొక్కువగా ఆధారపడుననని మాదృఢ విశ్వాసం. మీ కమ్యూనిస్టు పార్టీ యొక్క 'దశాంశ ప్రణాళిక' ను మేము సాకల్యంగా చదివి, దానిని పూర్తిగా ఆమోదిస్తున్నాం. దూరప్రాచ్య దేశంలో మేము జపాన్‌తో చేస్తున్న యుద్ధం మీ యుద్ధం మాదిరిదే. తక్కిన విషయాల్లో పోలికలలుండనిచ్చి, ముఖ్యంగా ట్రాట్స్కీ పార్టీ సభ్యులవంటి దేశద్రోహులు మీలో మాదిరిగా మాలో కూడా దాగియుండకపోలేదు. ఇట్టి ద్రోహులను నిర్దాక్షిణ్యంతో శిక్షిస్తేనేగాని మన పోరాటానికి బలం అధికమై జయం కలుగ నేరదు. మా పక్షంలోని శత్రువులను రూపుమాపుట, మీ స్వాతంత్ర్య పోరాటానికి చేయూతయిచ్చినట్లే యగును. మా సంచికలలోను, వార్తా పత్రికల్లోను, మీ పోరాటానికి సంబంధించిన వ్యాసములు, చిత్రపటములు విపరీతమైన సానుభూతితో ప్రకటింపబడుతున్నాయి. మీ పోరాటంలో గాంచిన జయం, మాకు అధికోత్సాహాన్ని కలిగించి, సత్వరవిజయం లభింపజేస్తుందంటే, అతి శయోక్తి యేమీ లేదు. మీ ఆదర్శమే మా ఆదర్శం; మీ ప్రతిజ్ఞయే మా ప్రతిజ్ఞ. వివిధదేశాలనుంచి ఫాసిజానికి శత్రువులైన ప్రజాతంత్రవాదులు, అంతర్జాతీయ సైనికదళములను నిర్మించి, స్పెయిన్ రక్షణార్థమై పంపడం మాకు అత్యంతానందమైన విషయం. ఈ సైనిక దళాలలో అనేకమంది జపాన్, చైనా దేశస్థులు లేకపోలేదు. చైనా కమ్యూనిస్టు సైన్యములలో

అనేకవేలమంది యీ రోజున మీతో చేతులు చేతులు కలిపి ఫాసిజాన్ని ఇంపీరియలిజాన్ని ధ్వంసంచేద్దామని సిద్ధంగానున్నారు. కాని తుచ్ఛశత్రువైన జపాన్, యిట్టి తరుణమున యుద్ధానికి కాలు దువ్వనియెడల, నిస్సందేహంగా మీతోచేరి పోట్లాడేవారే. 10 సంవత్సరాల కాలం భరింపరాని యిడుములబడి, మంచులోను, కొండలో యల్లోను, అరణ్యాల్లోను, ఆకలి బాధకోర్చుకొని, ఆయుధ పరికరాలుచాలినన్ని లేక, పోరాడి పోరాడి, చివరకు విజయంపొందగలిగాం. మామాదిరే మీరు కూడా అవస్థలపాలై శత్రువుల నెదుర్కొంటున్నారని తలచెదను. కాని, చివరకు మీకు విజయం కలుగుట నిస్సంశయం.

మా పూర్తి సానుభూతి మీయందున్నదని మీరు నమ్మాలె. కష్టాల్లోను, సుఖాల్లోకూడా మీకు మేము, మాకు మీరుగా ఉండాలె. ముఖ్యంగా స్పెయిన్ స్త్రీసముదాయం, ప్రజాస్వామ్యం కొరకు గావించుచున్న త్యాగం వర్ణనాతీతం. మీ సోదరీమణులు ప్రపంచ స్త్రీలకు మార్గదర్శినులుగా నుండగలరనుట నిర్వివాదమైన విషయం. ప్రపంచపీడిత జనసామాన్యం కొరకు మీతోకలసి పోరాడుచు, నెత్తురును ధారపోయుచున్న అంతర్జాతీయ సైనికదళాలకు సోదరప్రేమను వెల్లడిస్తున్నాం.

ఈ క్రింది సందేశాన్ని, చైనా కమ్యూనిస్టు సర్వసేనాధిపతియైన "చూ-టెహ్", స్పెయిన్ ప్రజాసామాన్యానికి పంపాడు :—

సోదరులారా,

జపాన్ సామ్రాజ్యాధికారానికి బద్ధశత్రువులైన చైనా కమ్యూనిస్టు సైనికులతరఫున, మీ అందరకు నేను ప్రేమపూర్వకమైన విప్లవాభివందనాలను అర్పిస్తున్నాను.

మేము మీకు యెంతో దూరంగా నివశిస్తున్నా, ప్రతిదినం మీ శౌర్యపరాక్రమాదులను పత్రికలద్వారా తెలుసు కొంటునే యున్నాం. ఒకవంక, మీరు పదువర్ణ నాతీతమైన బాధలకు శరీరం కంపించి, రక్తం కారుకుతున్నా, వేరొకవంక మీరు గాంచుచున్న జయపరంపరలకు అమితానందం కలుగుతున్నది. సామాన్యమైన అంతర్యుద్ధంగా బయలుదేరినను, జర్మనీ, ఇటలీ ఫాసిస్టు శత్రుహంతకుల జోక్యంవలన, అంతర్యుద్ధ స్వరూపమే మారి, అంతర్జాతీయ ఫాసిజంతో పోరాడు యుద్ధంలోనికి తయారయింది. అంతర్జాతీయ ఫాసిజంతో జయప్రదంగా డీకొను చున్న అంతర్జాతీయ కార్మిక కర్షక సమ్మేళనకు, మీరు నాయకత్వం వహించటానికి అర్హులు. మీకు, మాకు, ప్రపంచ సౌభాగ్యాని కంతకు, ఫాసిజం శత్రువగుటవల్ల, దానిని నాశనంచేయుట, ప్రపంచశాంతి నాగరికతలను స్థాపించినట్లే యగును.

సోదరులారా ! ప్రథమంలో మీరు అత్యంత కష్టదశలో నుండక తప్పిందికాదు. కాని యిప్పుడు ప్రజాసమ్మిళితసంఘట్టనా పరిపాలనక్రింద, (Peoples Front Government) అంగును ముఖ్యంగా, కమ్యూనిస్టుపార్టీ సహాయంతో, మీరు, మీ విపద్దశ నుండిదాటి, లక్షలకొలది ప్రజలను స్వాతంత్ర్య యుద్ధవీరులుగా తయారుచేశి, అభేద్యమయిన శిక్షణతో ఫాసిజాన్ని నిరోధిస్తు న్నారు. ఈ మహా పోరాటంలో యిది విజయచిహ్నమే.

మా కమ్యూనిస్టు సైన్యం, కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం క్రింద సామాన్యమైన కార్మిక కర్షకులలోనుంచి తయారై, 10 సంవత్సరాల పర్యంతం, అంతర్జాతీయ సామ్రాజ్యవాదంతోను, అంతరంగిక విప్లవ ద్రోహకరమైన శత్రు బలగములతోను, హోరాహోరిగా పోరాడి చివరకు విజయం సాధించింది. జపాన్

దాడిని అరికట్టుటకై, మేము దక్షిణ దిశనుంచి, ఉత్తరచైనాకు 8000 మైళ్లవరకు వ్యాపించుకొని దేశంలోని వివిధరాజకీయ కక్షలను, జపానును మట్టగించులకై, ఏకంచేయు తీవ్రప్రయత్నాలు చేశి చివరకు విజయం గాంచగలిగాం. ఈ నూతన విధానంవల్ల, చైనాలోని అన్యోన్య వైరాలు నశించి, 20 సంవత్సరాలనుంచి దేశాన్ని భీభత్సం గావించుచున్న అంతర్యుద్ధం అంతమొందింది. ఇప్పుడు చైనాజాతీయ సైన్యములు కమ్యూనిస్టు సైన్యాధికారుల నాయకత్వాన, కమ్యూనిస్టు పార్టీయాజమాన్యమున, జపానును ప్రతిఘటిస్తున్నాయి, చైనా కమ్యూనిస్టుపార్టీ నూతన రాజకీయ విధానాన్ని అనుసరించి, మా యిబ్బందుల నన్నిటినిదాటి, చివరకు జపాన్ సామ్రాజ్యాధికారాన్ని చైనానుంచి పారద్రోలి పూర్వ జాతీయ స్వాతంత్ర్యాన్ని ప్రతిష్ఠింప గల్గుదుమని ఘంటాపదంగా చెప్పగలం. మా సైనికవర్గంలోను ప్రజా బాహుళ్యంలోను, మీ శౌర్యపరాక్రమ త్యాగాలను ఉగ్గడించుచు విస్తారంగా ప్రచారం గావించాం. వీరంతా మీ యోధుల తమ సోదరాభి వందనాలను వెల్లడిస్తున్నారు. ప్రతి చైనా కార్మికుడు, కర్షకుడు, సైనికుడును, స్పెయిన్ పోరాటంయొక్క అంతర్జాతీయ ప్రాముఖ్యతను పూర్తిగా అర్థం చేసుకున్నాడు. మీ విజయం అంతర్జాతీయ ఫాసిజానికి తీవ్రతమమయిన బల్లెపుపోటు.

మీ యుద్ధభూమి, మా యుద్ధభూమి ఒకటే ఆకృతి కలిగి యున్నది. ఇద్దరకు ఒకేశత్రువు. పశ్చిమగోళంలో మీరు ఇటలీ, జర్మను ఫాసిజంతో పోరాడుచున్నారు; ప్రాగ్దేశంలో, మేము జపాన్ ఫాసిజాన్ని, సైనిక నియంతృత్వాన్ని తీవ్రంగా ప్రతిఘటిస్తున్నాం. కాబట్టి, సోదరులారా! మనంమనం చేతులుకలిపి శత్రువిధ్వంస మొనర్చి, ప్రజాస్వామ్యాన్ని, శాంతినాగరికతలను ప్రతిష్ఠించుదాం.

# స్పెయిన్ దుస్థితి.

——(o)——

తొ డి వ మా ట.

నేడు స్పెయినులో మహాభీభత్స రూపంతో చెలరేగుతున్న సంఘర్షణ ప్రపంచంలోని రాజకీయ శక్తులను రెండు అడ్డగోడ్ల గా విభజించింది. ఈ మహాశక్తులయొక్క స్వరూపమును, చిహ్నములును, విస్పష్టంగానే కండ్లకు కట్టినట్టు కనుపిస్తున్నాయి. ప్రజాస్వామికమూ, శాంతియూ, లేక ఫాసిజమూ, మారణ యుద్ధమూ, ప్రపంచానికి మార్గమని తేటతెల్లమవుతున్నది. ఈ సమస్యయే, యీ మహాభీకర యుద్ధంలో తేలవలసినది. అంతర్జాతీయ భవిష్యద్గతి నేడు స్పెయినులో, ప్రజాసమ్మతమయిన శక్తులకును, పశుప్రాయమైన ఫాసిస్టు గౌర్జన్య శక్తులకును జరుగుచున్న ఘోరసంఘర్షణవల్ల తేలనున్నది. హిట్లర్ 1933-వ సంవత్సరంలో అధికారంలో ప్రవేశించినప్పుడు ప్రపంచ శాంతికి యెట్లు భంగం వాటిల్లి, దేశదేశములు ఏవిధంగా గజగజ వడకినవో, నేడు స్పెయినులో జరుగుచున్న యుద్ధానికి, ప్రజలు, రాజ్యములు, రాజ్యాంగవేత్తలు కూడా కంపించి పోవుచున్నారంటే అతిశయోక్తి కాదు. ఈ యుద్ధంమీదనే రాబోవు సమిష్టి రక్షణము (Collective Security) కూడా యెక్కువగా ఆధారపడి వుంది. కాబట్టి, ఈ రకమయిన యుద్ధంలో తటస్థం అనే "దాగుడు మూత" యెంతమాత్రం పనికిరాదు. తటస్థ విధానాన్ని అనుసరించడంవల్ల వారికంట్లో వారే వ్రేలుపెట్టి పొడుచుకున్నట్లవుతుంది. ఏదేశానికైనా, ఏవ్యక్తికైనా ప్రజా స్వామికం

యెడలగాని, శాంతి నాగరికతల యెడలగాని, అణుమాత్ర మయినా, గౌరవ ప్రేమలున్నయెడల, తాటస్థ్యం వహించి ఊరుకోరాదు. స్పెయిన్ దేశమునుంచి, యితర దేశాలనుంచి వచ్చిన నిజమైన వార్తలను, ఫాసిస్టు సానుభూతిగల పత్రికలు ప్రకటించక పోవడంచేత, మనకు స్పెయిన్ ప్రభుత్వవిజయ పరంపలను గురించి సవిస్తరంగా తెలియడంలేదు. మనకు స్వాతంత్ర్య రక్షణార్థం పోరాడు స్పెయిన్ యోధులు తప్పక గెలుస్తారని మాత్రం పూర్తిగా విశ్వాసం ఉన్నది. నైతికంగాను, శారీరికంగాను, అన్నివిధాలా కూడా, స్పెయిన్ ప్రజాసామాన్యం, అందును ముఖ్యంగా కార్మికులు, స్త్రీలు, మాపుచున్న పట్టుదలను చూస్తే, ఫాసిస్టులు, మానార్కిస్టులు, యెక్కడా స్వరూపంలేకుండానే పోయేటట్లు తోస్తున్నది. మనకు వచ్చే కలితీవార్తలను బట్టి విచారించినాగాని, మన ఊహలలో సత్య మున్నది. కాని అదేమనం ఆధారంగా తీసుకొని, విచారించగూడదు. అట్లా అయినప్పటికిని, ఏ దేశమందయినా, ఏ కాలమందయినా, స్వాతంత్ర్య సంపాదనకు ముఖ్యకారకులు, కార్మిక కర్షకులు, యువకులు కాబట్టి, ఇట్టి మహాశక్తులు పోరాడుచుండగా, స్పెయిన్ ప్రభుత్వమునకు విజయం ఎట్లు సిద్ధించకుండును? అదీకాక, ప్రజా సామాన్యం యావత్తు కూడా ప్రభుత్వానికి పెట్టని కోటగా సహాయం ఉన్నది. విద్రోహులకు ప్రజాసామాన్యంలో యెంత మాత్రం కూడా అభిమానంలేదని మనకు వచ్చే స్వల్పమైన కలితీ వార్తలను బట్టి కూడా ఖండితంగా చెప్పగలం.

ఫాసిస్టు దౌష్ట్యములకు గురిఅవుతామని తెలుసుకొని, తాము సాధించేది మహత్తరకార్యం అవుటవల్ల, యెటువంటి క్రూర చర్య లనుకూడా లెక్కచెయ్యకుండా, పోయిన సంవత్సర యెన్నికలలో సమ్మిళిత సంఘట్టన మహాద్భుతమైన విజయం గాంచుటవల్ల,

స్పెయిన్, ప్రపంచరాజకీయాల్లో నూతన పంథాత్రొక్కాలని సూచించింది. ఎన్నాళ్లనుంచియో ఫాసిస్టులు, మిలిటరీ కుట్రదారులు స్పెయినును, నూతనవికాసం చెందనీయకుండా, పూర్వపు అధమస్థితిలోనే అణచియుంచి, తమయొక్క ఆశయాలను నెరవేర్చుకోడానికి, యెత్తులువేశారు. ఎత్తులను ఆచరణలో పెట్టడానికి, కష్టములపాలైయున్న స్పెయిన్ దేశంలో, ఎప్పుడు ప్రవేశించుదామా, ఎప్పుడు, చిరకాలమునుంచి తమ మనస్సునందున్న కోరికలను సాగించుకుందామా అని అవకాశంకొరకు యెదురుచూచే జర్మనీ, ఇటలీలనుంచి విద్రోహులు, సహాయాన్ని అడుగకుండానే సంపాయించుకున్నారు. నూతనంగా యెన్నికలలో లిబరల్సు, సోషలిస్టులు, డిమాక్రాటిక్ పార్టీలుగాంచిన అనుపమానమైన విజయంవల్ల, తన పూర్వపు అనామకమైనట్టి, నికృష్టమైన మతాధికారంనుంచి, జమీందారీ విధానాన్నుంచి ఒక్కమారుగా పైకి లేవదీయబడి శాశ్వతంగా తోడి దేశాలతోపాటు సర్వతోముఖమయిన వైభవంతో తులతూగుతుందని ప్రపంచమంతా ఆశించింది. ఒక సంగతి ముఖ్యంగా మనం మరచిపోగూడదు. స్పెయిన్లో యీరోజు జరుగుచున్న అంతర్యుద్ధం కేవలం వర్గకలహం. నేడు ప్రత్యక్షంగా స్పెయిన్లోని వర్గకలహం మాత్రమే కనుపిస్తూ, అగోచరంగా యూరప్ అంతటనుగూడా నివురుగప్పిన నిప్పవలె బయటపడక, కాలపరిపక్వంకొరకు యెదురు చూచుచున్నది. ఒకపక్షాన పీడింపబడు చున్న కార్మికులు, జన సామాన్యమును, స్వాతంత్ర్యప్రియులును, వేరొక ప్రక్క ఫాసిస్టులు, రక్తపిపాసులు, ఇంపీరియలిస్టు దోపిడిగాండ్రచే సహాయపడుచు, సహాయము చేయించుకొనుచున్న ఆయుధ ప్యాక్టరీల ఖామందులు, బ్యాంకర్లును కలిసి యుద్ధంలో పాల్గొన్నారు. యుద్ధం ముదిరిన కొద్ది, సమస్య విషమించి, వర్గ కలహం తీవ్రరూపం తాల్చింది.

మనం యీ రోజున మహాభయంకరమైన యుద్ధాన్ని ఎదుర్కొన బోతున్నాము. ఈ భయంకరమైన యుద్ధం తప్పకుండా రాబోవుచున్నదని, యుద్ధమునకు కాలుదువ్వేవారును, శాంతి సంస్థాపకులు సహితం యెలుగెత్తి చాటుచున్నారు. ఏ వ్యక్తిగాని, యుద్ధం రాజాలదని చెప్పినయెడల, ప్రపంచ రాజకీయ పరిస్థితులను సవ్యంగా పరిశీలించలేదని చెప్పవలసి వస్తుంది. దీనిని యెవ్వరూ కాదనజాలరు. ఈ రాబోవు యుద్ధంయొక్క భయంకర చిత్రమును ఊహించుకొనుటకుగూడా శక్యంకానంత భీభత్స రూపంతో చెలరేగి, కోట్లకొలది జనమును, సంపదను నాశనంచేసి, ప్రపంచాన్ని స్మశాన వాటికగా మార్చేస్తుంది. అనేక గకాలయిన శాంతి స్థాపక సంఘాలు, ఉద్యమాలు, “ప్రజలకు శాంతికావలె, కావలె”నను వొట్టి వెఱ్ఱికేకలు, వాగ్వివాదాల్లో కాలయాపన చేయడమేకాని, శాంతి స్థాపన, యేపద్ధతి మీద యేర్పడుతుందో, యే నూతన పంథా త్రొక్కితే, సామ్రాజ్యవాదం నాశనమయి, తన్మూలాన శాంతి స్థాపిత మవుతుందో ఆలోచించక 1914-వ సంవత్సరంలో మాదిరిగా, గాభరాపడి, క్రిందుమీదవుతున్నారు. యాదార్థమయిన పరిస్థితి యిది: ఇంకా మనం తెలివి తక్కువచేత అమాయకులమై, 1914-వ సంవత్సరంలో మాదిరిగానే పరిస్థితులను పరిశీలుస్తున్నాము. కేవలం యిది పొరబాటు. ఆరోజుల్లో అనుభవాలను దృష్టిలో పెట్టుకుని, వాటివల్ల మనం యేమేమో లాభాలను పొందుదామని భ్రమ పడుతున్నాము. ఇప్పుడు నూతన పరిస్థితులు ఏర్పడ్డాయి. వాటిని యెదుర్కొనుటకు నూతన మార్గాలు త్రొక్కవలసి ఉంటుందని మనం గ్రహించుకోలేదు. ఇది మనకెంతో చేటు తెస్తుంది. ప్రస్తుత ప్రపంచ రాజకీయ పరిస్థితులను యిచ్చట టూకీగా తెలియజేస్తాను. మొట్టమొదటి విషయం, ప్రపంచమందలి దేశాలన్నికూడా

డిమాక్రాటిక్ దేశాలనీ, వాటికి విరుద్ధంగా కత్తి తాల్చి నిల్చిన ఫాసిస్టు, కాపిటలిస్టు దేశాలని మనం విభజించాలె. మనముందు ప్రత్యక్షంగా స్పెయిన్‌లో జరుగుతున్న యుద్ధంలో ఇరుకక్షులవారికి సహాయపడుచున్న దేశాల తరహా చూచి, ఏవేవి డిమాక్రాటిక్ దేశాలో, ఏవేవి కావో తేటతెల్లంగా తెలుస్తూనే ఉన్నది. జర్మనీ, ఇటలీ, పోర్చుగల్ దేశాలు డిమాక్రాటిక్ దేశాలకు ప్రతిపక్షులుగా నిలచి రాబోయే యుద్ధంలో పోరాడుటకు సందేహంలేదు. వీటితో కొన్ని ఇతర యూరోపా. ఆసియా దేశాలుకూడా చేరుతాయి. ఇక, సోవియట్ రష్యా, ఫ్రాన్సు, స్పెయిన్, టర్కీ, యుగోస్లేవియా, ఇంగ్లండు, చెకొస్లొవేకియా, బెల్జియం మొదలయిన దేశాలు ఫాసిస్టులను రూపుమాపి, ప్రజాస్వామ్యాన్ని రక్షించడానికై నడుంకట్టి నిలుస్తాయి. ఈ రాబోయే మహాయుద్ధంలోకూడా వర్గకలహంలోని అంశాలు ఇమిడిఉన్నాయి. ఇంతమాత్రాన 1914 సంవత్సరంలో ముఖ్యమైన వర్గవిభేదాలుగాని, వర్గకలహాలుగాని లేవని చెప్పడం అవ్యక్తం. నిజంగా, వివిధదేశాల్లో 1914-లో జరిగిన యుద్ధంలో కార్మిక నాయకులు ఏవిధంగా కార్మికోద్యమాలకు ద్రోహంచేసి, ఆత్మగౌరవ రహితులై ఇంపీరియలిస్టుల పక్షానచేరి యుద్ధంచేశారో మనమంతా యెరిగిన సంగతే. నాయకులు మోసం చేసినంత మాత్రాన కార్మికులు నిద్రపోవుటలేదు. తమ్ముతామే మోసపోలేదు. వర్గచైతన్యంకలిగిన వారు కాబట్టి, వర్గసూత్రముల మీద ఆధారపడ్డ కార్మికోద్యమాలను వారే కడు సమర్థతతో నడుపుకున్నారు. వారు శాంతికై బహుపరితపించారు. కాని యుద్ధం సాగుతూనేయున్నది. లక్షలమంది అమాయకులను యుద్ధరంగంలో చంపించాయి సామ్రాజ్యవాద ప్రభుత్వాలు (ముఖ్యంగా ఇంగ్లండు, జర్మనీ.) కాని యీనాడు కార్మికోద్యమాలు, సోషలిస్టు

ఉద్యమాలు, అప్పటివలెగాక, అపరిమితమైన బలం సంపాయించాయి. ఫాసిస్టు దేశాలలోని నియంతలు కార్మిక, సోషలిస్టు సంఘాలను పైకి రానీయక నిరంకుశ చర్యలను అమలులో పెట్టి, చిత్ర వధలను గావించినను, మొత్తంమీద చాలా తీవ్ర వాదులుగా తయారై, విప్లవానికి కాచుకొని యున్నారు. సామ్రాజ్యవాదితత్వం ప్రబలియున్నంత కాలం, సామ్రాజ్యవాద యుద్ధాలు, వర్గ కలహాలు తప్పవని కార్మికులు దృఢంగా నమ్ముతున్నారు. తాము అట్టివంటి పరిస్థితుల్లో చేయవలసిన కర్తవ్యాన్ని కూడా ముందే ఆలోచించుకొని సిద్ధంగాయున్నారు. భిన్న భిన్నము లయిన సోషలిస్టు, కార్మిక శాఖలను దగ్గరకు చేరదీసి, ఫాసిస్టు గాడిని నిరోధం చేయుటకు చురుకుగా ఏర్పాట్లు చేసుకొనుచున్నారు. నేడు స్పెయిన్‌లో పోరాడు ప్రజల మోస్తరే, రేపు రాబోవుచున్న సంగ్రామంలో కూడా ఇంతకన్న యెక్కువగా కూడా పోట్లాడడానికి సిద్ధంకావాలె. ముఖ్యంగా కార్మిక కర్షకుల రాజ్యమగు సోవియటు రష్యాను, ఇంపీరియలిస్టు, ఫాసిస్టు రాజ్యాలు నిర్మూలంచేయడానికి సిద్ధంగా నున్నవి. కాబట్టి, ప్రపంచ కార్మిక కర్షక సమ్మేళన ముఖ్యంగా రష్యాకు సహాయంచేసి కబళింపబడకుండా చూచుకోవాలె.

ఉత్తరోత్తరా ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని అనుభవిస్తున్న స్పెయిన్, ఫాసిస్టు, ఇంపీరియలిస్టు ఆశయాలకు ప్రక్కలో బల్లెం మాదిరిగా ఉంటుంది. ఎందుకనగా, యుద్ధసమయంలో, జిబ్రాల్టర్ జలసంధిని తన అధీనంలో ఉంచుకొని, శత్రువులను దగ్గరకు రానీయదు. ఇంతకాలమునుంచి కూడా స్పెయిన్ దేశాన్ని బలహీనంగాను అశక్తుర్గాలుగాను చేయడం, బ్రిటన్ దేశం తన విధానంగా పెట్టుకున్నది. ఏలనగా, జిబ్రాల్టర్ చుట్టుప్రక్కల ప్రదేశాలను బలవత్తరమైన శత్రువు తన అధీనంచేసుకున్న యెడల,

జిబ్రాల్టర్ జలసంధివల్ల అపాయకరమైన పరిస్థితుల్లో, అంతగా లాభంకలుగదు. అదీగాక స్పెయిన్, ఫాసిస్టుల చేతిలో పడ్డ పక్షంలో, ఫ్రెంచి ప్రజాప్రభుత్వానికి చాలా అపాయం తటస్థిస్తుంది. ఈ విధంగా మెడిటరేనియన్‌లో ఫాసిస్టులు పూర్తిగా బలవంతులవుతారు. తటస్థ విధానంలో బ్రిటన్, నిష్పక్షపాత బుద్ధికూడా వహించక, హిట్లర్, ముస్సోలినీలకు అనుకూలమైన పరిస్థితులు అప్పుడప్పుడు కల్పించింది. హిట్లరు ముస్సోలినీలను తటస్థ విధానాన్ని తూచాతప్పకుండా అనుసరించుటకు బ్రిటన్ కఠినచర్యను తీసుకోకుండా, విధానాన్ని సాగనీయకుండా, ప్రతి నిముషం అడ్డుపుల్లలువేశి, కాలయాపనచేయడం మొదలు పెట్టింది. కాబట్టి, కన్సెర్వేటివు ప్రభుత్వం యొక్కయు, బూర్జువావర్గం యొక్కయు, పత్రికాధిపతుల యొక్క సానుభూతి ఫాసిస్టు విద్రోహులయెడల పూర్తిగానున్నదనుటకు సందేహంలేదు.

బ్రిటిష్ కన్సెర్వేటివ్ పార్టీలో ఒకశాఖవారు, స్పెయిన్ అంతర్యుద్ధంలో ఇటలీ, జర్మనీలు గావించుచున్న జోక్యానికి, బ్రిటిష్‌ప్రభుత్వం చేయూతయిచ్చి, వాటితో లాలూచి చేసుకొని ప్రోద్బలం చేయుచున్న సంగతివిని చాలా భయపడుతున్నారు. బహిర్గతంగా సోవియటు రష్యాయెడల, అనేకవ్యక్తులును, రాజకీయసంస్థలును విముఖత ప్రకటించినా, అంతరంగికంగా, శాశ్వతమైన శాంతిసంస్థాపన, ప్రజాయత్త సూత్రసంరక్షణ, సోవియటు రష్యాతో సంధిచేసుకుని దానిసలహాల ననుసరించందే, యెన్నటికిని, సంభవముకాదని వారికి తెలియకపోలేదు. బ్రిటిష్ ప్రభుత్వం యెడల కలిగిన అసంతృప్తి క్రమంగా మిలిటరీ, నావికాశాఖలకు వ్యాపించింది. ఇటీవలనే ఫ్రాంకో ఉత్తరస్పెయిను ప్రాంతంలో కొన్ని ముఖ్యపట్టణాలను ముట్టడిస్తున్నప్పుడు, మెడిటరేనియన్ సముద్రములో పనిచేయుచున్న బ్రిటిష్ నావికాధికారులు ప్రభు

త్వంతో తీవ్రంగా తమ అసమ్మతిని వెలిబుచ్చి, రాజీనామా యిచ్చు టకుకూడా సిద్ధమయినారు. స్పెయిన్ తటస్థదేశంగాగాని, లేక, బ్రిటిష్ ఫ్రాన్సుదేశాలకు లోబడి గాని లేనియెడల, ఇంగ్లండుకు మెడిటరేనియన్‌లో వూరుపేరులేక పోవలశివచ్చుననియు, ఇటలీ జర్మనీలు పట్టపగ్గములు లేక, ఇంగ్లండును మించి విచ్చలవిడిగా యూరప్ అంతటా కూడా సంచరిస్తూ, తమ సామ్రాజ్యమునకు బలవత్తరమైన పోటీ దారులుగాను, కంటకులు గాను పరిణమిస్తా రని కన్సెర్వెటీవు శాఖలయొక్కయు, మిలిటరీ నావికాధిపతుల యొక్కయు తీవ్రభయం. ఈవిధంగానే ఫ్రెంచి ప్రభుత్వం కూడా భయపడుతున్నది. యూరప్ యావత్తులోకూడా విదేశీయ ముడి సరకులమీద, ఇటలీ ఆధారపడియున్నట్లు, మరియే యితర దేశము కూడా ఆధారపడి యుండలేదు. ఈ పరస్పర వైరుధ్య ములనుబట్టి ఇటలీ ఇంగ్లండుతో స్నేహభావంతో సంచరించవలసి వస్తుంది. కాని అటుల సంచరించక, తనకు యెదురు వచ్చిన ప్రతి దేశాన్ని లెక్కచేయక, ధిక్కరిస్తున్నది. ఈ ధిక్కరణకు కారణం, ఇటలీ అంతరంగిక క్లిష్టపరిస్థితులు. ఈ పరిస్థితులు, యెటువంటి భీభత్స యుద్ధమునయినా యెదుర్కొనుటకు లెక్క చేయక, తాము నాశనమయినా తమ ఆశయాలు (సామ్రాజ్య విస్తీర్ణత) నెరవేరవలెననియే వారి పట్టుదలగా పెట్టుకున్నారు. మెడిటరేనియన్ సముద్రంలో ఇదివరకువలె ఒక ఖైదీమాదిరిగా బంధించి వుంచబడ్డ యెడల, తన ఆశయాలు నెరవేరి, మెడిటరేని యన్‌లో ఇటలీ ప్రధాన స్థానమును ఆక్రమించుకొన లేదు.

ఇక జర్మనీకి వద్దాము. స్పెయిన్ తన ఆధీనంలో వుండవలె నని ఇంగ్లండును భయపెట్టని యెడలగాని, నిజంగా స్పెయిన్ తనకు లోబడి యుండనియెడల గాని, జర్మనీ, గత విరోధా

యుద్ధంలో గోల్పోయిన వలస రాజ్యాల (Colonies) విషయంలో బ్రిటన్ యెట్టి శ్రద్ధ తీసుకోదని జర్మనీ ధృఢవిశ్వాసం. ఈ వలస రాజ్యాలలో చాలాభాగం యుద్ధానంతరం, 'వర్సేల్సు' సంధి ప్రకారం ఇంగ్లండు ఆధిపత్యంక్రిందకు వచ్చాయి. ఈ పై పరిస్థితుల్లో, స్పెయిన్‌మీద జర్మనీ ఇటలీల పెత్తనం ఇంగ్లండుకు అంకుశంగా పరిణమించి వలసరాజ్యాల సమస్యలో జర్మనీకి అనుకూలంగా నిర్ణయించుటకు తొందర చేయును. వలస రాజ్యాల తగాదా విషయం, జర్మనీతో సక్రమంగా ఒక ఒడంబడికకు రావల నంటే, స్పెయిన్ యుద్ధంలో, బ్రిటిష్ ప్రభుత్వం తటస్థంగాగాని, రిపబ్లిక్ పక్షంగాని ఉండక, సాధ్యమయినంతవరకు రహస్యంగా నయినా, జర్మనీ ఇటలీలకు అనుకూలంగా ప్రవర్తించాలసి వస్తున్నది. పై పరిస్థితులలో జర్మనీ ఇటలీలు సఖ్యతపడి ఒకేమాట మీద నడుస్తున్నారంటే ఆశ్చర్యం లేనేలేదు. జర్మనీ ఇటలీల మధ్య తగాదాలు లేవా అనే ప్రశ్న చదువరులకు ఉదయించడం సహజం. తగాదాలు లేకపోలేదు. ఈ సమస్య చాలా బాహుళ్య మయిన దవుటవల్ల, లోతుకు పోవుటకు యిచ్చట సావకాశం లేదు. ఆస్ట్రియా స్వాతంత్ర్యమును యిప్పటివరకు రక్షిస్తానని అభయ హస్తమిచ్చిన ఇటలీ, యిప్పుడు యీ విషయం జర్మనీతో సంధికి అడ్డువచ్చినదని, జర్మనీకి యీవిషయంలో సర్వస్వాతంత్ర్యం యిచ్చింది. సెంట్రల్ యూరపియన్ విషయాల్లో కూడా, పై రెండు దేశాలకు తగాదా లున్నప్పటికి, ప్రస్తుతం వాటిని పైకి రానీయక అంతకంటె యెక్కువ లాభకరమయిన విషయాల్లో అన్యోన్య సహకారం కావించుకొంటున్నాయి. దీనికి ప్రతిఫలంగా స్పెయిన్ యుద్ధంలో ఇటలీకి పూర్తి అండయిస్తున్నది. గడచిన ఇటలీ-అబిసీనియా యుద్ధంలో, జర్మనీనుంచి ఇటలీని వేరుపరచు నిమిత్తమై, ఇంగ్లండు ఫ్రాన్సు దేశాలు ఇటలీకి

అబిస్సీనియామీద దండయాత్రకు పూర్తి అవకాశం యిచ్చి ముభావంగా వూరుకున్నాయి. కాని వారి అభిమతం యీ డేరలేదు. నేడుకూడా స్పెయిన్ యెడల బ్రిటిష్ ప్రభుత్వ విధానానికిగల ముఖ్యకారణాల్లో యిది; ఒకటి. ఇటలీ జర్మనీలు ఫ్రాంకోకు సహాయంచేయడం ఇంగ్లండుకు చాలావరకు వెఱుపయినప్పటికిని యీ అపాయం కొంతవరకు దాటిపోయింది. ఏలనన, బ్రిటిష్ ధనాఢ్యులు, వ్యాపారస్థులు ఫ్రాంకోకు కావలశిన ధనాన్ని అప్పు పెట్టుమా, తర్వాత్రలాన స్పెయిన్ రాజకీయాధికారంలో వారు కూడా కొంతవరకు పాల్గొనవచ్చునని వారు ధృఢంగా నమ్మి సాగారు. కాని వీరి ఆశలన్ని అడియాశలవుట సత్యం. కాబట్టి పై జెప్పిన ప్రకారంగా, ఇంగ్లండు రెండు అపాయకరమైన విధానాలలో యేదో ఒకదానిని అవలంబింపక తప్పదు. రెండు విధానాలలో తక్కువ అపాయకరమైన విధానాన్ని (Policy of lesser evil) కోరుతున్నదా అని గట్టిసందేహం కలుగుతున్నది. పూర్వానుభవంబట్టి చూచినయెడల, చైనాలో బ్రిటన్ అనుసరించిన తక్కువ అపాయకరమైన విధానంవల్లను, (చైనాలో "క్యూమింగ్ టాంగ్" యొక్కయు, చైనా విప్లవశక్తులయొక్క బలాన్ని నిరోధించుటకై చైనామీద జపానువారి దాడిని సహించి వూరుకున్నది.) ఇటలీ-అబిస్సీనియా యుద్ధ సందర్భంలోను, (ఇచ్చట ఇంగ్లండు, మధ్యధరాసముద్రంలో ఇండియాకు వచ్చు మార్గమధ్యమున తన బలమును క్షీణింపచేసుకుని, ఇటలీకి ముఖ్యమైన స్థానమిచ్చుటయా, లేక, ఫాసిస్టురాజ్య సౌధమును నేలమట్టం గావించుటయా యనునవి ముఖ్యమైన రెండు సమస్యలు), పరిస్థితులు మరింత విషమరూపం దాల్చి, తనదేశానికే ముప్పు తెచ్చిపెట్టుకొనడం గాకుండా, యీవప్రపంచాన్ని మరల యింకోసారి యుద్ధానికి దారితీసింది.

బ్రిటిష్ గవర్నమెంటు దృక్పథాన్నిబట్టి పరిశీలిస్తే, యుద్ధంలో ఫాసిస్టులు గెలిచేయెడల, మెడిటరేనియన్ సముద్రంలో అధికారాన్ని పంచుకోక తప్పరు. బ్రిటిష్ సామ్రాజ్యాన్ని రక్షించుకోవలనంటే, ముఖ్యంగా ఇంగ్లండు మెడిటరేనియన్‌లోను, ఎఱ్ఱసముద్రంలోను (Red Sea) తన అధికారాన్ని నిలుపుకోవాలె. ఈ మార్గాలమధ్య కాపలాగాయుచున్న బ్రిటిష్ రక్షణసైన్యం తనప్రత్యర్థి చేతిలో ఓడిపోవడం తటస్థించినయెడల, భవిష్యత్ కాలంలో బ్రిటనకు సామ్రాజ్యంవల్ల అంతగా సహాయం కలుగకపోగా, విఘ్నంగాకూడా ఉంటే ఉండవచ్చును. బ్రిటిష్ సామ్రాజ్యవాదులేకాక, యితర సామ్రాజ్య దేశాలుకూడా, మెడిటరేనియన్‌లో బ్రిటిష్‌వారియొక్క అధికారావశ్యకతను గురించి యెప్పుడూ గుర్తిస్తూనే యున్నారు. ఎథియోపియాను ఇటలీ కబళించిన నాటనుంచికూడా, ఎఱ్ఱసముద్రం యొక్క తూర్పుద్వారంలో ఇటలీ కట్టుదిట్టమైన స్థానాన్ని సంపాదించుకొన్నది. ఈ పర్వత గుర్గమునుంచి ఎఱ్ఱసముద్రంలోగుండా బయటికి పోవునట్టియు, బయటనుంచి సముద్రంలోనికి వచ్చునట్టి నావికావ్యాపారంమీద ఇటలీ అధికారం సంపాయించుకోటానికి పూర్తిగా అవకాశా లేర్పడినాయి. ఈ అధికారంవల్ల, కోట కందకములచే బలపరుపబడిన బ్రిటిష్‌రక్షణ సైన్యాన్నిగూడా యెందుకూ పనికిరాకుండా చెయ్యగలుగు సామర్థ్యం ఇటలీకి కలుగుతుంది. బ్రిటిష్ గవర్నమెంటుకు సూయజు కాలువ బలమైన ఆధారం కదా అని పాఠకులకు సందేహంకలుగవచ్చును. కాని కేవలం సూయజ్ కాలువ బ్రిటిష్ వారి అధీనంలో ఉన్నంతమాత్రాన లాభంలేదు. దాని ప్రాముఖ్యతను కోల్పోయింది. ఎందువల్లననగా ముందురాబోయే సామ్రాజ్యవాద యుద్ధాల్లో యెక్కువగా విమానాలు ఉపయోగింపబడుట వల్ల,

సూయజ్, మాల్టా, జిబ్రాల్టర్‌వంటి చిన్న చిన్న రక్షణశాలలు, పరిసరప్రదేశమంగున్న బలవత్తరమయిన దేశాలయొక్క వైమాని కాశ్రయముల శక్తిముండటను, నవీన మారణయంత్ర శక్తిముంద రను, ధూపానికి ఆగజాలవు. వాటిదయకు పాత్రులుగానే ఉండాలె. కాబట్టి, బ్రిటన్ మెడిటరేనియన్ సముద్రంయొక్క తూర్పుద్వారాన్ని కోల్పోతుందన్నమాట. ఇంతకుముందు చెప్పిన ప్రకారంగా, మాల్టా యిప్పటి పరిస్థితుల్లో, యెందుకూ రక్షణకు ఉపయోగించదు. ఇటలీ బాంబులకు గురికాకతప్పదు. దీనికి తోడుగా, ఇటలీదేశం ఉత్తరఆఫ్రికాలో అభేద్యమయిన కోట బురుజాలను, రక్షణశాలలను ఏర్పాటుచేస్తూ, మెడిటరేనియన్ రాజ కీయాల్లో ప్రధాన పాత్రవహిస్తున్నది. ఒకవేళ, ముసోలినీ సహాయంచేత ఫాసిస్టులు స్పెయినును జయించి, ఇటలీ స్పెయినులమధ్య అన్యోన్యగాఢ మైత్రి యేర్పడిన పక్ష మున, నేడు మాల్టా యెట్టి అప్రధానమయిన స్థానమును వహించి, యెందుకూ పనికి రాకపోవుచున్నదో, అటు వంటి స్థితియే జిబ్రాల్టర్ జలసంధికికూడా సంభవిస్తుంది. జిబ్రా ల్టర్ జలసంధికి రెండువైపులా బలవత్తరమయిన ఫాసిస్టు ప్రభుత్వ ములు అధికారం చెలాయిస్తూ, ముసోలినీతో సంబంధబాంధవ్య ములు ఏర్పరచుకున్నయెడల, మెడిటరేనియన్ సముద్రంయొక్క యాజమాన్యం తప్పక ముసోలినీకి స్థిరపడును. ఇంత యెందుకు ? స్పెయిన్‌యుద్ధంలో ఫాసిస్టులకు జయం కల్గిందంటే, బ్రిటన్‌చేతిలో యింతకాలంనుంచి ఉన్న తూర్పుసముద్రమార్గము ముసోలినీ వశమవుతుందన్నమాట. ఇందుకు సందేహం యెంత మాత్రంలేదు. అప్పుడే బేలరిక్ దీవులను, ఉత్తర ఆఫ్రికాలోని కొన్ని వలసప్రదేశాలను తనకు మొదటినుంచి సహాయంచేస్తున్న ముసోలినీకి బహుచులిగా యివ్వదలచినట్లు రూఢియైన వార్తలు

వచ్చాయి. చిరకాలంనుంచికూడా ముస్సోలినీ హృదయంలో యెట్టి ఆశయంకలదో అట్టి పూర్వపు రోమక సామ్రాజ్యాన్ని తన కండ్ల యెదుటనే పునర్నిర్మాణం చేయవలయునని త్వరపడు చున్నాడు. ఈ ఆశయం నెరవేర్చుకొనుటకే యీ ప్రబల ప్రయత్నాలు.

స్పెయినులో ఫాసిస్టు నియంతృత్వం స్థాపించిన యెడల, ఫ్రాన్సుకు అపారమైన నష్టం కలుగుతుంది. అనేక పర్యాయాలు, ఫ్రాంకోయిత్యాదులు తాము గెల్చినయెడల, ఇటలీలో మాదిరిగా ఫాసిస్టు సూత్రాలమీద రాజ్యాంగ నిర్మాణంచేసి, ఫ్రాన్సుకు వ్యతిరేకంగా, ఇటలీ జర్మనీలతో పొత్తు కుదుర్చుకుంటామని చెప్పియున్నారు. ఈ ప్రకటన ఫ్రెంచి ఫాసిస్టులకు చాలా సంతోషం కలిగించింది. ఫ్రెంచి ఫాసిస్టులకు దేశస్వాతంత్ర్యం నిలుపుకుందామని యేమాత్రం యిచ్ఛలేక, బ్రిటిష్ సామ్రాజ్యవాదుల మాదిరిగా తమ వర్గలాభాలను పొందుటకై యెట్టి త్యాగాలను, యెట్టి నీతి దూరమయిన పనులనుకూడా చేయసాహసిస్తున్నారు. కారణం, వారికి ప్రజాస్వామికం అంటే అసహ్యం; దానివల్ల వారి వర్గలాభాలను పొందడం అసాధ్యం. స్పెయినులో విద్రోహులే జయంగాంచిన పక్షమున, ఫ్రెంచి ప్రజాస్వామికమునకు విరోధులయిన ఫాసిస్టు దేశాలచేత ఫ్రాన్సు ముట్టడింపబడుతుంది. ఫ్రాన్సుకు అనుకూలంగాయున్న దేశాలనుంచి సహాయంకూడా రానీయు రాకుండా, ప్రతిక్షణముమ, అవకాశంకొరకు నిరీక్షిస్తుంటారు. ఇంతేకాదు. యుద్ధ సమయంలో మెడిటరేనియన్ సముద్రంలో ఉన్న ఫ్రెంచి నౌకాదళం కూడా విరోధులచేత ముట్టడింపబడి, తనకు సహాయులైన యితర దేశాలనుంచి కూడా దూరంచేయబడుతుంది. ఒక ప్రక్క ఇటలీచేతను, యింకొక ప్రక్క స్పెయిన్ సముద్రతీరంచేతను, చుట్టబడి, ఫ్రాన్సు, ఉత్తర ఆఫ్రికాలోని

తన వలస రాజ్యాలతో సంపర్కం కూడా వదులుకోవలశివస్తుంది. అప్పటికి శేలరిక్ దీవులు ఇటలీ చేతుల్లోనే ఉన్నయెడల, (బహుశః ఆల్లే జరుగును) ఆ దీవులును, సార్డీనియాకూడా మెడిటరేనియన్ లోకి రాకుండా ఫ్రెంచి నౌకాదళాన్ని అటంకపరచగలవు. అటువంటి యుద్ధ సమయంలో, ఉత్తర దక్షిణ ఫ్రెంచి నావికాదళాలు, జిబ్రాల్టరులో ఫాసిస్టు స్థానబలిమివల్ల ఒకదానినుంచి ఒకటి వేరువడక తప్పవు. తూర్పు ఇటలీ వలస ప్రదేశాలును, యితర సామంత రాజ్యాలును, రష్యను నల్లసముద్రపు నావికాదళము ను ఫ్రెంచి నావికాదళములతో చేరి సహాయం చెయ్యానియ్యకుండా అడ్డగిస్తాయి. కాబట్టి ఫ్రాన్సుయొక్క ప్రజాస్వామ్యంయొక్క భవిష్యత్తు స్పెయిన్ యుద్ధంమీదనే ఆధారపడి ఉన్నది.

ఫ్రెంచి వార్తాపత్రికా విలేఖరి బెర్లినునుంచి యీ క్రింది విధంగా వ్రాశాడు "స్పెయినులోని ఫాసిస్టులకు సంపూర్ణ జయం పొందాలననిన్ని, తద్వారా, ఫ్రెంచి రాజ్యాన్ని, యితర ఫాసిస్టుల సహాయంతో ముట్టడిద్దామని తీవ్రంగా ఆలోచిస్తున్నారు." ఫ్రెంచి ఫాసిస్టులు తమ పత్రికయైన "కాండైడ్" ద్వారా యీ క్రింది విధంగా వారి నిశ్చితాభిప్రాయాన్ని వెల్లడించారు "మేము పాప్యులర్ ప్రభుత్వానికి, దాని నిరంకుశత్వానికి యింతకాలం ఓపికపట్టాము. ఇకమీద సహించజాలము. ఉత్తర ఆఫ్రికానుంచి వచ్చు మాబలగముతో మా స్వాతంత్ర్యంకొరకు ప్రభుత్వాన్ని యెగురగొట్టకనక తప్పదు." జర్మనీ, ఇటలీ ఫాసిస్టు సైనికులు ఫ్రెంచి దేశాన్ని ముట్టుముట్టి నాశనం చెయ్యటానికై ప్రయత్నాలు చేయునప్పుడే పై వాక్యాలను ఫ్రెంచి ఫాసిస్టులు తెలియజేశారు. స్పెయిన్ ఫాసిస్టులు ముసోలినీకి 'బేలరిక్' దీవులను యిస్తామని చేసిన వాగ్దత్తం వట్టి వినికిడికాదు. ప్రజా తంత్రవాదులు 1931-లో అధికారంలోకి వచ్చినప్పుడే ఫాసిస్టు నాయకుడైన 'ప్రైమోడి

రెఫిరా' ఇటలీకి యీ దీవులను యిస్తాననియు, దీనికి ప్రతిఫలంగా నూతనంగా స్థాపించబడ్డ రిపబ్లిక్‌ను ఓడించుటకు సహాయపడవలసినదనియు ఖరారునామా చేసుకున్నారు. నిరుటి సంవత్సరం అబిస్సీనియాకు సంభవించిన స్థితిని యిప్పటికైన ఇంగ్లండు గుర్తించి, ఇటలీ జర్మనీలకు జవాబుగా, "స్పెయిన్, అబిస్సీనియావంటిది కాదనియు, స్పెయిన్ విద్రోహులకు ఇకమీద సహాయం చేసినయెడల, ఫ్రెంచి బ్రిటిష్ ప్రభుత్వాలు వూరుకోజాలవనియు", గట్టిగా భయపెట్టినయెడల, ఇకమీదనయినా, జర్మనీ ఇటలీలు తమ దుష్కృత్యాలను ఆపుచేయునేమో తెలియదు. అప్పటికి ప్రపంచశాంతికి యేమైనా రోజులు వుండునేమో. ఇప్పటికైనను, బ్రిటిష్ ప్రభుత్వం తటస్థ విధాన సభలు జరపడంలోను, రిపోర్టులు పరిశీలించడంలోను, సబ్ కమిటీలను నియమించుటలోను కాలయాపన చేస్తున్నది. "నిబంధనలు మార్పులు చెయ్యాలె, దీనిభాష బాగాలేదు. ఇంకొకటి తయారు చెయ్యాలె"నను దుష్క్రియలే తప్ప ఏర్పఱచిన నిబంధనల ననుసరించడం సంగతి యెగిరిపోయింది. నిబంధనలు చట్టాలు కాగితాలమీద ఉండాలసిందే. సంఘం దారి సంఘందే; నిబంధనల దారి నిబంధనలదే. అగ్నిహోత్రములో పడు మిడుతల మాదిరిగా స్పెయిన్ ప్రజలు దారుణకృత్యములకు గురియగుచున్నారు. ప్రజాస్వామిక వాగులమని విఱ్ఱవీగుచు డాంబికాలు కొట్టే పాశ్చాత్య యూరప్ రాజకీయ వేత్తలు, ప్రభుత్వాధికారులు వట్టి మోసగాండ్రు, నమ్మకద్రోహులు.

ప్రతిదేశంకూడా ఆయుధాలను, యుద్ధాలకొరకు తయారు చేసుకుంటుంది. రాత్రిం బగళ్లు కార్మికులకు విరామమే కలుగనీయక కేవలం వారిని మటుమాయలకులోను చేసి, తమతమ లాభాలను నెరవేర్చుకోడానికై, సామ్రాజ్యవాదులందరు ఫ్యాక్ట

రీలలో నవీనమయిన మారణ యంత్రాలను తయారుచేయించు చున్నారు. తక్కిన ప్రజాక్షేమకరములయిన సాంఘికావసరాలను కూడా తీర్చకుండా, యుద్ధ విషయాలలో పూర్తిగా నిమగ్నులయి పోయారు. సన్నిహిత భవిష్యత్తులో యుద్ధంరాదని, యే రాజకీయ వేత్తయు అనజాలడు. ఈ మహాయుద్ధంలో యే యే రాజ్యాలు ఎటువైపు చేరి యెవరితోటి యుద్ధం చేస్తాయో తెలుసుకోవలసి యున్నది. ఈ సమస్యను బాధ్యతగల యే రాజకీయవేత్తకూడా తప్పించుకోలేడు. దీనికి ఒక్కటే సమాధానం; స్పెయిన్‌లో నేడు జరుగుచున్న పోరాటంవల్ల యేయే డిమాక్రాటిక్ శక్తు లన్ని ఒకవైపు చేరుతాయో, యేయే ప్రతిఘాతమయిన ఫాసిస్టు శక్తులన్ని రెండవపక్షం చేరుతాయో ధ్రువపడుతూంది. ఇప్పుడు జరుగుచున్నదీ, రేపు జరుగబొయ్యేదీకూడా అసలైన వర్గపోరా టాలే. సోషలిస్టు సిద్ధాంతాలమీద స్థాపించబడ్డ రాజ్యాంగ విధానమే తమ జీవితానికి సర్వతో ముఖమయిన సౌఖ్యం చేకూర్చ గలదని నమ్ము కార్మిక కర్షకులును, ప్రజాసామాన్యంలో చేరిన యువకులు ఒకవైపునను, కాపిటలిస్టు వర్గానికి చెంది, స్వలాభాలే వారికి ముఖ్యతమములని యెంచు ఫాసిస్టువ్యక్తులు, రెండవవైపు పాల్గొంటారు. కార్మిక కర్షకులును, యితరపీడిత జనసామాన్యమును, తమయొక్క సాంఘిక, ఆర్థిక శ్రేయస్సు, నిజమైన ప్రజాస్వామ్యంమీదనే ఆధారపడి యుంటుందని గ్రహించగలుగుతారు. వీరికి వ్యతిరేకులందరు తమ అధికారం అమల్లోకి తెచ్చుకొనుటకై జీతములను తెగకోసి, సంఘములను అణచివేసి ప్రజాయత్త సూత్రములనే నాశనంచేస్తారు. ఈ పోరాటంలో ఇంగ్లండు ఏ పక్షం నిలచి పోరాడుతుంది? ప్రస్తుతం జరుగుచున్న స్పెయిన్ యుద్ధంలో రహస్యంగా నైతేనేమి బహిరంగంగా నైతేనేమి, బ్రిటన్ ఫాసిస్టులకు అనుకూలంగానే

ప్రవర్తిస్తున్న సంగతి అందరికి విశదమవుతుంది. దీనివల్ల బ్రిటిష్ ప్రభుత్వం తమకోరకు యుక్తియుక్తంగా తయారుచేయబడ్డ వలలోనికి నెమ్మదిగా ప్రవేశిస్తున్నది. మిగతా ప్రజాస్వామిక దేశాల నన్నిటిని ఫాసిస్టు పెనుభూతానికి ఆహుతియొనర్చిన తర్వాత, (అనగా, మొట్టమొదట, స్పెయిన్, తర్వాత ఫ్రాన్సు, మొదలయినవి.) బ్రిటిష్ ప్రభుత్వం, తనను తానే మోసగించుకున్నట్లు తెలుసుకుంటుంది. ఇంగ్లండు యింతగా ఏ ప్రభుత్వాలకు సహాయంచేసిందో, వాటిచే అగే అణగ త్రొక్కబడి, కొంతకాలమునకైనా, గర్వభంగం పొందడానికి సందేహం లేదు. అట్లుగాక, హిట్లరుబారినుంచి తప్పిస్తానని ఫ్రాన్సుకు అభయహస్తం యిచ్చినప్రకారం, ప్రతిజ్ఞను నెరవేర్చి, ఫ్రాన్సును రక్షించుటకు ఇంగ్లండుకు నిజమైన అభిప్రాయం ఉన్నయెడల, ఫాసిస్టులయెడల యీ రహస్యమైన సానుభూతి యెందులకు? డిమాక్రాటిక్ శక్తులు విజయం గాంచినయెడల తమయొక్క దోపిడికి, సామ్రాజ్యవాద లాభాలకు, బానిసత్వవిధానానికి తావుండదని బ్రిటనుకు స్పష్టంగా తెలుసును. ఆంతరంగిక వైరుధ్యాలచేత కాపిటలిస్టు మహాసౌధము తునీ తునకలవుచున్నది. కార్మిక కర్షకులు, యితరపీడిత ప్రజాసామాన్యమంతా, తమలో ఉన్న స్వల్పభేదాలను చంపుకొని ఐకమత్యతపొంది ప్రజాయత్త పరిపాలనావిధానంలోని వారి న్యాయమైన హక్కులద్వారా క్రమక్రమంగా ఆర్థికరాజకీయాధికారాన్ని తమ పెత్తనంక్రిందికి తెచ్చుకోటానికి ప్రయత్నాలుచేస్తున్నారు. సోవియటు రష్యా నేడు ఆచరించుచున్న సోషలిస్టు విధానాన్ని తమ దృష్టిపథమునందుంచుకొని, అనుక్షణం సోవియటును యెదురుచూచుచు, దానివల్ల నూతనోత్తేజమును, ఉత్సాహ ధైర్యములను గాంచుచు, తమకు అది అండగావున్నది కదా అని

గుండెనిబ్బరంతో పోరాడుతున్నారు. కాని యీ నడవడి పారి
శ్రామికాధికారులకు, ధనాఢ్యులకు కడుపుమంట.

మనం ప్రస్తుతం మన జాతీయపోరాటంలో పూర్తిగా నిమ
గ్నులమైపోయి, యితర విషయాలను గురించి అంతగా విచారిం
చటంలేదు దీనినిబట్టి, మనకు జాతీయ పోరాటం ముఖ్యంకాదని
నేనెంతమాత్రం అనను. అది తప్పకుండా అత్యంతావసరమే.
నైతికంగాను, విజ్ఞాన రీత్యా, రాజకీయంగాను, ప్రపంచంలోని
తక్కినరాజ్యాల తోపాటు సరిసమానమయిన ప్రతిపత్తి సంపా
యించుకోవాలంటే, బ్రిటిష్ నిరంకుశాధికారం మనజాతీయ
హక్కులను అణచేటంతవరకు, బ్రిటిష్‌బ్యాంకర్లు, పారిశ్రామాధి
కారులు, యథేచ్ఛగా మనదేశంనుంచి రాకపోకలు జరిపేటంతవ
వరకు సాధ్యంకాదు. అదీగాక మనదేశ స్వాతంత్ర్యసమస్య యితర
దేశాల సమస్యలనుంచి విడదీసి, ఆలోచించుట గొప్పపొరపాటు.
ప్రపంచంలో అనేకచోట్లను, ముఖ్యంగా స్పెయిన్‌లో జరుగు
చున్న పోరాటంయొక్క ప్రాముఖ్యతను మనదృష్టియందుంచు
కొని దానికనోడించి, మనజాతీయ సమస్యనుకూడా పరిశీలించవలసి
యుంటుంది. మనసానుభూతి స్పెయినుకు పూర్తిగా చూపవలసిన
విధి మనయందున్నది. మనం స్పెయినుకు సహాయంచేయుట,
సామ్రాజ్యతత్వముతో యిచ్చట ఒక విధమయిన పోరాటమే
యగును. "డెయిలీహెరాల్డు" పత్రికా విలేఖరి యితీవలనే
వ్రాస్తూ, ఈ మధ్యనే పాలెస్టయిన్‌లో జరిగిన అల్లరులలో ఇటలీ,
చాలా ధనాన్ని, ఫాసిస్టు ప్రచారంకొరకు విరివిగా ఉపయోగించి
అల్లరులను లేవతీయటానికి విశ్వప్రయత్నాలు చేయుచున్నట్లు
తెలియచేశాడు. అతడు వ్రాసిన ప్రకారం ఇటలీ ఏజంట్లు ఇటలీ
యొక్క తూర్పు ఆఫ్రికా వలసరాజ్యములనుంచి బయలుదేరి, ఎఱ్ఱ
సముద్రంమీదుగా, 'ఏమెన్' ద్వీపకల్పములో ప్రవేశించి అంతర్యుద్ధ

మును బయలుదేర తీయాలని కుట్రలు సాగించారు. ఈ విలేఖరి యీ విధంగా వ్రాశాడు. "అంతర్యుద్ధం బయలుదేరేటట్లయితే అల్లాంటి అపూర్వమైన అవకాశాన్ని ఉపయోగించుకొనుటకు, ఎఱ్ఱసముద్రం ద్వారా 'ఏమెన్' లోనికి ఇటలీసేనలను పంపించి తీరబడును. దీని వల్ల 'ఏడెన్' యొక్క ప్రాముఖ్యత తగ్గిపోవును." కాబట్టి అరేబియా రాజకీయాల్లోకూడా ముస్సోలినీ తంత్రాలు పన్ను తున్నాడని రూఢిగా తేలుతున్నది. ఏమెన్ యువరాజు ముస్సోలినీ పద్ధతులను మెచ్చుకొనుటవల్ల, అతడు సులభంగా ముస్సోలినీ వలలో పడగలడు. అంతర్యుద్ధం సంభవించేటట్లయితే, ఇటలీ పూర్తిగా సౌఖ్యం కల్పించుకొని, యువరాజునకు సహాయంచేసి తీరును. అబిస్సీనియాను జయించిన తర్వాత, ఇక రోమను సామ్రాజ్యాన్ని వ్యాపింపచేయవలసిన అభిలాషయే లేదని ముస్సోలినీ చెప్పాడు. దీనిని నమ్మువారు కేవలం వెర్రివారు. ఈ అరేబియా కుట్రవల్ల దానినికూడా తన సామ్రాజ్యంలో చేర్చుకొనకతప్పడని తేలుతున్నది. ఇస్లాం మతమును గూడా సంరక్షిస్తానని అభయహస్త మిచ్చుచున్నాడు. ఒక్క అరేబియామీద మాత్రమే కాదు. మహ మ్మదీయ రాజ్యాలన్నిటిమీద కన్నువేశాడు. ఇందులకే ముస్సో లినీ ఏమెనులోను, యితర పట్టణాల్లోను, సైనిక కేంద్రశాలలను నిర్మించి తన పునాది గట్టిచేసుకుంటున్నాడు.

విద్రోహ సేనా నాయకులు స్పెయిన్ ప్రజాస్వామికము యెడల చేసిన అపచారం, ద్రోహం క్షమింపరానివి. విద్రోహులే కాదు, విద్రోహులకు బహిరంగంగాను, పరోక్షంగాను, అండగా నిలచి చేయూతయిచ్చిన ప్రతిదేశం, ప్రతివ్యక్తియు అంతకన్న యెక్కువ కఠినంగా శిక్షింపబడవలసినదే. స్పెయిన్ ప్రభుత్వాన్ని తక్షణమే నిస్సందేహంగా, నిరభ్యంతరంగా ఆయుధాలను కొని తెచ్చుకొనుటకు మనమంతా కోరవలసినదే. చట్టసమ్మతంగా ఎన్ను

కొనబడిన ప్రజాప్రభుత్వం న్యాయమైనదనీ, ధర్మమైనదనీ మనం యెలుగెత్తిచాటి ప్రపంచంచేత ఒప్పించవలసియున్నది. అంతర్జాతీయ న్యాయసూత్రముల ప్రకారం, విద్రోహులు (అనగా నిజమైన ప్రజాస్వామికమునకు శత్రువులు) దోపిడిగాండ్రగా పరిగణింపబడతారు. అబిసీనియాలో ఇటలీవా రెట్టి దుష్కృత్యాల నాచరించినను, అంతమంది "ప్రజాస్వామిక వాదులు" చూచుచుండియూ, నోరు మెదల్పక బెల్లంకొట్టిన రాయి మాదిరిగా సంచరించి స్వాతంత్ర్యాన్ని, ఆత్మ గౌరవాన్ని, ధనప్రాణమానములు సహితం గోల్పోవుచుండిన అబిసీనియాకు ఆయుధ సహాయం ఏమీ చేయకపోయినట్లుగానే, ఇప్పుడు 'తటస్థవిధానమ'ను ఒకమాయ నాటకాన్ని సృష్టించి స్పెయిన్ప్రజా ప్రభుత్వాన్ని మోసంచేయుట ప్రజాస్వామిక సూత్రానికి అపఖ్యాతి, అగౌరవం. ఇంగ్లండు, ఫ్రాన్సుల నడవడి ముమ్మాటికి, అశాస్త్రీయమైనది. అమానుషమైనది, గర్హనీయమైనది. నిజంగా ప్రజాతంత్రవాదులమని గర్వపడుచున్న దేశాలు వెంటనే నానాజాతి సమితిని ఒత్తిడిచేసి, స్పెయినుకు సర్వవిధాలా సహాయం పంపితేనే గాని, వారిమర్యాదగాని, సమితిమర్యాదగాని నిలువదు. ఈమచ్చ శాశ్వతంగా ఉండేదే. సన్నిహిత భవిష్యత్తులో, దానిఫలితం వారు అనుభవించి తీరుతారు. అబిసీనియాలో మాదిరిగానే, వేలకు వేలు, ఫాసిస్టు క్రోధాగ్నికి బలికావలసిందే. ఏకొద్దిమందినో చంపినంత మాత్రాన, స్పెయిన్లో విప్లవజ్వాలలు చల్లారవు. అందుచేత వరుసపెట్టి ప్రజలను పూచకోత కోయించక మానడు ముస్సోలినీ. అప్పుడుకాని తనకడుపుమంట చల్లారదు. మత గురువులు, ధనాఢ్యుల శకం మరల ఆరంభ మవుతుంది యూరప్ యావత్తుకూడా.

అబిసీనియా, స్పెయిన్ యుద్ధాలవల్ల ఇంపీరియలిజం యొక్క నిజస్వరూపం బయటపడి మనకు శత్రువులెవరో, మిత్రు

లెవరో స్పష్టపడ్డది. ముందు జరుగబోయే ప్రపంచ యుద్ధంలో మన కర్తవ్యాన్ని నిర్ణయించుకోవలసియున్నది. కార్మిక కర్షక ప్రజా రాజ్యమయిన సోవియటు రష్యాను ఫాసిస్టు విషదంష్ట్రిలనుంచి రక్షించుటయందు మన శక్తికొలది సహాయపడితేనేగాని, మనం ఆశించుకొన్న కార్మికకర్షక నియంతృత్వం సంపాయించుకోలేము. నేడుఫాసిస్టు,ఇంపీరియలిస్టు శత్రువులచే చుట్టబడి,ప్రతినిముషమును తన స్వేచ్ఛ వారివల్ల నాశనమవునేమోనని సోవియట్ రష్యా భయపడుతూ ఉన్నది. జర్మనీ ఒకవైపునా, జపాన్ ఒకవైపునా హుంకరించుచున్నవి. ఈ రెండు దేశాల మధ్య ఇటీవలనే జరిగిన మిలిటరీ సఖ్యత యీ భయాన్ని మరింత అధికంచేస్తున్నది. జర్మనీ, ఇటలీ మద్దతుతో, జెకోస్లోవేకియాద్వారా, సోవియటులో భాగ్యవంతమయిన "ఉక్రెయిన్" ప్రాంతమును కబళించాలని బహు తీవ్రంగా ఆలోచిస్తున్నది. కాని ఫ్రాన్సు, రష్యా, జెకోస్లోవేకియాలకుగల అన్యోన్య గాఢమైత్రివల్ల జర్మనీ, ఆటలు సాగవు. జర్మనీ పెట్టు ఆశలకు, భయాలకు జెకోస్లోవేకియా లోబడదు. ఒక్కపెట్టున రష్యా మీద విరుచుకొని పడడానికి విరోధులు యెన్ని యెత్తులు వేస్తున్నను, సోవియటు రష్యా, తనయొక్క అసమానమయిన వైమానిక బలంవల్లను, కార్మిక, కర్షక, యువకుల యొక్క అనుపమానమయిన సాంఘిక శక్తివల్లను, చివరకు, అజేయమై, యితర దేశాల్లోకూడా సోషలిస్టు విధానాన్ని అమలులో పెట్టుటకు సహాయపడుతుంది.

కాబట్టి స్పెయిన్ యుద్ధం కేవలం స్పెయిను యుద్ధం మాత్రమే కాదని పాఠకమహాశయులకు మరలి నొక్కి చెప్పుచున్నాను. పరస్పర విరుద్ధమైన ప్రపంచ శక్తులు అక్కడ ఘోరసంఘర్షణ చేయుచున్నవి! బ్రిటిష్ సామ్రాజ్యవాదులు 'తటస్థ విధానమ'ను తమాషాలో స్పెయిన్ స్వాతంత్ర్య సమరమునకు ప్రతిబంధకాలు

కలిగించారు. ప్రతిచోటను స్వాతంత్ర్యప్రియులైనవారును, ఇంపీరియలిజం చేత పీడింబడు ప్రతి వర్గంవారును తమ శక్తికొలది స్పెయిన్‌కు వెంటనే సహాయము చేయవలశిన ఆవశ్యకతయున్నది. సామ్రాజ్యవాదమునకు శత్రువైన ప్రతి వ్యక్తియును, యిప్పుడు స్పెయినులో జరుగుచున్న తీవ్ర సంఘర్షణ, మన స్వాతంత్ర్య పోరాటములో తప్పని సరిగా ఒక భాగమనియెంచి, స్పెయిన్ ప్రజలను మరువక వారికి సంపూర్ణ విజయం చేకూర్చుటకు మన యావచ్ఛక్తిని వినియోగించవలశియున్నది.

ఫాసిజం, సామ్రాజ్యవాద యుద్ధాలు నశించు గాక !

నిజమైన ప్రజాస్వామికం వర్ధిల్లు గాక ! !

స్పెయిను ప్రజాప్రభుత్వమునకు విజయం సిద్ధించు గాక ! ! !

---

మొదటి కూర్పు : 1000 ప్రతులు.

The Jupiter Press, G.T., Madras.